ఓం

తత్సత్,

శ్రీ పరబ్రహ్మణేనమః

# శ్రీ గోపికా రహస్యము

[ తాత్పర్య వివరణసహిత నిర్వచనైకాశ్వాసము ]



గ్రంథకర్త:

వై. యస్. కృష్ణమూర్తి

సూపరింటెండెంటు,

ఇరిగేషన్ డిపార్టుమెంటు, పి. డబ్లియు. డి.

హైదారాబాదు గవర్నమెంటు, దక్కను.



1950



వెల [illegible] 1-3-0

THE HYDERABAD BULLETIN

# BOOK REVIEWS

## SREE GOPIKA RAHASYAM

**( TELUGU )**

—— :o: ——

This is the maiden attempt in verse of Mr. Krishnamurthi interpreting the allegorical sense of Lord Krishna's relationship with Gopis, which unfortunately gave room to interested missionaries for misrepresentation and, to some extent, has been misunderstood by members of other religions. Proselytisers are not wanting, who are carrying on a vilification of Sri Krishna's Leela with Gopikas, characterising it as immoral. The book is intended to be a reply to such misinterpretations. In the humdrum of a stenographer's routine, the author found time to explain Krishna's dalliance in chaste and fluent verse. Though the theme is not new, the attempt is commendable as it tries to interpret this particular episode in Sri Krishna's life in its true perspective and thus dispel the doubts of others.

# పండితుల అభిప్రాయములు.

ఈ కృష్ణమూర్తి కవిగారు రచించి నాచేతికిచ్చిన యీ గోపికా రహస్యమను చిన్నకావ్యము హిందూస్థానమందలి హిందువులకందఱకును మహోత్సాహసంతోష దాయకమనుట నిస్సంశయము. క్రైస్తవులు కృష్ణునిక్రీడావతారచేష్టలమర్మము నెఱుంగకయు, వారికిఁదగిన గురుబోధ యసంభవమగుట యుంగారణములుగా నేవేవియో గొన్ని నిందావాక్యముల నక్కడక్కడ వ్రాసియు, వారిమతబోధలందు హెచ్చరించియు, శ్రీకృష్ణుని యాథార్థ్యమును జనులకుఁ దెలియరాకుండ నొనర్చియున్నారు. అట్లె మనముసల్మాను సోదరులుగూడఁ గొంత వరకు నిజమునెఱుఁగక, కొన్ని క్రొత్త విధానముల శ్రీకృష్ణుని నిందించియున్నారు. దీనిచిక్కును మన భారతీ యార్యసమాజకులు తమకుఁదెలిసిన మార్గలం గొందఱు సమర్థించియు మఱికొందఱు నిందించియు నానావిధముల నీమహాయోగీశ్వరేశ్వరుని యవతారమునకు లోపములనే సమకూర్చియున్నారు. ఇట్టి పరిస్థితులతో మునిఁగితేలుచున్నభరతవర్షమునకీకాలమున నీకావ్యమొక నవ్యరత్నదీపమై శ్రీకృష్ణుని యద్వైతకాంతిని వెలిగించుచు నూతన చైతన్యశోభ నొడఁగూర్చుచున్నదనుట నిస్సంశయము. దీనిని హిందువు లందఱు శ్రద్ధతోఁ జదివి, దీనిలోని యాంతరంగిక బోధయొక్క సారమును గ్రహించి, తమకు గీతారహస్యమునిచ్చి ప్రపంచంపుఁ జీఁకటిని మాన్పిన శ్రీకృష్ణావతారముయొక్కయోగసిద్ధాంతరహస్యమునుజక్కఁగఁజదివిచూచెదరు గాక యని వేడుచున్నాఁడను.

ఇట్లు విరమించు సజ్జనశ్రేయోభిలాషి,

రిటైర్డు ప్రొఫెసరు రా॥ వెంకటరామ సోమయాజులు.

శ్రీకృష్ణమూర్తిగారు రచించిన గోపికారహస్యమను గ్రంథము నామూలాగ్రముగా చదివినాను. ఇందు శ్రీకృష్ణావ తారతత్త్వము మిక్కిలి చక్కగాను, తర్కమూలముగాను, నిర్వచింపబడిఉన్నది. గ్రంథకర్త షడ్దర్శనజ్ఞానము కలిగి: తత్రాపి యోగశాస్త్రము నభ్యాసపూర్వకముగా నాచరణ మునం దుంచుకున్నట్లు కనబడును. కృష్ణలీలలను యోగసాధ నతో సమన్వయించుటలో నీగ్రంథకర్త చూపిన శక్తి అసా మాన్యముగానున్నది. శ్రీకృష్ణావతారమున కంతరార్థమున్న దని లోకములోనున్న నానుడిని ప్రయోగపూర్వకముగా నీ గ్రంథకర్త చూపియున్నారు.

శ్రీకృష్ణావతారమునకు మనవారును పెరవారునుకూడ నారో పించుచున్న వ్యభిచారాదిదోషములనుఖండించుటలోనీగ్రంథము సమర్థమగుచున్నది. ఒక్కటి మాత్రము చెప్పకతప్పదు. గ్రం థమతిప్రౌఢమై వివరణములేకపోయిన చదువరులకు శ్రమకలి గించుననుట సిద్ధము. కావున నీగ్రంథమునకు వివరణ మలం కారమగుచున్నది. వివరణమున, గ్రంథకర్తయొక్క షడ్దర్శ నపాండిత్యము స్పష్టముగా వ్యక్తమగుచున్నది. వైదికమతము నందలి యనేక విషయముల కంతరార్థము తెలిపిన మనయువ కులు తమ యపనమ్మకములను వీడి యాస్తికు లగుదురనుట నిక్కము ఈ గ్రంథ మావంక మిక్కిలి ప్రయోజనకారి. ఈ పనికి గ్రంథకర్త నభినందించుచున్నాను.

ఇట్లు
కురుగంటి సీతారామయ్య.
రిటైర్డు ప్రొఫెసరు.

శ్రీ ఎల్లాప్రగడ శ్రీకృష్ణమూర్తి గారు రచించిన శ్రీగోపికారహస్యమును చదివితిని. దానిపై వ్రాసిన గద్యవివరణ కూడా పఠించితిని.

ఇలాటి గ్రంథములు ఈ దినాలలో అరుదు అంటే అతిశయోక్తి కాదు. ధర్మమనేది బహుళవ్యాప్తిగల జీవితవిశేషము. ఇది విరుద్ధంగా విపరీతంగా కనిపించినప్పుడు సమ్యగ్విమర్శన చేయడం న్యాయము, గర్హించి పరిహరించడం విజ్ఞానలక్షణం కాదు.

గోపికా శ్రీకృష్ణులగాథ ఎంత విచిత్రంగా అసభ్యంగా కానిపిస్తున్నదో అంత ఆదరణీయంగా అభిస్తవనీయంగా మనవారు మననం చేస్తున్నారు.

ఈ గాథను బహిరావరణచ్ఛేదంచేసి తదభ్యంతర విశేషమును దర్శించారు, శ్రీకృష్ణమూర్తి గారు. యోగసాధకుడుగా ఈ రహస్యమును అన్వేషించి, అనుభూతిని వివరించారు. కృతిచిన్నదైనా విషయం మహత్తరమైనది. ప్రబుద్ధ వచనమంటే ఇలాటిదే అని భావిస్తున్నాను.

ఇట్లు
రాయప్రోలు సుబ్బారావు.
(రిటైర్డు ప్రొఫెసరు)

# ఉపోద్ఘాతము.



మా మిత్రులగు బ్ర॥ శ్రీ॥ ఎల్లాప్రగడ కృష్ణమూర్తి గారు "గోపికా రహస్య" మను గ్రంథమును వ్రాసియున్నారు. గ్రంథము మిక్కిలి చిన్నదయ్యును దీనియందమూల్యములైన యనేక యోగసూత్రములిమిడియున్నవి. గోపికా వృత్తాంతము కేవలము పచ్చిబూతులనుకొనెడి వారికీగ్రంథము సరియైన సమాధానము చెప్పుచున్నది. గోపికల పనులన్నియు నున్మత్త చేష్టలుగావనియు, వానియందొక గూఢభావమున్నదనియు, అట్టి గూఢభావమును బయల్పఱుపఁదలంచి వారీ గ్రంథమునకు "గోపికారహస్య" మని పేరిడిరి. దీనిలో నీ క్రింది రెండు పద్యములను జదువువారు రామునికిని దండకలోని ఋషులకును గలిగిన సమావేశఫలితమును బ్రదర్శించుటకై శ్రీకృష్ణుడు వ్రేపల్లెయందవతరించెనని గ్రహింపఁగలుగుదురు

చ॥ కొనకొని మీరు నేఁడు మదిఁగోరిన కోరిక మీకు ద్వాపరం
బున నిజభూతితో మఱలఁ బుట్టి యశోదకుఁ బుత్రకుండనై
యనువుగఁ గ్రీడసల్పునపు డందగఁ జేయుదు;......॥ 27

శా॥ అంతన్ ద్వాపర మేగుదేర నట బృందారణ్యసామీప్యమా
గ్రాంతర్ఘోషముల. గొల్లభామలగుచుం గర్మానుసారంబుగా
దాంతుల్సంయములుద్భవించి, ॥ 29

గోపికలయుదంతము నీకవి యీ రెండు పద్యములలో నెట్లు చెప్పెనో చూడుఁడు:—

ఉ॥ గొల్లలువీరు, శ్రీద్ధమెయిగోవులఁ గాయుదు, రింతవృత్తి, తా
మెల్లరుఁజల్లపాల్వెరుఁగులెమ్మెయిఁగూర్చిగడించుచుందురీ
సల్లలితాబ్జలోచనలు స్వల్పసుఖంబుల నాసచేయుచుం
గల్లజగంబుఁగానని ప్రకారమతోఁ చెడి నెల్లభంగులన్॥ 33

తే॥ గీ॥ శుద్ధచైతన్యమును పరంజ్యోతియందు
మున్నుక్రీడించు తాపసముఖ్యులయ్య
మన్మహామాయమునిఁగిరిమ్మాన్యమతులు
కించిదాత్ములు వీరి రక్షింపవలయు॥ 34

గోపికా విహారమును కేవలము లౌల్యమని యెంచి శ్రీకృష్ణునికి జారశిఖామణిబిరుదమును ప్రసాదించుట తగదు. గోపులాతని ధ్యాతలు, గోవిందుఁడువారికి ధ్యేయుఁడు. గోపికలాతని జారచోరగుణసంబద్ధాత్ముఁగా నెంచినను, దయామయుఁడగు శ్రీకృష్ణుఁడు మాత్రము మార్జారకిశోరన్యాయమునవారలఁ గాపాడుచునే యున్నాఁడు.

ఇట్లు చైతన్యస్వరూపుఁడగు శ్రీకృష్ణుఁడు తన బాల్యమంతయు గోపికాస్నేహరసముననే గడుపలేదనియు, కొంతకాలము యోగనిష్ఠయందును గడపెనను నభిప్రాయమీగ్రంథము చాటుచున్నది. వాస్తవమునకు సాధకుఁడు గాక యే సిద్ధుఁడు కాఁజాలఁడుగదా!

శ్రీకృష్ణుని గాథలన్నిటిలో గంభీరమైన యర్థమును ప్రకటించుటకు గ్రంథకర్త యత్నించినట్లు ఈక్రింది యుదాహరణముకూడ నొక స్ఫోరకము:—

75 వ, పద్యమునుండి కథ శ్రీకృష్ణుఁడు కాళియసర్పమును మర్దించినట్లు తెలుపుచున్నది. యోగులు తమ సాధ

నచే మూలాధారమున నిద్రించు కుండలిని నుద్బోధించి సహ-స్రారమునకుం దీసికొనిపోవుట యీకథకు గంభీరార్థమగునట్లుగ గ్రంథకర్తయే వ్యాఖ్యానించినాఁడు. ఈ సందర్భముననే కవి తన కళానైపుణ్యముచే "కుండలిని" "అంబుజాధారపల్వలము" మొదలగు నుచిత పదములనుగూర్చి ప్రకృత కథకు భంగము గలుగకుండఁ దత్త్వమును జూపి కృతార్థుఁడైనాఁడు.

ఇట్టి గంభీరార్థములు ఆర్షగ్రంథములలో నసంభవములు కావు. ఇట్టి వ్యాఖ్యానములు సంస్కృతమున నూతనములు కావు. కాని మఱుఁగుపడిన యీ విధానమును బయటికిఁ దెచ్చి మన పురాణముల కన్నిటికిని నిట్టి వ్యాఖ్యానములు కల్పింపఁబడినచో హిందూమతమునుగూర్చి యితరులకున్న అపోహలు నశించి దాని యొక్క తత్త్వము విశదముగా గోచరింపఁ గలదు.

కృష్ణమూర్తిగారట్టి ప్రయత్నమును ఆంధ్రభాషలోఁ జేసిరనునది మిక్కిలి ప్రశంసనీయము. అందులోఁ బద్యమున జరిగిన ప్రయత్నము కొంతవఱకు శైలికిని ఛందస్సునకును లోఁబడి తన స్వాతంత్ర్యమును గోల్పోవలసివచ్చును. ఈ కృతి యట్లుగాక ధారాశుద్ధికలిగి అక్కడక్కడ బమ్మెర పోతన శైలిని జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. వీరిట్టి సత్ప్రయత్నము లింకను గావించి హిందూమతమునకును దేశమునకును గూడా నపారమగు సేవ చేయుటకు భగవంతుఁడు వీరి కాయురారోగ్యాదుల నొసంగుఁ గాకయని ఆశాసించుచున్నాను.

ఇట్లు,

యస్. వీరేశ్వర దీక్షితులు, ఎమ్. ఎ.

నచే మూలాధారమున నిద్రించు కుండలిని నుద్బోధించి సహస్రారమునకుఁదీసికొనిపోవుట యీకథకుగంభీరార్థమగునట్లుగ గ్రంథకర్తయే వ్యాఖ్యానించినాఁడు. ఈ సందర్భముననే కవి తన కళానైపుణ్యముచే "కుండలిని" "అంబుజాధారపల్వలము" మొదలగు నుచిత పదములనుగూర్చి ప్రకృత కథకు భంగము గలుగకుండఁ దత్త్వమునుజూపికృతార్థుఁడైనాఁడు.

ఇట్టి గంభీరార్థములు ఆర్షగ్రంథములలోనసంభవములు కావు. ఇట్టి వ్యాఖ్యానములు సంస్కృతమున నూతనములు కావు. కాని మఱుఁగుపడిన యీ విధానమును బయటికిఁ దెచ్చి మన పురాణముల కన్నిటికిని నిట్టి వ్యాఖ్యానములు కల్పింపఁబడినచో హిందూమతమునుగూర్చియితరులకున్న అపోహలు నశించి దాని యొక్క తత్వము విశదముగా గోచరింపఁగలదు.

కృష్ణమూర్తిగారట్టిప్రయత్నమును ఆంధ్రభాషలోఁజేసి రనునది మిక్కిలి ప్రశంసనీయము. అందులోఁ బద్యమున జరిగిన ప్రయత్నము కొంతవఱకు శైలికిని ఛందస్సునకును లోఁబడి తన స్వాతంత్ర్యమును గోల్పోవలసివచ్చును. ఈ కృతి యట్లుగాక ధారాశుద్ధికలిగి అక్కడక్కడ బమ్మెర పోతన శైలిని జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది. వీరిట్టి సత్ప్రయత్నము లింకను గావించి హిందూమతమునకును దేశమునకును గూడా నపారమగు సేవ చేయుటకు భగవంతుఁడు వీరి కాయురారోగ్యాదుల నొసంగుఁ గాకయని ఆశాసించుచున్నాను.

ఇట్లు,

యస్. వీరేశ్వర దీక్షితులు: ఎమ్. ఎ.

# ప్రస్తావన.

"వేదభూమి" యు, ననేకులగు యోగీశ్వరులకుఁ బుట్టినిల్లునగు "భారతదేశము" నందు ద్వాపరయుగమున శ్రీకృష్ణభగవానుఁ డవతరించి ధర్మసంస్థాపనార్థముగా సర్వోపనిషత్సారసంగ్రహమగు శ్రీమద్భగవద్గీతను లోకులకుఁ బ్రసాదించి యుండెను. అట్టి వేదవేద్యుని గుఱించి జనసామాన్యముగాఁ జెప్పికొనఁబడుచున్న జారచోరత్వాదిగుణదోషములను నేను వినవలసి వచ్చినప్పుడు, నాబుద్ధి కదియనువఁదింపక కటువుగాఁ దోఁచుచుండెడిది. ఇట్లుండఁగా నొకనాఁ డొక మతాంతరుఁడు దన మతచర్చయందు శ్రీరాముఁడు హింసాపరుఁడై రాక్షసవంశనాశము సేసియుండెననియు, శ్రీకృష్ణుఁడు జారచోరశిఖామణియనియు, నిందించుచు, హిందూమతదైవములఁ దీవ్రముగా ఖండించుచుండఁగా నేను విని, సహించికొనలేకపోయితిని. అట్టి విచారమునకులోనైన నేను, నిర్నిమిత్తముగా నాసహచరుఁ డొకఁడు శ్రీమదాంధ్రమహాభాగవతమునందలి గజేంద్రమోక్షణమను కథను జదువుకొనుచుండఁగా, వినుట తటస్థించినది. అట్లు వినుచుండఁగా ఆగజేంద్రుఁడు దవ్వుఁలనుండి పొడఁగాంచిన కొలనుగుఱించి వర్ణించుచుఁ బోతనామాత్యునిచే వ్రాయబఁడియున్న మత్తేభవిక్రీడితవృత్తమునందలి తుదిపదమైన "కాసారముఁ" అను మాట నాచెవినిబడఁగానే, "సంసారముఁ" అను అర్థోక్తి నాకఠాత్తుగా స్ఫురించుటసంభవించినది. అప్పుడా పాఠకు నాపద్యము మఱలఁజదువవలసినదని కోరుచు "సంసారముఁ" అను పదముతో ముగించి యన్వయింపుమనఁగా, మాయిరువురకు నాయర్థము సరిపోవుచున్నట్లు దోఁచినది. అం

# సవరణ

**N. బి:-** 19—28 అంకెలకు మధ్యనున్న పేజీల నెంబర్లు తప్పుబడినవి, కనుక 20తో లెక్కించికొనవలయును.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| IV | 16 | తొల్టింటికంటె | తొల్లింటికంటె |
| V | 16 | నేలు వేలుగా | వేలు వేలుగా |
| 4 | 1 | విజనస్థానంబు లందుండి,సచె | విజనస్థానంబు లందుండి,చె |
| డిటో | 2 | దుష్టాసక్తింబోనాడి, | దుష్టాసక్తింబోనాడి,స |
| 20 | 12 | బాముకొలపి | బాదుకొలిపి |
| 34 | 8 | శీ్రమద్భగవద్గీత | శ్రీమద్భగవద్గీత |
| 41 | 14 | అతురబడుచున్న | ఆతురబడుచున్న |
| 42 | 9 | నిమగ్మ్నలగుచు | నిమగ్నులగుచు |
| 48 | 1 | జెందివారై | జెందినవారై |
| 63 | 14 | సైర్యము | స్థైర్యము |
| 75 | 17 | సర్వోపనిషద్సార | సర్వోపనిషత్సార |
| 81 | 9 | శబ్దబహ్మమై | శబ్దబ్రహ్మమై |

# ప్రస్తావన.

"వేదభూమి" యు, ననేకులగు యోగీశ్వరులకుఁ బుట్టి నిల్లునగు "భారతదేశము" నందు ద్వాపరయుగమున శ్రీకృష్ణ భగవానుఁ డవతరించి ధర్మసంస్థాపనార్థముగా సర్వోపనిష త్సారసంగ్రహమగు శ్రీమద్భగవద్గీతను లోకులకుఁ బ్రసాదించి యుండెను. అట్టి వేద వేద్యుని గుఱించి జనసామాన్యముగాఁ జెప్పికొనఁబడుచున్న చారచోరత్వాదిగుణదోషములను నేను వినవలసి వచ్చినప్పుడు, నాబుద్ధి కదియనువందింపక కటువుగాఁ దోచుచుండెడిది. ఇట్లుండగా నొకనాఁ డొక మతాంతరుఁడు దన మతచర్చయందు శ్రీరాముఁడు హింసాపరుఁడై రాక్షస వంశనాశముసేసియుండెననియు, శ్రీకృష్ణుఁడు జారచోరశిఖా మణియనియు, నిందించుచు, హిందూమత దైవములఁదీవ్రముగా ఖండించుచుండఁగా నేను విని, సహించికొనలేకపోయితిని. అట్టి విచారమునకులోనైన నేను, నిర్నిమిత్తముగా నాసహచరుఁ డొకఁడు శ్రీమదాంధ్రమహాభాగవతమునందలి గజేంద్రమోక్షణ మను కథను జదువుకొనుచుండఁగా, వినుట తటస్థించినది. అట్లు వినుచుండఁగా ఆగజేంద్రుఁడు దవ్వులనుండి పొడఁగాంచిన కొలనుగుఱించి వర్ణించుచుఁ బోతనామాత్యునిచే వ్రాయబఁడి యున్న మత్తేభవిక్రీడితవృత్తమునందలి తుదిపదమైన "కాసారముఁ" అను మాట నాచెవినిబడఁగానే, "సంసారముఁ" అను అర్థోక్తి నాకతాత్తుగా స్ఫురించుటసంభవించినది. అప్పు డాపా ఠకు నాపద్యము మఱలఁజదువవలసినదని కోరుచు "సంసారముఁ" అను పదముతో ముగించి యన్వయింపుమనఁగా, మాయుగపుఁరకు నాయర్థముసరిపోవుచున్నట్లు దోచినది. అఁ

తట నాఘట్టమును శ్రద్ధతోఁ బునః చదివి పోల్చిచూచికొను చుండఁగా, నర్థము సరిపోవుచు,—

"భ్రూమధ్యమునందలి మనోమయమైన త్రికూటమను విశాలమగు పర్వతముమీద, జీవాత్మయను గజేంద్రుడు స్వేచ్ఛగా విహరించుచు, యౌవనాగమముతో విరహ తాపమును బొందినవాఁడై, సంసారమను కోమలాంగి చేత నేకాంతమునందాకర్షింపఁబడి, వివాహవిధియందు గాలుఁబెట్టఁగా, దక్షణమే అహంకారమను బలీయమైనమకర మొకటితన్నాక్రమించికొనినదయ్యెను. అట్లు సంసారమునందుఁదగుల్కొని పతితుఁడైన ఆవ్యక్తి అష్టమదములతోడి దురభిమానియై పౌరుషమే ప్రధానమని తలచి బహువిధ ప్రయాసములకులోనై వేయిసంవత్సరములుగా సాధించిననూ, ఆయహంకారము దన్నువిడిచిపెట్టమిఁ, జకితుఁడై, తుదకువివేకించి సర్వాధారుఁడైన ఈశ్వరుఁడెవ్వఁడైనా దన్ను రక్షింపఁజాలినవాఁడసలున్నాడో లేడోయని శంకించియుఁ గృతనిశ్చయుఁడై మూఢభక్తిఁబూని మనోవాక్కాయములను త్రికరణశుద్ధితో ఆజగద్రక్షకుని శరణు బొంది ప్రార్థింపగాఁ నామఱుక్షణములోఁ దాను విముక్తుడై తననిజస్వరూపమును మోక్షమును బొందెను"—

అని యంతరార్థము పూసగ్రుచ్చినట్లు బొడఁగట్టెను. అట్లు పదపడి విమర్శించికొని, ఆ రీతిగా భాగవతము నందలి శ్రీకృష్ణలీలలను ఘట్టమునందుఁగూడ నిట్టియంతరార్థమేమైనా యుండవచ్చునా యని యాపురాణభాగమును సాంతముగాఁ

జదువుట కారంభించితిని. అట్లు చదువుకొనుచుండఁగా, నక్కడక్కడా కొన్ని యంతరార్థములు దోచుటయేకాక, ముఖ్యముగా శ్రీకృష్ణుఁడు వ్రేపల్లెయం దేకాదశవర్షముల ప్రాయము వచ్చువఱకే పెరిగియుండెననియు, కంసవధానంతరము మధురానగరములోనే బలరామకృష్ణుల కుపనయనము జరిగి, సాందీపుని యొద్దకు విద్యాభ్యాసమునకై పంపఁబడి యుండిరనియు, తరువాత శ్రీకృష్ణుఁడు రాజ్యభారమును వహించి మధురాపురిని బాలించుచుండఁగా రుక్మిణీదేవిని గళ్యాణమాడి యుండెననియు మొదలగు విశేషాంశములను గమనింపఁ గలిగితిని.

ఆ విధముగా నయ్యవతారపురుషుఁ డేకాదశవర్షముల ప్రాయము వచ్చుదనుక వ్రేపల్లెవాడలో సామాన్యమానవుని వలెనే పెరుగుచుండి, గోగోపగోపీజనమధ్యమున నిర్వర్తించిన జ్ఞానపరివర్తన ప్రకారమును వివేచించుచు, నాయోగేశ్వరేశ్వరుఁడు దన బాల్యమునందు మార్గదర్శనముగా షణ్మాస ప్రమాణముచొప్పున యోగసాధనకూడఁ జేసిసిద్ధిగాంచియుండెనను విశేషాంశము బ్రకటించుచు శ్రీమదాంధ్రమహాభాగవతపురాణమున వర్ణింపఁబడిన శ్రీకృష్ణుని బాల్యక్రీడల ననుసరించియే, నేనీ "గోపికారహస్య" మను చిన్ని పొత్తమును దొలుదొల్త నిర్వచనమైన కావ్యాసముగా వ్రాయఁదొడంగితిని.

ఇట్లు బ్రారంభించి ముగించిన దానిని మొదటఁ దాత్కాలికముగాఁ గొలదిప్రతులుగా మాత్రమే ముద్రింపించి పరిచయమైన వారల కొసంగుతు వచ్చితిని, కాని ఆపద్యకావ్యమును జదివిన వారల కాకవిత్వవిషయమును, పురాణగాథాప్రశంసయుఁ దప్ప, అందలి విశేషాంశములైన నాభావము లవగతముగా లేదని తెలియవచ్చుటచేత నే నాలోపమును

గూడ సవరించికొనవలసియున్నదని నిశ్చయించికొంటిని. కాని ఆకాలములో సంఘటిల్లిన ప్రపంచయుద్ధము, రాష్ట్రకల్లోలములు మొదలైన కారణాంతరములవల్ల నే నీగ్రంథమును వెంటనేపూర్తిఁజేసి ప్రచురింప లేకపోయినందులకు క్షమింప వేడుకొనుచున్నాను.

అట్లు ప్రస్తుతకాలపరిస్థితులలోగూడ నీనాటికైనా ఆ ప్రయత్నమును గొనసాగించి యీ గ్రంథమైన "శ్రీగోపికారహస్య" మను ఆత్మయోగసిద్ధాంతమును దాత్పర్యవివరణసహితనిర్వచనైకాశ్వాసముగా ముగించుటకు నన్ను బ్రోత్సహించిన నామిత్రవర్గమునకును, బూర్వమునందీ పద్యగ్రంథముపైఁ దమయపూర్వపుమన్ననను జూపుచు నుపోద్ఘాతము వ్రాసిన బ్ర॥ శ్రీ॥ శనగవరపు వీరేశ్వరదీక్షితులుగారికిని నా కృతజ్ఞతను దెలుపుచు నే నీగ్రంథమును జూపించినదే తడవుగా దీనిపైఁ దమ యమూల్యాభిప్రాయములొసఁగిన,—

1. బ్ర॥ శ్రీ॥ రాయప్రోలు వెంకటరామ సోమయాజులుగారికి,
2. బ్ర॥ శ్రీ॥ కురుగంటి సీతారామయ్యగారికి,
3. బ్ర॥ శ్రీ॥ రాయప్రోలు సుబ్బారావుగారికిని

నా కృతజ్ఞతానమస్కారము లర్పించుకొనుచున్నాఁడను.

ఈగ్రంథమును వ్రాయుట నాకుఁ బ్రథమ ప్రయత్నమగుటచేఁ జదువరు లిందలి తత్త్వార్థములను "హంస-క్షీర" న్యాయమునఁ బరిగ్రహించెదరు గాక యని విశ్వసించుచున్నాను.

ఇట్లు
మమాత్మజనప్రియుఁడు,
గ్రంథకర్త.

శ్రీరస్తు.

## —:కవి వంశావళి:—

సీ॥ పూరుఁడై, యమితగంభీరుఁడై, ధీరుఁడై,
పేరుఁ బొందినవాఁడు పెద్దతండ్రి
భీముఁడై, విమలనిష్కాముఁడై, రాముఁడై,
వన్నెకెక్కినవాఁడు గన్నతండ్రి
దాంతుఁడై, విపుల వేదాంతుఁడై, శాంతుఁడై,
మిన్నుఁబ్రాకినవాఁడు చిన్నతండ్రి
యోగ్యుఁడై, బహుళార్థభాగ్యుఁడై, కృషికుఁడై,
చెన్నుమీఱినవాఁడు చిన్నతండ్రి
తే॥ కవనసంగీతసాహిత్య ఘనకళా వి
శారదుఁడు, యోగి, మా కడసారితండ్రి
యత్రిమునిచేఁ బ్రతిష్ఠితంబై వెలుంగు
"మునికుదురు" గ్రామవాసులు పుణ్యధనులు॥

శా॥ ఎల్లాప్రగ్గడవంశసంజనితుఁడై హృద్వీధి సద్భక్తి రా
జిల్లన్ శ్రీ 'హరిదాసు' నాఁబరఁగుచున్ "సీతా"భిధానాంచితో
త్ఫుల్లాబ్జాక్షికిఁ బ్రాణనాథుఁడయి యొప్పన్
"రామకోటయ్య" యా
సోల్లాసాత్మతృతీయపుత్రకుఁడ నాత్మోపాసనాసక్తుఁడన్

క॥ భారద్వాజ సుగోత్రుఁడ
ధారుణి 'నార్వేలశాఖఁ' దనరినవాఁడన్
పేరునను గృష్ణమూర్తిని
నారసి శ్రీగోపికారహస్యము వ్రాతున్

---



గ్రంథకర్త : మొదట పద్యభాగమును రచించునప్పుడు 25 వ వయస్సునన దీసినఫొటో

శ్రీ

సద్గురుభ్యోనమః

# శ్రీవిఘ్నేశ్వర ప్రార్థన

శ్రీ సిద్ధివినాయకునిన్
వ్యాసార్చితషట్చతాజపాగాయత్రున్
భాస 'వ-శ-ష-స' దళస్థున్
దాసోహంబనుచు మ్రొక్కెదన్ తొలివేల్పున్॥

# శ్రీసరస్వతీ ప్రార్థన

శ్రీలలితాంగుళీప్రచుర రేఖలనొప్పెసలారు తంత్రికా
లోల, విలోలలోచన, సరోజజు ముద్దులగుమ్మ, వాక్సుధా
జాలవిలాసవర్తిని, విశాలజగన్నుతశీల, శారదా
బాలఁ దలంచెదన్మది సుభావపదైక కవిత్వసిద్ధికిన్॥

# సిద్ధపురుషుల ప్రార్థన

వ్యష్టిస్థమైన యాత్మ స
మష్టిని బరమాత్మయై సమస్తజగంబున్
పుష్టిం జేయును గావున
సృష్టిపరంపరఁగ ముక్తజీవులఁ గొలుతున్.

శ్రీ

సచ్చిదానంద పరబ్రహ్మణేనమః

## —:భగవత్ప్రార్థన:—

# పార్థా!

స "దోం" త దవ్యాకృతమూలప్ర
కృతిఁబొంది జీవుఁడై తతమహాజ్ఞ
నిత లింగదేహ భాసితుఁడై జడాత్మక
మయిన స్థూలాది దేహంబులందు
నెనరొప్ప నేకాదశేంద్రియవ్యసనుఁడై
తన్నెఱుంగక కర్మతంతుగ్రిడగుచుఁ
జంచలంబైన సంసారప్రయుక్తిచే
బాల్యాది భౌతికావస్థ లమరి
క్రీడ సలుపుచుఁ దిరిగి స్వకృతసుకర్మ
నప్రతిహతైక వైరాగ్య మలవరించి
కర్మనంటక మెలఁగి సంస్కార మొందు
నని ప్రబోధించు "భగవంతు" నాశ్రయింతు॥

"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశ సశ్రియః
జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇ తీరణా॥

అనఁగా సమగ్రమైన ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, సంపత్తి, జ్ఞానము, వైరాగ్యము అను నీయాఱు లక్షణములు గలిగినవాఁడే భగవంతుఁడని శృతు లందుఁజెప్పఁబడియున్నది. కావున ఓం కారవాచ్యుఁడైన నిరాకారపరబ్రహ్మ మనునది కేవలము జడస్వరూపమైన వస్తువుగాక, యీవడైశ్వర్యముల చేనొప్పె యున్న జ్యోతిస్స్వరూపమని విశదమగుచున్నది. ముఖ్యముగా, ఐశ్వర్యము తోడి జ్ఞానవైరాగ్యములని వివరింపఁబడి యుండుటచేత ఆపరబ్రహ్మమునందు కర్మ చేయుచుండుట అనుస్వభావము సిద్ధమగుచు ఆరీతిగా విశ్వమంతయుఁ గల్పించికొని జగన్నాటకసూత్రధారియై క్రీడించుచున్నాఁడనియే స్పష్టమగు చున్నది.

వివరణ :—

నిరాకారాఖండ నిర్గుణ పరబ్రహ్మము నుండి జీవాత్మ యనున దేవిధముగా సంకల్పింపబడి మూలప్రకృతితో వ్యాపకమైనదియు, నెదుట నున్న ప్రకృతిపటము నందు జూపింపబడి యున్నది.

అందు మొదట నట్టిట్టిదనరాని అఖండ పరిపూర్ణ నిర్గుణ పరబ్రహ్మ మాద్యంతములు లేక నిండి యున్నదని గ్రహింపవలసి యున్నది. అట్టి అవ్యక్త పరబ్రహ్మమునే ఓం-అనియు, తత్-అనియు, సత్-అనియు మూడు విధములుగా వాచ్యార్థము నందు శృతులామోదించి పిలుచుచున్నవి. ఆరీతిగా బ్రహ్మర్షులైన వారా అవ్యక్తపరబ్రహ్మ మెట్లున్నదా యని విమర్శించి కొనియు, నెక్కువగా దర్శించ జాలక, అఖండమైన జ్ఞానానందమహత్స్వరూపముగా నున్నదని మాత్రమే వ్రాక్కుచ్చి యున్నారు. అనగా అఖండముగా నున్న మహత్తు, అఖండముగా నున్న బ్రహ్మజ్ఞానము, అఖండముగా నున్న బ్రహ్మానందము నను వస్తువిశేషము లేకరసమై అయ్యఖండ పరిపూర్ణ పరబ్రహ్మముగా నొప్పి యున్నదని తెల్సికొన గలిగిరి. ఆ మహత్తు, బ్రహ్మజ్ఞానము, బ్రహ్మానందము ననునవి, మూడును ననంతములైన వస్తువిశేషములనియే చెప్పికొన వలసి యున్నది గాని, వాటిని వస్తువిశేషణములని యర్థము సేయగూడదు. అనగా నవ్యక్త పరబ్రహ్మమను వస్తువొకటి వేఱుగా నుండి ఆవస్తువున కీ మూడును గుణములుగ నున్నవని యన్వయింప వీలు లేక, యీ మూడు మహారసములు గలిసి యేకమైయుండియే

పరబ్రహ్మముగా నొప్పి యున్నదని చెప్పికొనవలసియున్నది.

ఇప్పుడొక మారు పై పటము నందు జూపించిన భాగ విభాగములను గమనింపుడు. అందు దేహప్రకృతి, ఇంద్రియ ప్రకృతి, మనః ప్రకృతి, బుద్ధి ప్రకృతి యను నీ మెట్టులను గ్రమముగా నధిగమించి, నిర్వాణపదము, పరనిర్వాణపదము మహాపరనిర్వాణపదము లను మెట్టులు సూచింపబడి యున్నవి. ఈ మెట్టులు వరుసగా నొక దానికంటె మఱొకటిగా సూక్ష్మములై యుండి, యుచ్చస్థానములుగా నున్నవి. అట్లు చూపింపబడి యున్న యీ యేడు మెట్లును రెండేసి విభాగములుగా జేయబడి యుండి, పై భాగము, క్రింది భాగమని గ్రహింపవలసి యున్నది. అట్లాయవ్యక్తపరబ్రహ్మము మహర్షులచేత దెలిసికొనబడి యున్నట్లుగా, మహా నిర్వాణ పదమునందు మూడు చక్రములు వేఱు వేఱుగా నొక్కే పై భాగమున జూపబడి యున్నవి. వాటిని గ్రమముగా మహాత్, బ్రహ్మజ్ఞానము, బ్రహ్మానందమని చెప్పికొనిన, మహాత్ అనునది మాత్రమా పై భాగము నుండి క్రిందికి దిగక యుండగా, బ్రహ్మజ్ఞాన మనునది పరనిర్వాణ పదము నందలి పై భాగము వరకు మాత్రము వచ్చి నిలబడుచుండి, బ్రహ్మానంద మనునది 5 వ మెట్టుగా నున్న నిర్వాణపదము యొక్క పై భాగము వరకు వ్యాపించు చున్నది. అట్లు పటము నందు జుక్కలు బెట్టి చూపబడి యున్నది. చూడుడు. ఆ విధముగా నణుబీజముగా నిర్వాణపదము వరకు దిగివచ్చిన బ్రహ్మానంద రస మొక్కటియే ఆ యవ్యక్తపరబ్రహ్మము యొక్క అంశ యని చెప్పికొనిన, ఆ అఖండ స్వరూపమును ఖండించి

వేటు చేసినట్లగుచున్నది. కనుక అది పూర్ణాంశ గానే యున్నదని గ్రహించుటకు మహత్ చక్రము నుండి మేటవా లుగా జూపియున్న గీట్ల ననుసరించి, ఆ మహత్తును, విజ్ఞాన మును, నిర్వాణ పదమున కందరాక యున్నను, ఆ అణుబీజ ముగా దిగివచ్చిన ఆనందరసమునందు దమ యఖండస్వభా వముతో నిమిడియే యున్నవని తెలిసికొన వలసి యున్నది. అట్టి యా జ్ఞానానందమహద్రసమగు నవ్యక్తపర బ్రహ్మము యొక్క యేకాంశమైన యీయణుమాత్ర నిత్యానంద నిర్గుణ పురుషుడే గుణమయమగు నీ విశ్వమంతయు సృష్టించి భరిం చికొని యున్నాడు.

"అథవా బహు నైతేన కింజ్ఞాతేన త వార్జున ।
విష్టభ్యాహ మిదంకృత్స్న మేకాంశేన స్థితో జగత్ ॥

(శ్రీమద్భగవద్గీత)

ఓ యర్జునా! నా విభూతుల నే నెంతని శ్రమపడి నీకు వివరింప గలను. నీ వెంతని యోపికతో వినగలుగుదువు. నే నీచరాచరమయ్యమైన యీవద్విశ్వమును నేకాంశముచేతనే సృజించి ధరించి యున్నాడను.

అట్లా నిర్గుణ పరబ్రహ్మము ఏ తన యొక్క శక్తిచేత నవ్యక్తము నుండి వ్యక్తమును సంకల్పించెనో, ఆ చిచ్ఛక్తియే విద్య యనియు, శుద్ధమాయాశక్తి యనియు బిలువబడి యున్నది. అట్టి వ్యక్తావ్యక్తసమ్మేళనమైన యా చిచ్ఛ క్తియు ననంతము గానే యున్నదని చూపుచు, పట్టము

నందలి నిర్వాణ పదములోని మధ్యభాగములో చిన్న చిన్న యడ్డగీట్ల మధ్య వ్రాయబడియున్నది. గమనింపుడు. ఈ శుద్ధ మాయా శక్తిని గడచిన ముక్తాత్ములు విదేహముక్తి నొందిన వారలై నిత్యానంద ప్రధానముగా నెలుగ బడుచున్న యా అణుమాత్ర నిర్గుణ పురుషునిలో నైక్యము బొందుచు బునరావృత్తి లేని నిర్యాణ మొంది నిత్యసిద్ధులగు చున్నారు.

ఈ నిత్యసిద్ధులును నొక్కొక్కప్పుడు పరబ్రహ్మముచే నాదేశింపబడి ధర్మ ఘోషణకై మరల బుట్ట వచ్చును. కాని ఆ జీవాత్మ తొల్లింటి జీవాత్మయే యని చెప్ప వీలులేదు. సముద్రము నందలి తరంగ మొక మా ఆసముద్రజలములో నణగిపోయిన, మరల నా తరంగమే లేచి రాజాలదు. ఒక వేళ నదే తరంగము మరల బయటికి వచ్చునది యైనను, మొదటి స్వరూపము కంటె పెద్దదిగానో లేక చిన్నదిగానో యుండుటయే సంభవింపవలసి యున్నది. అట్లే పరబ్రహ్మైక్యము నొందిన జీవుడు లోకోపకారార్థమై తిరిగి జన్మింపవలసి వచ్చిననూ, తొల్లింటికంటె భిన్నరూపముగానే భగవంతునిచే సంకల్పింపబడి జ్ఞానానందమహత్స్వరూపుడై ప్రహ్లాద నారదాది నిత్యసిద్ధుల వలె నాజన్మజ్ఞానిగానే పుట్టుచు, దన ధర్మరక్షణ ముగించికొనగానే మరల బ్రహ్మైక్యమునే పొందుచున్నాడు.

ఈ చిచ్ఛక్తి నుండి సత్త్వరజస్తమో గుణము లనునవి ప్రభవించి నందువలన, ఆ నిర్గుణ పురుషుడు సగుణపురుషుడై అణుస్వరూపమునొంది శక్తిప్రధానముగా నిలచియున్నాడు.

అనగా, ఆ సగుణ బ్రహ్మమునందు గూడా మహత్తు, బ్రహ్మ జ్ఞానము, బ్రహ్మానంద మను మూడు విశేషములా యవ్యక్త పరబ్రహ్మము నుండి మూర్తీభవించియే యున్నను, యవి బుద్ధికి గ్రాహ్యములుగా నుండుటకు వీలులేమి, ఆసగుణబ్రహ్మ మందు విశేషముగా భాసమానమైన యీశక్తి బీజమునే ముముక్షు డెఱిగికొనుచున్నాడు. అట్టి సగుణబ్రహ్మ సాక్షాత్కారములోనే సాధకుడు జీవన్ముక్తుడై మోక్షాధికారి యగుచు, ప్రారబ్ధకర్మ క్షయముతో విదేహ ముక్తిని బొంది నిత్యానందనిర్గుణపురుషునిలో నైక్యము నొందుచున్నాడు.

అట్లు శక్తి ప్రధానముగా గోచరించు నీ సగుణ బ్రహ్మమందు గూడా అవ్యక్తపరబ్రహ్మస్వరూపమైన జ్ఞానానందమహద్రసములు మిక్కిలి సూక్ష్మీకరణము నొంది యున్నను, యా లక్షణములను స్వభావ మాత్రముగా నైనా గ్రహింపవలసి యున్నది. ఆరీతిగా బటమునందు మూడు మూడేసి చక్రములతోనే సత్, చిత్, ఆనందములను మూడు రసములు వేఱువేఱుగా గ్రహింపబడియున్నవి. ఈ మూటిని నిర్వాణపదమునందలి జీవన్ముక్తి యను క్రింది భాగమున వరుసగానే చూపించికొనుచు, వాటి యేకత్వమును గూడా గ్రహించుకొనుచున్నాను.

ఇప్పుడివి క్రింద నున్న బుద్ధిప్రకృతి యను నొక్క మెట్టులోనే వికారము జెందుచున్న విశేషమునుగమనింపుడు. సత్- అను రసము మాత్రము బుద్ధిప్రకృతి కతీతము గానే నిలిచియున్నది. కాని, చిత్- అనునది మధ్య భాగము వరకు

దిగుచు "తెలివి" యను విరూపము నొందియున్నది. ఆనంద-మనునది కూడా బుద్ధిప్రకృతిలోని మధ్యభాగము నందు 'సుఖ' రస మను రూపముగా మార్పు జెందుచు, క్రింది మెట్టయిన మనః ప్రకృతి లోని పై భాగమగు కారణశరీరమువరకు క్షీణించి, అవిద్య (లేక) మూల ప్రకృతి యొక్క స్వభావమైన యింద్రియ శక్తులచేత నావరింపబడియున్నది. అట్లాసత్తా మాత్రుడైన సగుణపురుషుడు బుద్ధి ప్రకృతిద్వారా వ్యాపించి మూలప్రకృతిస్వరూపమైన కర్మేంద్రియ జ్ఞానేంద్రియ శక్తుల యొక్క సంఘర్షణ బొంది జీవాత్మ (లేక) ఎఱుక మాత్రము గా నిలబడి యున్నాడు. ఆ ఎఱుకయు ప్రక్షీణమైన సుఖ బీజముతో మనః ప్రకృతి యొక్క నిరాకార భావమునందే గోచరించుట చేత, పాంచభౌతికస్థూలదేహోపాధి నొందిన జీవాత్మ జాగ్రదావస్థలో నిరాకారభావము నసలే స్మరింప బోమి నందలి సుఖప్రపత్తిని గూడ బొత్తిగా గ్రహింపక, కర్మేంద్రియజ్ఞానేంద్రియ కార్యమైన యింద్రియ శక్తుల ద్వారా సులభసాధ్యములుగా నున్న బాహ్యార్థముల నపేక్షించుచున్నాడు.

అట్లాయవ్యక్త పరబ్రహ్మమే లీలామేయుడై సంకల్ప మాత్రముతో దన యధీనమునందున్న విద్య, 'అవిద్య యను శక్తి విశేషములం దేకాంశ మాత్రముగానే ప్రవేశించి విశ్వమంతయు నెలకొల్పికొని జీవాత్ముడై యావిర్భవించి వర్ణ రూపప్రధానముగానున్న నానావిధదేహోపాధుల ధరించి విస్తరిల్లి విహరించు చున్నాడు.

ఆ విధముగా సంభవించిన జీవాత్మ తన యొక్క మనో బుద్ధులీ పాంచభౌతికమైన సాకార లక్షణ దోషము బొందగా వ్యష్టిభావమైన యహంకారమును జెందినవాడై, తానాపరబ్రహ్మాంశగా నున్న నిజ లక్షణమునే మఱచి దేహాత్మాభిమానియై, కర్తృత్వ భోక్తృత్వాది కర్మకలాపము నారోపించికొని, జనన మరణాది రూపమైన సంసారచక్రము నందు బరిభ్రమించుచు, ధన దారా పుత్రులను ఈషణత్రయ బాధితుడై బాల్య యౌవన కౌమారాద్యవస్థల నొందుచు, శిశ్నోదర పరాయణుడై జీవయాత్రల నడపుకొనుచున్నాడు. అనగా నిట్టి కర్మ దోషమంతయు దన కర్తృత్వ కార్యమైన దేహాభిమానమునుండియే కలుగుచున్నది. కాని యాదోష మాకర్మలకు గాని, తన యాత్మస్వరూపమునకు గాని చెంది యుండలేదు. అట్లి జనన మరణ హేతువైన దురభిమాన దోష మునకు దన బుద్ధీంద్రియమే కారణముగా నున్నది. కావున నాబుద్ధితో నిటు నిహవిషయముగా గర్మఫల త్యాగియగుచు నటు బరవిషయముగా భక్తి ప్రధానముగా నుండిన, దాను దన నిజ స్వరూపము నెఱిగికొనగలుగుచున్నాడని స్పష్ట మగుచున్నది.

ఆ విధముగా మనుష్య మాత్రుడైన జీవుని యొక్క లక్షణములను బటము నందలి దేహ ప్రకృతి యను మెట్టులో దెలిసికొనియుంటిమి. కాని, యీపాంచభౌతికసృష్టిజాలము నందలి మిగిలిన జీవరాసులను మాత్రము వేఱుగా నింకొక మెట్టుక్రిందగానే చూపవలసి వచ్చినది. ఎందువల్ల ననగా, ఆ ప్రకృతులలోని జీవరాసుల యొక్క యింద్రియ శక్తులా

దేహములలో జడస్వభావముగా నుండి, మానవ దేహములో ప్రకాశించి యుండుటయే గాక, ఆ జీవస్వరూపము గూడా మానవ శరీరమునందే పూర్ణ స్థితిలో నిలబడుచున్నది కాని, చతుష్పాద బహుపాద జలచర భూచర జంతు జాలములందు గాని, వృక్షలతాది స్థావర ప్రకృతియందు గాని, అట్లు సమగ్రముగా వ్యష్టిరూపము గలిగి యుండుట లేదు. అనగా నీ స్థావర జంగమ ప్రకృతులలో ప్రతియొక్క దేహోపాధి యందు నొక్కొక్క జీవాత్మగా వ్యాపింపక, జీవుడు సమూహ దేహి యగుచున్నాడు. అనగా నొక్క జీవాత్మయే కొన్ని దేహముల సముదాయమునందు ప్రవేశించి, పరివర్తన బొందుచున్నాడు. ఎట్లనగా, ఒక భాండము నందలి శుద్ధ జలమును వేలు వేలు చిన్నచిన్న పాత్రిలలో బోసిన, నాయా పాత్రల లోని నీ రా యాపాత్రిల యొక్క దోషములతో సంకరము నొందుచున్నది. అట్టి యా పాత్రలలోని నీరును మరల గలియ బోసిన, ఆసంకరమంతయు నేకమగుచున్నది. అట్లే జీవులు దమ సమూహమునకు జెందియున్న కొన్ని కొన్ని స్వభావజనితములగు లక్షణముల తోనే పుట్టుచున్నవి. ఉదాహరణముగా నీటిలో సంచరించెడి బాతుయొక్క గ్రుడ్డును నీటికి భయపడు కోడిపెట్టయే పొదిగియుండినను, ఆ గ్రుడ్డు నుండి బైట బడగానే యా బాతు పిల్ల నిర్భయముగా నీటిలోనికే ప్రవేశించి స్వేచ్ఛగా నీదులాడుచున్నది. ఈవిధముగా నీగలు, దోమలు, చీమలు, మొదలగునవి గుంపులు గుంపులుగానే పుట్టి పొరలుచున్నవి. అట్లే పక్షులు, పశువులు, మొదలైన యుచ్చ జాతులందు గూడా చాలునకు రెండు,

మూడుగా సహజముగానే పుట్టుచున్నవి. ఇక వృక్షలతాదుల విషయమున్ననో వేఱుగా జెప్ప నక్కఱయే లేదు. ఆరీతిగా సమూహదేహి యైన జీవాత్మ యేదో యొక పెంపుడు జంతువువలె బరిగణింపబడినప్పుడు, మానవప్రకృతిలక్షణము లందు దిగుచు సంకర్షణ బొంది, కుక్క, గుఱ్ఱము, మొద లగు జంతువులవలె విశ్వాసహేతు రూపమైన కార్యాలోచ నము లోనై బలాత్కారముగా జిత్త విజృంభణము నొందిన మీద, తన దేహసమూహమునకు దెగిపోయి విడిగా సమగ్ర మైన జీవాత్మ గానే నిలిచిపోవుచు, మానవత్వము నొంది క్రమముగా నుచ్చస్థితికి బోవుచున్నాడు.

అట్టి సంపూర్ణమైన జీవస్వరూపము గల మానవ దేహమునం దా పరబ్రహ్మస్వరూప మెట్లు ప్రవేశించియున్నది తెలిసికొన గలుగుటకుగాను, ఆ ప్రకృతి పటములో వేఱుగా జూపబడి యున్న నాడీపటము నించుక గమనింప వలసి యున్నది.

ఆ నాడీ పటమునందు నెం. 1 అను గుర్తుతో జూప బడియున్న నిర్గుణపురుషుడు, ఆ ప్రకృతిపటములోని నిర్వాణ పదము యొక్క విదేహముక్తి యను పైభాగమందు జూప బడియున్న అణుమాత్ర నిత్యానందనిర్గుణపురుషుడే యని యెఱుంగ నగును. ఆ నిర్గుణపురుషు డట్లు ప్రాణమయకోశము నుండి, ఆనందమయ కోశములో నున్న రెండు కన్నులయొక్క

నల్లగుడ్డులందు బ్రవేశించి వర్ణరూపప్రధానముతో సూక్ష్మ ప్రపంచమును జూచి యానందించుచుండుటయే కాక, అన్య నాడిద్వారా హృదయకమలమునందలి జీవాత్మను సదా లాగ పట్టుకొని యున్నాడు. ఆ దేవిధముగా ఆనిర్గుణ పురుషునుండ బైలుదేరిన నెం. 10 అగు చిచ్ఛక్తి యను శుద్ధమాయాశ జ్ఞాననేత్రమైన అగ్నిమండలము నందు నివసించుచు, అష్టదళ పద్మమునుండి సంతతధారగా స్రవించుచుండెడి యమృతము నాస్వాదన చేయుచుండుటయే కాక, శ్వాసను ఇడా పింగళా నాడుల ద్వారా ఝామున కొకమారుగా మార్చి దినమునకు 21, 600 చొప్పున నాడించుచు, ఆజ్ఞాచక్రము నందలి రెండ దళములతో సంకల్పవికల్పములను కలిగించుచున్నది. ఆదే విధముగా ఆనిర్గుణపురుషునినుండి ప్రభవించిన అవిద్యారూప మైన మూలప్రకృతి, కుండలినీశక్తి యన బరగుచు, వెన్నె ముక యందు (పటములో నిలువు గీటతో సూచింపబడి యున్నది) గపాలము నుండి మూలాధారము వరకు వ్యాపిం చియున్న నెం. 19. 13. సుషుమ్నా (లేక) బ్రహ్మనాడి యను సన్నని నరము ద్వారా నధోముఖగా నడచి, నెం. 14 అగు మూలాధార చక్రమునందు వసించి నిద్రించుచుండుటయే కాక, తల్లక్షణమైన కర్మేంద్రియ జ్ఞానేంద్రియ ప్రకారమైన ప్రాణశక్తిని నెం. 15 అగు స్వాధిష్ఠాన చక్రమునుండి బైలు దేరిన 72000 నాడుల ద్వారా శరీరమంతయు వ్యాపింప జేయుచున్నది.

ఇట్టి శరీర తత్వములో నివృత్తిమార్గమునందు సాధకుని యొక్క నాడీ కూటమునం దుద్భవించు వైష్ణవ జ్వర మను

ఉష్ణము చేత నా కుండలినీశక్తి మూలాధార చక్రము నుండి లేచి యూర్ధ్వముగా గదలి బ్రాకుచు, ఆజ్ఞాచక్రము నుండి సూర్యమండలమను పేరిటి అర్చిరాదిమార్గముగా అష్టదళ పద్మము సొచ్చి సగుణ బ్రహ్మసాక్షాత్కారమను సిద్ధి నొసగు చున్నది. ఈ కుండలినీశక్తి నెం. 8 అగు చంద్రమండల ములోనికి బోయిన, మోక్షదూరుడై పునర్జన్మము నొందు చున్నాడు. అట్లా కుండలినీశక్తి సహస్రార మందలి ప్రాణమయ కోశమునుగూడా ప్రవేశించిన దక్షిణమే కపాల మోక్షమై అమృతనాడి ద్వారా జీవాత్మ పరమాత్మలో నైక్య మగుచు విదేహముక్తి యను నిర్వికల్పసమాధి సిద్ధించు చున్నది. అట్టి విదేహ ముక్తి నుండి మఱలి వచ్చిన నిత్య సిద్ధులగు పరమహంసలకు నెం. 3 అగు శుక్ల పేటిక యం దేర్పడు "ఓజస్సు" అను తేజోరసము భూత భవిష్యద్వర్త మానమను కాలజ్ఞానము నొసగుచు ఋషీంద్రుల జేయు చున్నది. ఆ ఓజశ్శక్తియు దా నస్ఖలితబ్రహ్మచర్య విధిగా సేకరించి యుంచికొనిన శుక్ల ప్రమాణముగా నేర్పడుచు నామహర్షిని ఒక నెల, ఒకవర్షము, ఒకయుగము, ఒకమహా యుగమునను పరిణామభేదములతో త్రికాలవేదిని జేసి బ్రహ్మ ర్షిగా బ్రకాశింప జేయుచున్నదనియు నుపనిషద్వాక్యములందు జెప్పబడి యున్నది.

ఇట్టి యీ జీవాత్మ పరమాత్మల సంబంధమును వివే చించు విషయమున 1. సాంఖ్యమార్గము, 2 బౌద్ధమతము, 3. పూర్వ మీమాంస, 4. యోగ సిద్ధాంతము, 5. తర్క

శాస్త్రము 6. ఉత్తర మీమాంస, (లేక) వేదాంతము అను నీ యారు మార్గములును బూర్వము నుండియు ప్రచారములుగా నున్నవి. అవి యెట్టివనగా:—

**1. సాంఖ్య మార్గము:** ఇది కపిల మహర్షి చేత స్థాపింపబడెను. ఈ మతమునందు ఈశ్వరుడన వేఱుగా లేక పరమాత్మయే పురుషుడై యున్నాడు. ఆ పురుషుడును ప్రకృతియు గలిసి ప్రపంచ మగుచున్నది. ఆత్మయైన పురుషుడు నిమిత్త మాత్రముగా నుండి ముక్తి సమయమున ప్రకృతినుండి వేఱగుచు కైవల్యము నొందుచున్నాడు. ఆత్మ కుంటివానివలెను ప్రకృతి గుడ్డివాని వలెను యుండి, నడువ జాలని కుంటివానిని దాను మోసికొని పోవుటకు సిద్ధమైనచో ఈ గ్రుడ్డివానికి కుంటివాడు త్రోవ జూపికొనుచున్నాడు. ఆవిధముగా ఆత్మ ప్రకృతి నుపాధిగా జేసికొని ప్రపంచమును గల్పించుకొను చున్నది. యజ్ఞాది కర్మలచేత ముక్తి లేదు. పరోపకారాదుల చేతనే మోక్షము గలుగుచున్నది.

**2. బౌద్ధ మతము:** దీనిని స్థాపించినది సుగతుడు. శాక్యుడు ప్రచారకుడయ్యెను. జీవేశ్వరుల విషయము అవాఙ్మానసగోచరములు గావున ఆ విమర్శన మనావశ్యకము. ప్రత్యక్షానుమానములే ప్రమాణములు గాని, వేదశబ్దములు ప్రమాణములు గావు. ఈ బౌద్ధమతము నుండి నాలుగు శాఖలు వెలువడినవి. 1. సర్వం దుఃఖం దుఃఖం-అనగా దుఃఖవాదులు, 2. సర్వం క్షణికం క్షణికం-అనగా క్షణికవాదులు,

3. సర్వం స్వలక్షణం స్వలక్షణం-అనగా స్వలక్షణవాదులు,
4. సర్వం శూన్యం శూన్యం-అనగా శూన్యవాదులు.

ఈ సర్వశూన్యవాదులలోను నాలుగు తెగలుగలవు: 1. యోగాచార్యులు, 2. మాధ్యమికులు, 3. సౌత్రాంతికులు 4. వైభాషికులు. మొదటి తెగవారు బాహ్య శూన్యత్వము నొప్పుకొని, విజ్ఞానమే సత్యమనిరి. మాధ్యమికులు సర్వము శూన్యమనిరి. మూడవ తెగవారు బాహ్యార్థములు కేవలము అనుమేయములే కాని ప్రత్యక్షములు గావనిరి. వైభాషికులు బాహ్యార్థములే ప్రత్యక్షములనియు, విజ్ఞానమే అనుమేయమనియు ప్రతిపాదించిరి. అట్లు బౌద్ధులు మొత్తము మీద శూన్యవాదులనియు, బాహ్యవాదులు (లేక) బాహ్యకులనియు రెండు శాఖలైరి.

బౌద్ధమతసిద్ధాంతములరీత్యా మానవునకు దా జేయు కర్మ ముఖ్యము. తాను చేయు ప్రతియొక్క పనియు కర్మయే యగుచున్నది. కర్మకు ఫలము తప్పదు గనుక దాని ననుభవించుటకై మరల జన్మ కలుగుచున్నది. కావున జన్మరాహిత్యమునకు గర్మనే సన్యసించుట ముఖ్యము. అట్లు జీవుడు శూన్యత్వము (లేక) నిర్వాణమును బొంది శాంతినొందుచున్నాడు.

**2. పూర్వ మీమాంస :** ప్రవక్త జైమినిమహర్షి- ఈ మతప్రకారముగా నటు సాంఖ్యముగాని, యిటు బౌద్ధమతము గాని ముక్తిసొసంగవు. వేదమంతయు ధర్మమునకుమూలము. సనాతనధర్మములే యాచారములు. వేదోదిత నిత్యనైమిత్తిక

కర్మచుళే యొక ధర్మమను దేవతావిశేషమున నావిర్భవించి మరణానంతరము స్వర్గ సుఖముల నిచ్చును.

**4. యోగ సిద్ధాంతము :** ప్రవక్త పతంజలి మహర్షి. ప్రాణాయామాద్యష్టాంగ యోగసాధనచే నంతరింద్రియము లను బాహ్యేంద్రియములను వశపఱచికొని, చిత్త వృత్తుల నిరోధించి. సమాధి నిష్ఠాగరిష్ఠుడై కైవల్యము నొంద వలయు ననుట. చిత్తైకాగ్రత బొందుటకుగాను, అనేక విధములుగా ప్రతీకములను (అనగా ధ్యానము చేయుటకు ఆకారములను) గల్పించికొని సాధన చేయవలెను. అట్లు ఒక్కొక్క వస్తువు పై ధారణ, ధ్యానము, సమాధిని బొందిన సంయమించినవా డగుచున్నాడు.

**5. తర్క శాస్త్రము :** ఇది రెండువిధములు, 1. న్యాయ దర్శనము 2. వైశేషికము.

1. న్యాయ దర్శనము:- ప్రవక్త గౌతముడు. యథార్థ జ్ఞానమునకు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము లను గురించి చెప్పుచు నెదుటి పక్షము వారి సిద్ధాంతములను ఖండించు యుక్తులు గలది. ఇందు ఈశ్వరత్వము లేదు.

2. వైశేషికము: ప్రవక్త కణాదుడు. ఇదియు న్యాయదర్శ నమువంటిదే, కాని పరమాణువాదము. జగత్తు అణుమయము. సుఖదుఃఖములు, ఔషధములు, ప్రళయము అన్నియు అణు కారణములు. ఇదియు నిరీశ్వరమతము.

### 3. ఉత్తర మీమాంస (లేక) వేదాంతము (జ్ఞానకాండ)

స్థాపకుడు వేదవ్యాసుడు. జీవాత్మ పరమాత్మ సంబంధము లగు నుపనిషద్వాక్యముల నేరి బాదరాయణుడు బ్రహ్మసూత్రముల నొనరించెను.

ఈ వేదాంతము నుండి 1. ద్వైతము, 2. అద్వైతము, 3. విశిష్టాద్వైతము, లను అభిప్రాయభేదములు ప్రవర్తిల్లెను. కాని యీ మూడును ఆస్తిక మతములే.

1. ద్వైత మనగా జీవుడెప్పుడును ఈశ్వరుడు గాజాలడు. ఆతనా శరీరముతో బరలోకమున ననుభవించును. ఎక్కువ పుణ్యముచే ఈశ్వర సాన్నిధ్యము బొందును.

2. అద్వైత మనగా జీవుడు ఈశ్వరుడే యై యున్నాడు. కాని తాను మాయచేత గప్పబడి తన నిజత్వమును మఱచి యహంభావమును బొంది దేహాభిమానియై, కర్తృత్వ భోక్తృత్వముల నారోపించికొను చున్నాడు. పుణ్యాతిశయముచే మఱల దేహాభిమానమును అహంకారమును వదలిన తన సచ్చిదానందస్వరూపము నెఱుగుచున్నాడు. సగుణోపాసన కే దేవుడైననూ నొకటియే.

3. విశిష్టాద్వైత మనగా జీవు డీశ్వరుడు గానేరడు. ముక్తియందు సాటిరూపమును మాత్రము బొందును. ఈ మతస్థులు గొందరు విష్ణు పరముగా వైష్ణవు లనియు, శివ పరముగా శైవులనియు పిలువబడిరి.

ఇట్లభిప్రాయభేదములతో ననేకమతములు ప్రచారములోనికి వచ్చిననూ యీ మతములన్నియు యథాస్థితిలో జీవు

డు పతితుడై క్షుద్రావస్థలో నున్నాడనియు, తాను ప్రయత్నించిన ఉచ్చదశకు బోగలడనియు నొక సర్వసామ్యమైన సూత్రము ననుసరించియే యున్నవి. అట్లు సృష్టి యందలి నానావిధ జీవరాసులలో, మానవజన్మయే సర్వోత్కృష్టమై యున్నది. అదియు కలియుగప్రమాణముతో నూరువత్సరముల పరిమితి నొంది యున్నది. అందు సగము నిద్రలోలయమైపోవుటయే కాక బాల్యకౌమారయౌవనాద్యవస్థలలో గూడా సర్వము నష్టమగు చున్నది. అట్టి స్థితిలో మానవుడొక్క జన్మలోనే ముక్తి సాధించు నిమిత్తమై నాలుగాశ్రమ ధర్మములు గల్పింపబడినవి. అందు కౌమారావస్థయే సాధనకు యోగ్యమై యున్నది కాన, కౌమారావస్థ నుండి 12 ఏండ్లు వేదాధ్యయన మనబడు బ్రహ్మచర్యాశ్రమ మనియు, తరువాత 12ఏండ్లు గృహస్థాశ్రమమనియు, పిమ్మట 12 ఏండ్లు నస్ఖలితదీక్షతోడి తపశ్చరణ మనబడు వానప్రస్థాశ్రమ మనియు, తదనంతరము సన్యాసాశ్రమ మనియు గల్పింపబడెను. వానప్రస్థాశ్రమతపోదీక్షయందు భార్యాసమేతముగానే నడపి ఆత్మసాక్షాత్కారమను జీవన్ముక్తి నెఱిగికొని, తదనంతరము సన్యాసాశ్రమము బ్రవేశించి జ్ఞానబోధ చేసి తుదకు మోక్షము బొందుచు ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములను ఈ జన్మలోనే సాధింప గలుగుచున్నాడు. బ్రహ్మచర్యాశ్రమధర్మము, వేదాధ్యయనమును; గృహస్థాశ్రమ ధర్మము, ఋతుసమాగమ వ్రతము తోడి వంశాంకురమును; వానప్రస్థాశ్రమ ధర్మము, అస్ఖలితబ్రహ్మచర్య దీక్షతోడి తపస్సునైయున్నవి. "తపము లే దుపవాస

వ్రతంబుకంటె" నని యన్నట్లుగా, తపమనగా ఉపవాసవ్రత మేయై యున్నది. అది క్రమముగా దినమునకు రెండు కుడుపు లని కొన్నాళ్లు సాధింపవలయును. తరువాత ఒంటి పూట భోజనము సాధింపవలయును. తరువాత రెండు దినముల కొక మాఱుగాను, మూడు దినముల కొకమాఱుగాను, యిట్లు క్రమముగా అభ్యాసబలముతో పక్షోపవాసదీక్షయు, మాసోపవాసదీక్షయు సాధింపగలిగిన, ఆ యా దీక్షల కా యా శక్తి సామర్థ్యము లేర్పడుచున్నవి. మాసోపవాసదీక్షతో మోక్షాధికారు డగుచున్నాడు. మాసోపవాసదీక్షకంటె నధికముగా నుపవసించుటచే ఆత్మహింస జరుగుచున్నదని మాసమునకు మించిన పరిమితి నిషేధింపబడినది. కాని, ముఖ్యముగా తన కంఠధ్వని క్షీణించిన, తత్క్షణమే దీక్ష నాపివేయవలె నసుట సాధకు డెప్పుడు గమనింపవలసి యున్నది.

ఈ పైజెప్పబడిన యన్ని మతములకంటెను నవవిధ భక్తియే శ్రేష్ఠమును సులభమునని శ్రీశుకమహర్షి మతము:-

మ॥ తను (1) హృద్భాషల సఖ్యముఁ (2) శ్రవణముఁ
(3) దాసత్వముఁ (4) వంద (5) నా
ర్చనముఁ (6) సేవయు (7) నాత్మలో నెఱుకయుఁ
(8) సంకీర్తనం (9) చింతనం,
బను నీ తొమ్మిది భక్తిమార్గముల స
ర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతుఁ
సత్యంబు దైత్యోత్తమా॥ (శ్రీమద్భాగవతము)

ఇట్టి వేదాంతధర్మమైన భక్తియోగమును—శ్రీశంకరాచార్యులవారుగూడా తరువాత నామోదించి తదనుగుణ్యముగా దేవాలయములు విగ్రహారాధన గల్పించినట్లుగా—ద్వాపరయుగాంతము నాటి భగవద్గీతయందు శ్రీకృష్ణభగవాను డీక్రిందివిధముగా బ్రతిపాదించి యుండెను:-

1. ఓం-తత్-త్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥

అనగా ఆ అవ్యక్తపరబ్రహ్మము బ్రహ్మసూత్రములందు ఓం-అనియు, వేదములందు తత్-అనియు, యజ్ఞయాగాది కర్మకాండయందు సత్-అనియు, పిలువబడుచు 'ఓంతత్సత్' అను మంత్రము చేతనే పూర్ణముగా గలిపిచెప్పబడుచున్నది. ఆస్వరూపమునే తరువాత 'సచ్చిదానంద'స్వరూపమని చెప్పుట వాడుకలోనికి వచ్చియున్నది.

2. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

ఓ యర్జునా! ఆ పరమాత్మయే సర్వభూతముల యొక్క హృదయస్థానమునందు నిల్చి తన మాయాశక్తి యను కర్మసూత్రముచేత యంత్రములను నడపుచున్నట్లుగా గదలించి యాడించుచున్నది.

3. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

కావున నో యర్జునా! కర్మఫలమునం దాసక్తి విడిచిన యోగయుక్తి గలిగిన వాడవై కర్మలనే చేయుము. అప్పుడు నీకు కర్తృత్వముగాని భోక్తృత్వముగాని యుండదు. ('యోగః బుద్ధి సుకౌశలం' అని చెప్పబడి యున్నట్లుగా, యోగ మనగా బుద్ధికౌశల్యము (లేక సమత్వమని గ్రహింపనగును).

4. సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ
తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే॥

సన్న్యాస మనగా కర్మసన్న్యాసము; కర్మయోగమనగా కర్మలను చేయుచు ఫలమును వదలుట. ఈ రెంటిలో గర్మలను బూర్తిగా వదలుట కంటె, యోగయుక్తితో గూడిన కర్మయే గొప్పది యగుచున్నది.

5. ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః॥

తన ఆత్మచేతనే త న్నుద్ధరించికొనవలయును. తన ఆత్మయే తనకు బంధువును శత్రువును నగుచున్నాడు.

6. క్లేశోఽధికతరస్తేషా మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తాహిగతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే॥

అవ్యక్త బ్రహ్మోపాసనము మనస్సునకు క్లిష్టముగా నుండును. వ్యక్తులైన దేహధారు లవ్యక్తోపాసన చేయుటకు మిక్కిలి కష్టముతో సాధింపవలసి యున్నది. కనుక వ్యక్తమైన సగుణోపాసనయే సులభసాధ్యము సుమా.

7. శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానా ధ్ధ్యానం విశిష్యతే
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్॥

మూఢాభ్యాసము కంటె జ్ఞానము శ్రేష్టము. జ్ఞానము కంటె ధ్యానము శ్రేష్ఠము. ధ్యానముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠము. తరువాత త్యాగము కంటెను శ్రేష్ఠమైన శాంతి కలుగుచున్నది.

8. యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యస్సమేప్రియః॥

అట్లు యిష్టాయిష్టములు, శుభాశుభములు, విడిచ్చి, నాకు భక్తుడైనవాడు నాకు ఇష్టుడు, అనగా శ్రేష్ఠుడు.

9. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణంవ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచ॥

కావున అన్ని ధర్మసంబద్ధములు విడిచి సర్వసంగపరిత్యాగివై నన్నే శరణుబొంది కర్మలను చేయుము. అట్లైన నేను నిన్ను సమస్త పాపములనుండి తప్పక రక్షించుచున్నాను. కావున నీవు అన్యధా శోకింప బనిలేదు.

10. ఓ మి త్యేకాక్షరంబ్రహ్మ వ్యాహర న్మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్॥

అట్లు ఎవ్వ డవసానదశయందు "ఓం" అనెడి యే కాక్షరమంత్రము నుచ్చరించుచు, నన్ను స్మరించుచు, దేహము

వదలి పోవుచున్నాడో, వాడు బరమోత్కృష్టమైన గతిని బొందుచున్నాడు.

అని భక్తిపరమైన త్యాగలక్షణమునే నిర్వచించుచు, సంగ్రహముగా:-

"ఓ పార్థా! సత్-అని చెప్పబడు నా ఓంకారమే తన మాయాశక్తియైన మూలప్రకృతితో గలిసి జీవాంశ సంభూతుడై క్రీడార్థముగా లింగదేహమును ధరించి జడమైన స్థూలాది శరీరములందు నేకాదశేంద్రియ వ్యాపారు డగుచు తాను బరమాత్ముని యంశము గానే నుండినప్పటికి, తన నిరాకారత్వమును మఱచి, సాకారాభిమానియై యహంకారమునొంది దేహాత్మైకబుద్ధితో నింద్రియలోలుడై సంసార చక్రమున జిక్కి మాటిమాటికి బుట్టి గిట్టి పరిభ్రమించుచు తుదకు స్వార్జితమైన పుణ్యవిశేషముచే నింద్రియవాసనలందు విరక్తిబొంది త్యాగియగుచు గర్మఫలము నపేక్షింపక ప్రారబ్ధశేష మను జీవయాత్ర ముగించికొని తుదకు అక్షరపరబ్రహ్మత్వ మన్న సంస్కారమునొంది నిత్యసిద్ధుడై ప్రకాశించుచున్నాడు సుమా!"

యని ప్రబోధించిన యా శ్రీకృష్ణభగవానుడు నన్ను సదా రక్షించుగాక!!!

ఓం తత్సత్

శ్రీమద్రామావతారపరబ్రహ్మణే నమః॥

# శ్రీగోపికారహస్యము

ఓంకారరూప! విగతా
హంకారమునీంద్రహృద్గుహాంతర్వర్తీ!
శంకావిరహితభక్తవ
శంకర! సచ్చిత్సుఖాత్మ! సర్వేశ! హరీ!

—— ——

సీ॥ త్రేతాయుగమున నుద్రేకించి పూర్వదే
వానీక[1] మతిఘోరమైన భంగిఁ
గవిసి, గోవుల యోగిగణముల మానుల
భూసురప్రతతి స్వర్భువననాథు
నప్సరోవర సిద్ధ యక్షాది సాధ్యగం
ధర్వ నిలింపుల సర్వలోక
ములఁ గ్రూరులగుచుఁ బాముల[2] బెట్టఁదొడఁగ ని
ర్వీర్యులై దివిజు లవ్వేధఁ[3] దలఁచి

1. దైత్యులు, దానవులు, రాక్షసులను యన్ని తెగలవారు.
2. కష్టముల 3. బ్రహ్మదేవుని.

తే॥సత్యలోకమునకు నేగి జలజగర్భు
చరణపంకేరుహంబుల శరణుఁజొచ్చి
వరము మును బొంది దైత్యసంహారణమునకు
మొనయుమని కోరి వేడిరి మనికితముగ ॥

ఉ॥ వారిజసంభవుం డమరవర్యులనెల్ల దయార్ద్రచిత్తుఁడై
కూరిమి నాదరించి, రణకోవిదులైన నిశాచరేశులం
బోరునఁ దాకలేమి, నిజబుద్ధిఁ దలంచి, పురాణపూరుషుం
దారకశబ్దవాచ్య సుఖదాయకు స్తోత్రముసేసి వేడినన్॥2

మ॥అభయంబయ్యెడుమీకు, దివ్యవరగర్వాంధాత్ములై రాక్షసుల్
శుభకార్యంబుల కెగ్గుఁ జేయుచు,జనక్షోభంబుగా లోకముల్
వ్యభిచారంబులపాలుసేసి, మతముల్ వంచించి, పాపాత్ములై
రభవా! కాలముగూడఁ జంపెద స్వకార్యంబింత పొండిండ్లకున్॥ 3

క॥అని యొకభీషణనాదము
వినఁబడినం గలతఁ దేఱి వేల్పులు వనజా
సనుఁ దగువిధమున వీడ్కొని
చనిరి శుభంబయ్యెననుచు సదనోన్ముఖులై॥ 4

ఉ॥దుర్జయులైన దానవులు దోర్మదులై కసి దేవకోటులన్
గర్జనతర్జనల్ సెలఁగఁ గారియఁబెట్ట విదారితప్రకా
రోర్జితచిత్తవృత్తులుయథోచిత సత్త్వగుణప్రధానమై
కర్జముఖీలఁగాఁ బ్రకృతి కార్యముబొందిక్రమ్మికమంబునన్॥

ఆ॥ కాలమనుసరించి గంభీరమగుచుఁ గేం
ద్రత్వ మొంది మేఘరాజిపోలె
నీలవర్ణ మెలయ నెఱిఁ బరిణామంబు
నొందుచుండెఁ గర్మయుక్తమగుచు॥

ఆ॥ అట్లు పరిణతిల్లి యవతారపురుషుఁడై
దశరథేశ్వరునకు ధర జనించెఁ
బట్టమహిషి యైన భార్య కౌసల్యయం
దోజతో సమష్టితేజ మపుడు.

మ॥ తన సర్వాంగములందు దీధితులు విస్తారంబు గాఁ బ్రజ్వరి
ల్లిన 'శ్రీ' యొప్పి, తదాత్మరూపవిలసల్లీలల్మనోరమ్యమై
చన "రాముం" డనఁ జెల్లి, భాసిలెఁ దదజ్ఞాస్వాత్మ
తాంశుల్ కనం
గనితాంతైకసుఖప్రదంబులయి వెల్గం బూర్ణ 'చంద్రుం'[1]
డినన్॥ ౮

క॥ అక్షీణబలుఁడు రాముఁడు
దక్షుండై వెడలి క్షాత్రధర్మము బేర్మిన్
రక్షోగణసంహారం
బక్షయమని చేరె దండకారణ్యంబున్॥ ౯

1. చంద్రుఁడు.

శా॥ సారంబైన వివేకమూని, విజనస్థానంబులందుండి, సచె
న్నారన్ శాంతమనస్కులై తనరి, దుష్టాసక్తిఁబోనాడి,
ర్వారంభంబులుమాని, సంతతము "బ్రహ్మోఽహం-
శివోఽహం-నసం
సారమ్మేస్తి" యటంచునుండి రట విశ్వాసాత్ములై
సంయముల్ ॥10

మ॥ ఒకనాఁడాభువనైకమోహనుఁడునత్యుత్సాహమే పారదం
డకసుక్షేత్రములందునన్ కృమునికూటంబేర్పడంగాంచి, లో
నికి సుస్వాగతుఁడై ప్రమోదకరుఁడై నేత్రోత్సవాకారుఁడై
యకలంకోజ్జ్వలుఁడై వెలింగె మునితారానీక రాకేందుఁడై

సీ॥ తొలకరిమొగులు కాంతులనీను నవకోమ
ల శ్యామలాంగ విలాసవరుని
బదునాల్గుభువనముల్ ప్రభవించు మహిత నా
భీకంజగంభీరవివరయుతుని
దిశలెల్ల వెలిగించు దినరాజు రేరాజు
రహిఁ విరాజిల్లు నేత్రములవాని
బేదటికము వాపు పెద్దముత్తైదువ
శయమించు విపులవక్షంబువాని
తే॥ "గలదు-లే" దనఁ జెల్లెడి కౌనువాని
భద్రకుంజర[1]యాన వైభవమువాని
రుచిరలావణ్య నతుల తారుణ్యుఁ బురుష
మోహనోద్దాము రఘుకులాంభోధిసోము॥ 12

1. భద్రజాతి యేనుఁగు.

క॥ అనిమిషులై కన్గవ ము
జ్జనితాశ్రుకణంబులొలుక సంయమివర్యుల్
గని, తద్వదనామృతమును
ఘనముగ సేవించి రధిక కౌతుకమొదవన్॥ 13

శా॥ ఆనీలత్వము, నామహోన్నతియు, నాయాజాను బాహుత్వ, మా
పీనుల్ నేత్రము, లాభుజాస్యగళనాభీపాదపద్మంబు, లా
కాన్తాపెందొడలాయురంబు, నాకటం, గందర్పబాణంబులై
మానిస్వాంతములందు నాటినమహామాయాపరిభ్రాంతులై॥

ఆ॥ వన్నెకాఁడటంచు హృన్నియమముఁదప్పి
యంగజాగ్నివివశలైన యావ
నాంగులట్లు గడు భయంబు సంభ్రమము ద
లిర్పఁ గదిసి కౌఁగిలింపఁ బూని॥ 15

క॥ మగవాఁడని, నగుఁబాటని,
బెగడువడుచు, జడత గదుర బెదరుచు, లోలో
వగరుచు, నువ్విళ్లూరుచు,
మొగములు పరికించికొనుచు మురియుచుఁ దమలోన్॥ 16

ఉ॥ అక్కట! ధీరవృత్తి విపినాంతములందు వసించి, గింజలం
బొక్కుచుఁ బెక్కువర్షములు పూనికతో వ్రతచర్యనుండి, చేఁ
జిక్కనియింద్రియంబులఁ గృశింపఁగఁ జేయుచు, జీవయాత్రచే
స్రుక్కినమమ్ము, నేఁడు పురుషుండొకఁడిట్టుల నేచెడింగదే॥

చ॥ అచలసమాధియోగమున నంచితభక్తిమనంబుఁ గ్రుచ్చి, చి
త్త చలనవృత్తుల న్నిలిపి, తర్కక బుద్ధిని మాన్చి, కర్తృ క
ర్మ చదిపి, మించి, యద్వయసమాహితవర్తనమందు వెల్గు నా
త్మ చలితమయ్యెనెట్లొకో? వృథా కద నేఁడు తపఃప్రభావముల్॥

తే॥ ఆ పరబ్రహ్మ మీ రాముఁ డగుచుఁ బుట్టె
ననుట నిశ్చయమయ్యె, నయ్యాది విశుద్ధ
హంసవాచ్య మగునుగాక, నరయ హేయ
మైన యీ దేహ మాత్మ మగునె తలఁప?॥ 19

క॥ సాక్షిస్వరూపమై, ఫా
లాక్షాది తృణాంతమై, మహద్రూపంబై,
యక్షరమై, ప్రత్యక్ష వి
లక్షణ మైనట్టిదే పరబ్రహ్మ మగున్॥ 20

క॥ గడ్డములు నెరసి, మిక్కిలి
జడ్డుఁదనము గదుర నొడలు సడలించి, కడు
న్నెడ్డెలగునట్టి ముసలి
గొడ్డులమై యుండి, యిట్లు గోరం దగునే? 21

తే॥ అని బహుప్రకారముల నెమ్మనములందుఁ
గడు వితర్కించి యనురాగ ముడుగ లేక
ప్రీతి నాలింగనము సేయు వేడ్క గడలు
కొనఁగ వేగిర పడుచున్న మునుల నరసి. 22

శా॥ ఆలోకేశ్వరుఁ డాచరాచరవిభుం డారామచంద్రుండు శ్రీ
డాలోలాత్మకుఁ డామునీంద్రులయభీష్టం బంతరంగంబునం
దాలోకించి దయాసముద్రుఁడుస్వభక్తార్థప్రదుండౌట హృ
న్నీలీరాగముదోప వారిఁగలయన్వీక్షించి సోత్కంఠుఁడై॥

సీ॥ తాపసోత్తములార! తథ్యంబు బ్రాహ్మణా
ధీనుఁడనగు దేన; ధృతి దలిర్ప
నేమానవుం డేని హృదయకమలమందు
సర్వమంగళకర సత్త్వరూపుఁ
డన నొప్పు నన్ను భావన సేయ నిరతిశ
యానంద మొసఁగుదు, నమరలోక
మాదిగా నీవిశ్వ మతనిద యైయుండు;
శుద్ధమనస్కులు సిద్ధపురుషు

తే॥ లంచితాధ్యాత్మయోగవిద్యార్థవేదు
లుత్తమోత్తములగు మీర లుత్సహించి
సురుచిరాలింగనముఁ గోర, దొరక దెట్లు ?
వరుస సిద్ధించు నది మీ కవశ్యముగను॥ 24

ఉ॥ ఐనను మీయభీష్ట మిపు డక్కట! చేకుఱఁజాల, దెట్లనన్
మానితమైన సత్యనియమంబులఁబూని చరించు జానకీ
జానిని గౌఁగిలించు టపచారముగాన నిషిద్ధమింత, యో
ధీనిధులార! రాముని యతీతసతీవ్రత మట్టిదాఁ జుఁడీ!॥ 25

తే॥ వరతపఃపుణ్యధనషడైశ్వర్యసమితి
కడఁగి మూర్తీభవించి నా కాయమయ్యె
నన్ను నిమ్మేన నాలింగనమును జేయఁ
గాత్రు లోరులెవ్వ? రొక్క భూపుత్రితక్క॥ 26

చ॥ కొనకొని మీరు నేఁడు మదిఁ గోరినకోరిక మీకు ద్వాపరం
బున నిజభూతితో మఱలఁ బుట్టి యశోదకుఁ బుత్రకుండనై
యనువుగఁ గ్రీడసల్పు నపుడందగఁ జేయుదు; నేడు స్త్రీలువో
లె నిటులఁ గోరుటందగఁ జరింతురు గోపికలౌచు మీరటన్॥

తే॥ అనఁగ "నీ మహాత్మునకు సాయకము నొకటె,
మాట యొక్కటె, యొకరిత మగువ యట్టె,
ఔర! యీ దివ్యరామావతార నియమ
సరణి యిట్లొప్పెనె?" యను గుసగుసలాదవె॥ 28

శా॥ అంతన్ ద్వాపరమేగుదేర నట బృందారణ్యసామీప్యమా
గ్రాంతర్వ్రాజముల గొల్లభామలగుచుం గర్మానుసారంబుగా
దాంతుల్సంయములుద్భవించి మమతం దత్క్రియాలోలురై
భ్రాంతింబొంద యశోదగాంచెఁ గడుసారన్ 'కృష్ణు'
దోచిష్ణునిన్॥

ఉ॥ బాలుఁడు గోపబాలకుఁ డపారకృపాదిగుణాలవాలుఁ డు
న్మాలితరాగలోభమదమోహవికార సుశీలుఁ డవ్యయ
శ్రీలలితుండు భక్తజనసేవితచిన్మయరూపుఁ డాత్మలీ
లాలమతంత్రుఁ డంచితభవాంబుధిబాడబుఁ డాత్మదల్పుఁడే॥

శా॥ అజ్ఞానాంధపరీతలైన వ్రజకన్యానీక మధ్యస్థుఁ డ
త్త్వజ్ఞానప్రదుఁడైన కృష్ణునెడ దైవత్వంబు లక్షింప నా
త్మజ్ఞానంబులఁ జూఱఁబుచ్చిగుణసంతానంబులం జొచ్చినం
బ్రజ్ఞాలభ్యుఁడు దేవదేవుఁడు గృపాపారీణధారేయుఁడై॥

కం॥ వ్రేపల్లె గొల్లపడుచులు
చూపొఱఁగి ప్రవృత్తియందుఁ జొఱఁబడి కామ
వ్యాపారతఁ జంచలలై
తాపత్రయగుణములందుఁ దలఁపడి రకటా!॥ 32

ఉ॥ గొల్లలువీరు,శ్రద్ధమెయి గోవులఁ గాయుదురింతవృత్తి,తా
మెల్లరుఁజల్లపాల్పెరుఁగు లెమ్మెయిఁగూర్చి గడించుచుందు,రీ
సల్లలితాబ్జలోచనలు స్వల్పసుఖంబుల నాసచేయుచుం
గల్లజగంబుఁగానని ప్రకారము తోఁచెడి నెల్లభంగులన్॥ 33

తే॥ శుద్ధచైతన్యమయపరంజ్యోతియందు
మున్ను గ్రీడించు తాపసముఖ్యులయ్యు
నన్మహామాయ మునిఁగి, రి మ్మానవ్యమత్తులు
కించిదాత్మలు, వీరి రక్షింపవలయు॥ 34

కం॥ అని చింతించి యదూత్తముఁ
డనుకంప తొలంగి నిజసహచరులతోడం
జని వారి సిరులఁ గొనియెం
జనదే సిరిమగని కఖిల సంపదలఁ గొనన్? 35

మత్త॥ అల్లనల్లన గోపబాలకు లందఱున్ గుమిఁగూడి రా
మెల్లమెల్లఁగ నిండ్లలోనికి మిణ్కుఱించుచు దూఱి బల్
మల్లుఁడై కల పాలు వెన్నల మంచిగా దిగఁద్రావి, యా
గొల్లభామల మర్లు గొల్పెను గూర్మి శైశవలీలలన్॥ 36

మ॥ అబలల్ చంచలలజ్ఞతంబరము సర్వాత్మున్ హరిన్ మాధవున్
సబలున్[1] లక్ష్యము సేయనేటికి రజ[2]స్సంబంధలై భ్రాంతలై
ప్రబలంబైచను జారచోరగుణసంబద్ధాత్ముఁగా నెంచి, డా
సి బహూదవ్రాత్రిఁదదంబపైఁగవిసి రిస్సీ! యంచుఁ
గోధించుచున్

క॥ గోపమ్మా! నీతనయుఁడు
మాపుణ్యముకొలఁదిఁ బుట్టె; మఱి యింకేలా?
యేపాపమొ? మేమిఁక నిటఁ
గాపురములు సేయలేము, కంజదళాక్షీ!॥ 38

సీ॥ ముకురంబు గనరాదు మొగమునఁ గస్తూరి
చుక్కఁబెట్టుమటంచుఁ బ్రక్కఁజేరుఁ
జేరి నీసరిగలు సిక్కుఁబొందినవంచుఁ
జన్నొమ్మనల్ స్పృశియించి శంకఁజేయుఁ
జేసి, నీకొకమాటఁ జెప్పెద వినుమంచుఁ
జెవిగొగ్గి కదిసి నుంజెక్కునొక్కు
నొక్కి, నీకంటె నే నెక్కుడుందు నటంచు
మోము మోమునఁ జేర్చి మోవినాను

1. బలరామునితోఁ గూడియున్న వానిని
2. రజోగుణ

తే॥ నాని, చోద్యముఁ జూపెద ననుచుఁ గనులు
మూసి, యిలుసొచ్చి, పాల్ద్రావి, మూతిఁ బూయుఁ
బూసి, లేనవ్వుతో ముద్దుసేసి వోవుఁ
బిల్లవాఁడె? యశోద! మీ నల్లవాఁడు॥ 39

సీ॥ భద్రంబుగా క్షీరభాండంబు లందంద
జాగ్రత్తపఱచి నిశ్చయము మెఱయ
ద్వారబంధమునొద్ద ధైర్యంబుగా నిల్చి
'యదెవచ్చె-నిదెవచ్చె' ననుచు బ్రమసి
తలడిల్లుచుండ నేదారి లోఁ జొచ్చునో
గుర్తింపఁగారాదు గూఢచారి
పాలు మీఁగడ వెన్న భక్షించి తాఁబోవుఁ
గల్ల కాదిది, వట్టికడవ లుండు,

తే॥ వింతకూఁతల మమ్ము నిర్ఘాంతపఱచి
పాలకుండల నన్నిఁటిఁ గాలఁదన్ని
పాఱిపోవును; పెక్కేల? బడుగు నిట్టు
లూరిపైఁబడ విడిచిన నోర్వమమ్మ! 40

క॥ అని పెల్లారడిఁ బెట్టినఁ
గని, విస్మయమొంది, కృష్ణుఁగని సస్మితయై,
జనని గగుర్పాటొదవఁగ
వనితలఁ గలయంగఁ జూచి 'వంచన' యనుచున్॥ 41

ఉ॥ "గోపికలార! మీరిటులఁ గోపము తాపముతోడ వచ్చి, యీ
పాపని, జన్నునేమఱని బాలుని, జారుఁడు చోరుఁడంచు మి
థ్యాపరివర్తనోక్తి నిటు లారడిఁ బెట్టఁగఁ జూతురమ్మ! సం
తాపకరంబుగాదె తలిదండ్రుల? కాత్మజునింద సేసినన్॥" 42

క॥ "బిడ్డలఁ గాంచఁగ లేదో?
గొడ్డాండ్రో? నాదు ముద్దుకుఱ్ఱం గని చే
లాడ్డి మిగులదూఱెద రీ
జడ్డుగుణంబులనుమాని చనుఁ డావలకున్"॥ 43

ఆ॥ "మగలయందుఁ గనలి, మగవారి ననలేక,
పొరుగుతల్లి కన్న బుడుతఁ జూచి
తగుదుమనుచు వచ్చి తగవులాడఁగ నానె?
జాణతనము లింకఁ జాలుఁ జాలు"॥ 44

తే॥ "పసితనంబున నెపుడేని బాలకుండు
తిరిగి మీయిండ్లవరుస కేతెంచి యెదుట
నున్న తినుబండములఁ గోరి తిన్న యెడల
నదురుబెట్టుడుగాక యీ యలుపు లేల?॥" 45

క॥ అన్ని హరిఁ బనిచి సుతుపై
ననురాగము ప్రబ్బికొనిన ననునయమతియై
చనుబాలొలుకఁగ వానిం
గని మూర్కొని చుంచుదువ్వి, కలఁకవాడమినన్॥ 46

ఆ॥ "కొంటెవాఁడు నీవుకొంటు"కంచు దూఱెడి
వాడలోని గోపవనిత లెల్ల
మొనసి ముదిమిఁగన్న ముద్దుబిడ్డఁడ నీవు
కొంటెతనము మానుకొనఁగదయ్య"॥ 47

క॥ అనిబుజ్జగించి లోనికిఁ
గొనిపోయి, జలమ్ముఁబోసి, గోపంచితమున్
మనసారఁ జల్లి, భస్మము
దోనకుచు మేనెల్లఁబూసె "ధూః-ధూః"యనుచున్॥ 48

ఆ॥ అవల గర్గమౌని యరుదెంచి, యాబాల
కృష్ణుకద్వ్యమంబు నెదగ్రహించి,
యోగవిద్యఁ బలికి ప్రోత్సాహపఱచె, యో
గీశ్వరేశ్వరుఁడని యెఱిఁగి యెఱిఁగి। 49

క॥ అటపై శ్రీకృష్ణుం డు
త్కటముగఁ జెలరేఁగ క్షీరదధిభాండంబుల్
మటుమాయమయ్యె నతివలుఁ
గటకటఁబడి బెగ్గడిలిరి కష్టంబనుచున్॥ 50

సీ॥ గోపి యొక్కతె క్షీరకుంభంబు లేపొద్దు
రిత్తయుండుట కృష్ణకృత్యమనుచుఁ
గనలి యాదివస మేకాదశి యగుటచేఁ
బనులాపి ద్వారముల్ భద్రపఱచి

యుట్టిలోఁ గుండలుబెట్టి యుక్తిగ నడి
కప్పున గాయుట్టిఁగట్టి, యుంచు
కేమఱియున్న వాఁడిలుసొచ్చునని యెడు
భయమున నితరభావములు మాని

తే॥ వీధిఁగాచుచు, నీనాఁడు విడువననుచుఁ
జింత సేయుచు, ధీరయై చీమ చిటుకు
మన్న భ్రమఁజెంది వెఱఁగొంది వెన్నుఁడనుచుఁ
గలువరించుడు మధ్యాహ్నకాలమయ్యె॥ 51

ఉ॥ అంతట దాహమేర్చినఁ బ్రియాసముఁజెంది జలంబుఁ గోరి యా
కాంతము హార్తమేయనుచుఁ గాల్కడలించి సరిజ్జలంబుతో
గొంతుకఁ దేర్చి, నెమ్మనము కొందలపెట్ట బిడానవచ్చి య
త్యంతభయస్థయై కనె గృహంబున గోపకబాలబృందముఁ

సీ॥ పీటలు రోటిపైఁ బేర్చి దిట్టరియైన
వాని భుజంబులపైన నిలిచి
చిఱునవ్వు నవ్వుచు సెలగోల నొకచేతఁ
బట్టి యందనియట్టి యుట్టిఁగొట్టి
జెట్టియై యిట్టట్టు లుట్టితో నూఁగుచు
నంజలి వదనగహ్వరముఁ జేర్చి
మోఁచేతులకుఁ గ్రింద ముసరిన చలికాండ్రి
మన్నించి తత్క్రియామగ్నుఁడగుచు

తే॥ స్వయముగా బ్రాజ్ఞ యెదుగ స్వభావయుక్తిఁ
దనివిఁజెందని శుద్ధచైతన్యమూర్తి
కరుణ సపరివారముగ సాక్షాత్కరించె
నెలమిఁ బూఁబోఁడివ్రతము ఫలించెననఁగ॥ 53

మ॥ కని, లోవిస్మయమొందుచున్ భ్రమయుచుం గంపించుచున్ గోపి దాం
గను బట్టంగఁదలంచి ధైర్యమును జిక్కంబట్టి మెల్లంగ డా
సీన వీక్షించిదయాళుఁడామగువ శుష్కీభూతనేత్రంబులా
య్యనఁ బుణ్యామృతమాన నూఁదుచు నదృశ్యంబయ్యెఁ జిత్రంబుగాన్॥ 54

ఉ॥ "ఎప్పుడుచూచునో? గృహము లెప్పుడుచొచ్చునో? యెట్లు పోవునో?
చప్పుడుగాదు, భాండములుఁజక్కగనెప్పటియట్లయుండునే
మప్ప!" యటంచు నయ్యతివ లర్భకుఁ జేష్టల కగ్గలించి యా
'తప్పుడువాని' దల్లియునుదండన సేయమిఁగంటగించుచున్॥

శా॥ వాకిండ్లూడ్చుచు ముగ్గువెట్టుచుఁ బనుల్వాటించుచుం బాఁడుచున్
శాకాద్యన్నము లేర్పరించుచు సఖీసల్లాపముల్ సేయుచున్
వీకన్నిద్రసుఖించుచుందిరుగుచున్ వీక్షించుచుం బల్కుచున్
నేకాగ్రస్థితిఁ బొందిరద్భుతముగా హేలావతుల్ కృష్ణుపై॥ 56

క॥ చిక్కియుఁ జిక్కని బాలుని
గ్రక్కునఁ బట్టంగలేక గాసిలి లోలో
నెక్కొను మక్కువఁ బొందిరి
మెక్కువదక్కువలు మాని యిందునిభాస్యల్॥ 57

మ॥ఇటులచ్యుంగనలంచితాభ్యుదయులైయిష్టానుసారంబుగాఁ
గుటిలత్వంబులువాసి సక్తలగుచున్ గోపాలదేవున్ విశం
కటవృత్తిం గదియంగఁజూడ'ననహంకారోపదేశంబు' వి
స్ఫుటలీలుండయిచేసెగృష్ణుఁడుగడుంజోద్యంబుగాబాలుఁడై॥

మ॥తనుమధ్యల్ వ్రతచర్యఁబూనివరుసన్ దాక్షాయణీదేవిలో
ననుసంధానముసేసిపొందుచు గృహీతానోన్యహస్తాబ్జలై
యనివార్యంబుగనేగయాయమునయందారూఢిమైఁజొచ్చిని
ర్జనతీరంబుననగ్నలైజలములన్ సంప్రీతిఁగ్రీడించుచోన్॥59

క॥ వారిజలోచనుఁడగు హరి
వారివిహారములఁ దేలు వారి వసనముల్
వారక వేచన్ని దొంగిలె
వారు విహారములుమాని వారింపంగన్॥ 60

శా॥ "ఓరీ! కృష్ణ! యిదేమిరా? నిలువరా! యోషిజ్జనంబుల్ వడిన్
నీరంబుల్ సారఁబొంచిచూచియిటురా నీకొప్పునే? వచ్చితే
నీరీతింగలవస్త్రముల్గొనుట మేలే? తెమ్ము మాచేలముల్
పోరంజూడకుమంచివాఁడవుగదబ్బా! పెద్దప్రొద్దాయెడిన్'

క॥ "మీయమ్మతోడఁజెప్పుదు
మోయీ! యివియేటిపను లయో! యిటురమ్మా,
మాయన్న! కోక లంది
మ్మా"-యని లజ్జించి పడఁతు లారట పడిరన్॥

శా॥ "ఏలా? కామినులార! లజ్జపడఁగా, నేలా చలం? శ్రీ
జ్జాలం బెల్ల నశిత్య, మీతనువులిచ్ఛామాత్రదుష్టంబు,
కేలా భ్రాంతి? జలంబులన్వడలి రండిచ్చోటికిన్, వచ్చి
చేలంబుల్గొనఁడింతులార! శుభముల్ చేకూరెడిన్ మీఁదట

క॥ అని సిగ్గులపహరించిన
మనముల్ బోరివోయి సతులు మఱల యశోదం
గని కృష్ణుఁడుడుకుఁదన మొ
య్యన నామెకుఁ దెలియఁజెప్పి యావురుమనిరన్॥

ఆ॥ సతియు వారిమాట సత్యంబుగానమ్మి
కినుకఁజూపి "నేఁడు కృష్ణుఁబట్టి
తగిన బుద్ధిసెప్పి దండింతుఁదప్పక
రామలార! సుగుణధామలార!"॥ 65

మ॥ అని యాకాంతలవీడుకొల్పి సుతునిందాలాపముల్ నెమ్మనం
బునఁజింతించివిషాదమొందిమదిలో మూర్ఛించి, తామందస్మైఁ
జనబుచ్చెన్ వలెనంచునాధుఁగని ప్రస్తావించి, గోపమ్మ నం
దను నాయత్తముసేసె నొక్కసుముహూర్తంబందు
సోద్యోగయై॥ 66

ఉ॥ బల్లిదుఁడై ప్రభాతమున బాలకుఁ డావుల వెళ్వరించుచుం
దల్లికి మ్రొక్కి, చల్ది నొకదండమునందుఁ దగిల్చి, నవ్వు శో
భిల్లవ్రజాంగనాహృదయభేదకరైకమహాత్మవాంగుఁడై
యెల్లలుమీఱి గోగణము నెల్లెడలందునఁ గ్రుమ్మరించుచున్॥

చ॥ వరయమునానదీవిమలవారిపదంబులఁ డాసి, తద్వనో
పరిగిరిభూముల నెక్కుడు శుభప్రదమంచుఁ దలంచి, గోవులం
గరిశరభాది భీకరమృగంబులు లేని బయళ్లయందు బం
ధురగతి మేపఁగాఁ దొడఁగెఁ దుష్టిగఁ బచ్చికలొప్పమీఱఁగన్॥

క॥ యదుకులభూషణుఁడగు హరి
సదమలతీరములఁ జొచ్చి చనువున మేపన్
మొదవులు పుష్కలముగఁ బె
న్పొదుగులఁ బాల్గురిసె నూత్మభూతిం బ్రీతిన్. 69

ఉ॥ అక్కడ నావ్రజాంగన "లహో! యిఁకఁ గృష్ణుఁడు దూరమయ్యెనే
చక్కని మోమువాఁడు, రుచిసంపదలొప్పిన మేనువాఁడు, చేఁ
జిక్కక జాఱిపోయి యొకసెక్కెములాడెడువాఁడటంచుఁ బెం
దిక్కనుబొందిరోలి; నుపదేశమహత్త్వమునూనమైచనన్--

శా॥ తన్నేపట్టుచుఁ బాఁడుచుం దలఁచుచుం దర్కించి
చింతించుచున్,
నన్నారుల్ బగలెల్లఁ బోమఱచి సాయంకాలమైనంతఁ దా
మెన్నెన్నో తినువస్తువుల్గొని ప్రియం బేపారఁగాఁ బోయి 'మా
వెన్నుండెక్కడ నే? యశోద!' యని యన్వేషింతురుద్విగ్నలై

సీ॥ కృష్ణవేణి యొకర్తు కృష్ణదర్శనమహో
త్కంఠయై ప్రొద్దు గ్రుంకకయమున్నె
చకచకఁ బనిఁజేసి సంధ్యచీఁకటిరాఁగ
వత్తిని వెలిగించి తెత్తుననుచుఁ
దిన్నగాఁ గృష్ణమందిరముఁ బ్రవేశించి
వత్తిముట్టించుచుఁ జిత్తమలర
నందనందనుని యాననము వీక్షించుచుఁ
దత్పరచిత్తయై తడవుసేయ

తే॥ వత్తి చూచిచూచి యాగ్రహ మొంది, గో
పమ్మయింటి కరిగి సెమ్మెయొద్దఁ
జెయ్యిఁ గాల్చుకొనెడి చిన్నకోడలిఁ జూచి
యాగ్రహంబుమాని యార్తిఁ బొందె॥ 72

క॥ దినదినప్రవర్ధమానమ
యినవిస్మాయమహిమకతన నిందుముఖులు గ్ర
న్నన గృహకార్యంబులయం
దనాదరము గలిగి మఱచి రఖిల జగంబుల్॥ 73

మ॥ రమణుల్ గోపకుమారకుల్ సెలఁగి బాల్యక్రీడలం దేలుచో
యమునారణ్యమునన్ బలానుజుఁడు సోహంభావముంబూనివే
మమకారంబులఁబోకదీక్ష మెఱయన్ మానంబువాటించి, యో
గముఁబ్రారంభము సేసె వేడ్క...... గర్గప్రోక్తమార్గంబు
గన్॥ 74

తే॥ పాన్నవృక్షంబుక్రిందఁ జిన్ముద్రతోడఁ
జెలఁగు పద్మాసనమున రేచించి పూర
కంబున హృదయబృందావనంబులో న
పానయమునా[1]ప్రవాహముఁబట్టిచనుచు॥ 75

తే॥ ఒనర నామీఁద దుర్వారఘనతరంగ
సంగతోత్తుంగమగుచుఁ బ్రచ్ఛన్నభుజగ
మానితాధారమగు నిండుమడుఁగు దఱిసి
సరస నొక్కదినాన నిశ్చలత మెఱయ॥ 76

సీ॥ పట్టుపుట్టము మొలచుట్టుఁ జక్కఁగఁ గట్టి
దీర్ఘ శిరోజముల్ దిటవు పఱచి
హారావళులఁ గంఠమందునఁ గీలించి
బర్హి పింఛము మౌళిఁ బాదుకొలిపి
పైవస్త్రమును గ్రిందవైచి నేరుపుమీఱఁ
గాయమధ్యమమును గళము శిరము
నిక్కించి బాహువుల్ నిగిడించి తొడరి యు
ద్రేకించి మది హుంకరించి మించి
ఆ॥ ముక్కు మూసిపట్టి ముప్పికలాఁ డూఁది
మడువులోనదుమికి మహితవృత్తి
నలపుసొలపులేక వలయముల్ బచరించె
వింతయాఁతలోడఁ గొంతతడవు॥ 77

1. గంగా, యమునా, సరస్వతీ యని ఇడా పింగళా సుషుమ్నా
నాడులకు పేర్లు.

శా॥ కల్లల్గాక యథేచ్ఛఁ దొల్లి కమఠగ్రాహాదిరూపంబులం
జెల్లాటంబుగ నీఁదు నేర్పుకలిమిం జెన్నారి శ్రీకృష్ణుఁ డ
త్యుల్లాసంబునఁ బీరుఁడై బహుళవాయుస్తంభనల్ సేయుచుం
గల్లోలంబొనరించె నామడుఁగుఁ బ్రాగ్భవ్యక్రియాస్ఫూర్తితోన్॥

క॥ లోపలి చేతననిచయము
లోపమిగా హ్రదముఁ గలఁచి యుగ్రస్థైర్యా
టోపమున నడుగునకుఁ జని
మేపునఁ గుండలినిఁ దన్ని హేలాగతుఁడై॥ 79

సీ॥ లలితాజపామంత్ర మలఘునాదముగాఁగ
సకలేంద్రియములు ప్రేక్షకులుగాఁగ
బహుళనాడీస్వనుల్ ప్రథితవీణావేణు
శంఖమృదంగనిస్వనముగాఁగఁ
బటుకుంభితోదగ్రపవనఝంపాధ్వనుల్
గ్రమముగాఁ దాళశబ్దములుగాఁగ
నిర్మలానందాంబునిధియైన బ్రహ్మనా
ళము భవ్యనాగస్వరంబుగాఁగఁ
తే॥ ద్విజగదభినవసౌభాగ్యరేఖ వెలయ
నంబుజాధారపల్వలాభ్యంతరమునఁ
జిత్రనటనుండు గోపాలశేఖరుండు
నృత్యమాడె నిమీలితనేత్రుఁడగుచు॥ 80

క॥ ఆవిధ మావరణంబుల1
కావలగాంబోవునెడ సహస్రాక్షునిచే2
గోవులు3 జెడిం గొని తడంబడ
గోవర్ధనబిందు4 వెత్తె గోవిందుండై॥ 81

మ॥ ఘనుం డాకృష్ణకుమారకుం డిటు లవక్రప్రక్రియారంభుండై
వనమధ్యంబును జేరి దీర్ఘగమనాస్వస్థాంగుండై విశ్రమిం
చిన నాలో మృదుశబ్ద మొండు నెయిదిం జిత్రంబుగా మ్రోగుచుండ్
వినరా మేల్కని యాలకించె నచలాభిన్నైకధీభాసుండై॥82

సీ॥ ఎలమిం జిణీస్వాన మెఱింగి, యంతం జిణిచి
ణీనిస్వనము నేర్పుతో నెఱింగి,
క్రమముగా ఘంటారవమును గుర్తించి, శం
ఖనినాదమును జక్కంగా గ్రహించి,
వెలయు వీణాతాళ వేణునాదంబు ల
త్యంతభద్రార్థుండై యాలకించి,
యలఘు భేరీమృదంగారావములను నే
ర్పుఱిచి, మేఘధ్వని నెఱింగి, యనుప

1=సుషుమ్నానాడియందలి చక్రములు (లేక) ఎల్లలు.
2=వేలకొలది సంకల్పములను కన్నులు గలిగిన మనస్సు (లేక) దేవేంద్రుడు
3=గోః-అనగా యింద్రియములు
4=ఇంద్రియప్రవర్ధమానమైన రేతోబిందువు

తే॥ మౌన నాదం "అ" కారంబు గాను, విమల
బిందువు "ఉ" కారముగను గావించి, తనగు
కళ "మ" కారముగాఁగ హృత్కమలమందు
ఘనతరోంకార మరసి లక్ష్యంబు సేసె॥ 83

శా॥ జ్ఞానానందమహత్స్వరూప రుచిరోంకారంబు నిట్లెంచి త
ద్ధ్యానాకర్ణనయుక్తి భేదములచేతం ద్రచ్చి యోగీంద్రుఁడై
నానాస్థావరజంగమప్రతతులం దన్నాంచి విశ్వానుసం
ధానోద్వేలమహాసుఖంబుఁ గనెఁ దత్త్వజ్ఞానసంపూర్ణుఁడై॥

క॥ ధీరుఁడు శ్రీకృష్ణుఁ డహం
కారము నాశంబుసేయఁగాఁ దనువున నోం
కార రవ మెఱుఁగఁ బడు నని
పేరెన్నికఁ దాల్చె నంతఁ బిల్లనగ్రోవిన్॥ 85

మ॥ ఒకనాఁ డాయదువంశమండనుఁడు ధ్యానోద్దీప్తి మైఁ బొంగి గా
యకుఁడై బ్రాహ్మముహూర్తకాలమున బృందారణ్య
మధ్యంబునం
బ్రకటస్ఫూర్జితగాత్రుఁడై మురళిఁ గేలం దాల్చి పూరించుచోం
డొకగీతంబును బాడెనద్వయరసం బాష్పంబ్రభూతంబుగాన్

సీ॥ చెలఁగి నాడీధేనువులు మోదమునుజెంది,
తన్మయత్వముఁబొంది, ధన్యమొందఁ;
జటులతర పాపిణ సర్పరాజంబులు
వశ్యమై, కడుఁ బారవశ్యమొంద;
వరబ్రహ్మదండి తామరసషండంబు లం
దంబులై, ఘనవికాసంబునొంద;
హాళి దేహజగత్ప్రియంబు లానందించి
సుఖ మొంది, దీర్ఘసుషుప్తిఁజెందఁ;

తే॥ దన యిడాపింగళాకరద్వయమునందు
ఘన సుషుమ్నా మురళి ముద్దుగారఁ దాల్చి
హృదయబృందావనమున శ్రీవేశ్వరుండు
గాన మొనరించె ననఁగ నోంకార మొప్ప॥ 87

క॥ నవరంధ్రాన్వితనాళిం
బవిరళ సిద్ధాంగుళీవిహారోజ్జ్వలమై
పవనప్రసరోదంచిత
రవంబు దశగతులఁ బటుతరంబుగఁ బఱవన్॥ 88

తే॥ తేనెవాఁకలఁ బఱతెంచు తేఁట్లువోలెఁ
బూర్వజన్మానుభవమైన బోధగదుర
విమల విజ్ఞానజనకమా వేణురవము
కర్ణపుటములసోఁకె నాకాంతలెల్ల॥ 89

ఉ॥ "ఈవరశబ్ద మీస్వరము నీకళ లెన్నడొ వింటి" మంచు
భావన సేసి తత్స్వరమ భాగవతార్ధసమృద్ధనాదముల్
వావిరిగు ర్రెత్తింగి, తనువాసనలం దెగఁగోసి, యాద్వయ
శ్రీవిలసిల్ల గానలహరీమహితాంబుపధోన్ముఖంబుగన్॥

శా॥ ప్రస్తాకంపిత కేశపాళికలతో స్వస్థానముల్ వాసి, యే
ప్రస్తావంబులఁబోక, భర్త్రుజనులన్ భావింపఁగాలేక వ
త్యస్త శ్రీచరణారవిందు నెదలోదర్శించి, భ్రాంతాత్మలై
హస్తాహ్వానము సేయుచుం జనిరి "కృష్ణా!" యంచు
నయ్యామిని॥ 91

మ॥ చని, డాయంగని, భామినుల్ ప్రణతలై సాక్షాత్కృతున్
మాధవున్
జనితోత్కర్షమనస్కలై ప్రవిమలోత్సాహోత్సవులై కూడి,పా
యనిభక్తిన్ స్తుతిఁ జేసి యత్యలఘునిత్యాత్మానుసంధానయో
గనిరూఢత్వ మొసంగ వే! ముదయం గాంక్షించి రక్షింప వే!

ఆ॥ అని సభక్తికముగఁ బ్రార్థింపఁ గృష్ణయో
గీశ్వరుండు భువనహితుఁడు మిగుల
సంతసిల్లి యాత్మసందర్శనంబును
గలుగఁ జేతు ననుచుఁ గరుణఁ జేసె॥ 93

తే॥ గరుడ గంధర్వ కిన్నర సుర మునీంద్ర
సంఘముల కెల్ల మంగళాస్పదమగుచును
జెలువుమీా కొడు తన యఱచేయిఁ జాచి
హస్తమస్తకసంయోగ మపుడు సేసె॥ 94

క॥ మాధవుకరసంస్పర్శన
బోధితలై పూర్వకర్మపుంజము లెడలన్
సాధనలేకయ కాంచి ర
సాధారణమైన యాత్మసాక్షిత్వంబున్॥ 95

క॥ సత్యంబై, సుజనముని
స్తుత్యంబై, నిగమమూలసూత్రార్థంబై,
నిత్యంబై, సద్యోగ
ప్రత్యక్షంబై వెలుంగు పరము, ననంతున్॥ 96

తే॥ సగుణనిర్గుణమయు, శుద్ధసత్త్వరూపు
నజరు నక్షరు నచ్యుతు నచలు నమలు
గూఢుఁ జిద్రూపు నిత్యు నంగుష్ఠమాత్రు
నవ్యయానందుఁ బరిపూర్ణు నంతరాత్ము॥ 97

క॥ అధ్యేయు నాద్యు నవ్యయు
నధ్యాత్ము నగోచరుం బరాపరశక్తున్
మిథ్యాగుణునిన్ సుమనో
మధ్యస్థుం గాంచి యధిక మహిమోన్నతలై॥ 98

సీ॥ జయజయసర్వేశ! సకలభూతములకా
ధారుఁడవగుచు హృదబ్జకర్ణి
కాంతంబులం దంతరాత్ముండవై యుండి
కర్తృత్వ భోక్తృత్వ కర్మఁబొరయ
కఖిలేంద్రియద్రష్టవై యొప్పు నిన్నన్య
థాకరించితిమి ప్రధానపురుష!
యహహా! మాగోవు లాయాదవుల్ నంద య
శోదాదు లేము మత్సుతులుఁ బతులుఁ
తే॥ గా సమస్తము నీవనాఁ గంటి మిప్పు
డిట్టి విజ్ఞానచక్షువు నెల్ల ప్రొద్దుఁ
గలుగ వరము బ్రసాదించి కరుణఁ జూడు
మచ్యుతా! నంత! హరి! పరమాత్మ! కృష్ణ!॥ 99

ఉ॥ నీవు యశోదసూనుఁడవె? నీరజనాభ! చరాచరాత్మ లో
కావళి కెల్ల నాశ్రయుఁడ వారయ వేదమయుండవీవు,తం,
గావుమటంచు ముద్ధరణి గాసిలి ప్రార్థనఁ జేసియుండుటన్
నీ విటులుద్భవించితివి నేఁడు జగంబుల నుద్ధరింపఁగన్॥ 100

క॥ అని బ్రహ్మానందము నొం
ది, నెఱినమస్కృతులొనర్చి, దృఢచిత్తములన్
ఘనముగ నా భగవంతుని
గొనియాడి రనంతనామ గుణరూపములన్॥ 101

క॥ గరుడని పరుడని హరుడని
వరుడని ప్రణుతించి నయనపంకజముల నా
వరదుని గృష్ణబ్రహ్మము
సరోజలోచనలు పూజ సలిపిరి ప్రీతిన్ ॥ 102

తే॥ ప్రేమమీఱంగ భక్తిమైఁ బ్రీతివుట్టి
విభవుఁ బ్రత్యక్షుఁ దిలకించి వివశలగుచు
నెత్తుకొని ముద్దుగొని ముదంబెసఁగఁ జాలఁ
"గాఁగిలించిరి గోపికల్ గానలోలు"॥ 103

చ॥ అనవరతానురక్తి హృదయంబులఁ గృష్ణుని బాయలేమి మా
నినులనవద్యమవ్యయమనింద్యమఖండమబోధ్యమచ్యుతం
బనఁదనరారు నిర్గుణము నాత్మలఁ గాంచియు భక్తిఁబూని నె
మ్మనములలోన నాయదుకుమారుని గొల్చిరి
దేవదేవుఁగన్ ॥ 104

క॥ వెన్నుని సుస్మితవదనుఁ బ్ర
సన్నుని మురళీవినోదు సర్వాత్ముని నా
పన్నులయి కదియఁ బోవుదు
'రన్నా!ర' మ్మనుచుఁ దోయజాస్యలు ప్రీతిన్ ॥ 105

సీ॥ కృష్ణుఁడా! రమ్మని కేలిసేయుచు నొక్క
జలధరకచభర జలకమార్చుఁ
బురుషోత్తమా!యని ముద్దుసేయుచు నొక్క
యంబరమధ్య వస్త్రంబుఁగట్టు

నగధరా! యని యొక్క నవనీతహృదయ మేల్
వెన్న ముద్దలను నైవేద్యమిచ్చు
మాధవా! యని యొక్క మలయజగంధి శ్రీ
చందనం బలఁదు వక్షంబునందుఁ
తే॥ ప్రియమెసఁగఁ బల్లవాధర విడియ మొసఁగు
మాల లలినిడుఁ గుసుమకోమలి గళమున
రత్నకంకణ మంగళారతిని బట్టు
మేటి కలకంఠి యంకించి పాటఁబాడు॥ 106

ఉ॥ తమ్ముల నెఱుంగలేక తమ తల్లులఁదండ్రులన త్తమామలన్
బమ్మెరవోవ భామినులు బాలురఁజూచి యప్పు డెల్ల నే
మమ్మనఁ గృష్ణుఁడంచును గ్రిమమ్మన నాప్రభుఁగాంచి రెల్లరూ
పమ్ములఁ బుత్రులం బతుల భ్రాతృజనంబుల బంధుమిత్రులన్

తే॥ పరమమైన పరాభక్తిఁ బ్రమద లఖిల
జగము శ్రీకృష్ణుఁడయమని సంగ్రహించి
సచ్చిదానందపరమహంసల వడువున
జడతమీఱఁ జరించిరి సగుణమందు॥ 108

ఉ॥ మాపటి వేళలందు వనమార్గములన్ హరి వేణుగాన మా
లాపను సేయుచో గృహకలాపములన్ మఱచి శ్రీకృష్ణుఁడే
ప్రాపనిడాసి, తత్పరము పావన గానసుధారసాంబుధిం
దాపముగి అఁ గ్రుంకులిడి తన్మయలయ్యెద గంగనామణుల్

మ॥ వనితల్ మన్మథకేళికిన్ నిజపతుల్ ప్రాపించినం జూచి తా
రని గుర్తింపఁగ లేక కృష్ణుఁడని యవ్యాజానురాగంబుతోఁ
గనుచుంబల్కుచు నవ్వుచుం బెనఁగుచుం గంధర్వలీలాతరం
గనికాయంబుల నోలలార్చెదరు తత్కాంతారభాగంబులన్

క॥ వేదార్థప్రతిపాదిత
నాదమధురసంబుఁ ద్రావి నారీమణు లు
న్మాదోద్ధతిఁ గ్రీడించిరి
నాదబ్రహ్మైకరతి సనాథోత్సుకలై ॥ 111

మ॥ తమ జీవేశ్వరు లంతలో మఱలినన్ దందహ్యమానాంగలై
యమునారణ్యనికుంజపుంజముల మాయాకృష్ణునిన్ రోయుచుం
దమలో నొండొరులన్ భ్రమించుచు యశోదానందనుం బొన్నభూ
జముపొంతం గని డాయఁబాఱుదురు చంచత్కాంతితోఁ గామినుల్ ॥ 112

క॥ లీలామానుషవిగ్రహుఁ
డా లలనాజనముఁ గూడి యస్ఖలితవిధిన్
హేలాగతిఁ గ్రీడించుచు
లీలలఁ దాఁ దేలి యొప్పె లీలాత్ముండై॥ 113

మ॥ శారదరిండ్లం బులినస్థలంబుల లసద్భూమీరుహచ్ఛాయలం
బదునాఱ్వేలసతీలలామ లనువొప్పన్ దాస్యముల్సేయ 'నీ
యదుశుభ్రాంశుని తేజముంగన నశక్యంబింక మీఁ''దంచు వె
ల్లదనంబొప్పఁ బలాయితుండగును దారాకాంతుఁ
డశ్రాంతముల్॥ 114

ఉ॥ అంద ఱకన్ని రూపములనాడుచుఁ బాఁడుచు బోధసేయుచున్
నందఱియందు సర్వసముఁడై విలసిల్లుచు వ్రేతలన్ మహా
నందరసాబ్ధిఁ దేల్చి భవనాశకుఁడై తఱియింపఁజేసెఁ దా
నందఱి, నందునింటి శిశువై చెలియై గురుఁడై
కుమారుఁడై॥ 115

క॥ మంగళము రుక్మిణీధవ!
మంగళ మవతారపురుష! మధురావాసా!
మంగళము పాపహరణా!
మంగళ మఖిలాగమప్రమాణధురీణా! 116



1. తాత్పర్యము:- త్రేతాయుగమున నొకపాదము ధర్మము నశించుచున్నట్లుగా నంతదనుక సత్ప్రవర్తనగలిగి యున్న రాక్షసులు గొప్పగొప్పవరములను బొంది యున్న వారలై, మదించి, ముల్లోకములందలి ప్రజలను నానాహింసల బెట్టుచుండగా ఆబాధలు పడ లేక దేవతలు సృష్టికర్తయైన బ్రహ్మదేవు నొద్దకు బోయి రాక్షస నాశమునకు బూనుకొని తమ్ము గాపాడవలసినదని ప్రార్థించిరి.

2. తా॥ బ్రహ్మదేవుడా దేవతల మొఱయంతయు సావధానముతో విని రణశూరులైన రాక్షసులను జయించుటకు దనకు యుద్ధనైపుణ్యము లేదని విచారించి, పురాణపురుషుడును నవాఙ్మానసగోచరుడునైన ఆ అఖండ పరిపూర్ణసచ్చిదానందస్వరూపమగు పరబ్రహ్మమును దనహృదయమునందు ధ్యానించెను.

3-4. తా॥ అప్పు డొకశబ్ద మభయమిచ్చుచు నారాక్షసులు వరబలముచేతబిచ్చలించియధర్మపరులైయన్యాయము గాలోకులను హింసించుచుండినను, వారి వారి పాప కర్మ పరిపక్వముగాలేదనియు, అట్టికాలమే సమీపించిన శీఘ్రముగా దనమాయాధర్మమైన కర్మసూత్రప్రకారముగా స్వయముగా దానే వారిని నశింపజేయగలవాడననియు, కావున నాదేవతలు నిశ్చింతగా

నుండవలసినదనియు, ఆబ్రహ్మదేవున కాత్మనిష్ఠలో స్ఫురించి, ఆదేవతలకును వినిపింపగా, వారందఱు సంతోషించి బ్రహ్మలోకమునుండి మఱలి నిజస్థానములకు వెళ్ళిరి-

## వివరణ:-

భగవంతుడు సర్వాంతర్యామియయ్యు జీవుల పుణ్య పాపకర్మవిషయములో దాను గర్త కాడు. జీవుడు భగవంతుని యొక్క అంశయేగావున ఆపరబ్రహ్మమువలెనే తానుగూడ స్వతంత్రమైనశక్తి గలిగియున్నాడు. కావున జీవులుదాము సంకల్పించి చేయు కర్మయే, వారివారికి కాలపరిమాణములో దప్పక ఫలించి సుఖదుఃఖరూపముగా సిద్ధించుచున్నది. కాని సహజముగా నొకజన్మలోని కోరిక వేఱొకజన్మలో బక్వమై లభించుటచేత, అప్పుడది సుఖదాయకముగాక ప్రతిబంధకముగా నేర్పడుటయు దటస్థించుచున్నది. ఉదహరణముగా నొక భాగ్యవంతుడు మొదటిజన్మలో సంతానములేక కోరికోరియుం డుటచేత రెండవజన్మలోగాని మూడవజన్మలోగానియాసంతా నము గలుగవచ్చును. కాని యాజన్మలో దాను గర్భదరిద్రుడై యుండును- ఎందువలననగా, దా నా పూర్వజన్మలో సంతా నమొక్కటియే గోరెనుగాని ధనముగూడ గోరియుండలేదు. కనుక ఆమఱుజన్మలో దనకు సంతానముమాత్రమే కలుగుచు, దరిద్రుడుగానే పుట్టుచున్నాడు. అట్లు దుఃఖభాజనముగా సంభవించిన ఆజన్మయందు, మఱల, ధనములేదని ధనమొక్క

టియే గోరునుగాని, సంతానముమాట కోరుటకూడ సంభవింపదు. ఆరీతిగా కోరికలపసవ్యములై దుఃఖకారకములే యగుచు వాటి ననుభవింపవలసిన బంధనముతో జన్మలను బెంచుచున్నవి. అట్లు కర్మబీజము వృద్ధిబొందకయే కోరిక పుట్టినతోడనే ఫలింపవీలులేనట్లు, కాలపరిణామములో గర్మపక్వమైనచో నేదేవతలు దన్ను బ్రార్థింపకపోయిననూ భగవంతుడు స్వయముగానే దుష్టశిక్షణ జేయుననుట కర్మసూత్రలక్షణమైయున్నది. ఇందులకు బ్రమాణము శ్రీమద్భగవద్గీతయందలి భగవానువాచ:-

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥

5. తా॥ అట్లు క్రూరులైన రక్కసులు దమ్ము వివిధప్రకారముల హింసించుచుండగా నాబాధల కోర్వలేని దేవతలు మొదలైన ప్రజలు దమ తమ హృదయముల్లలో ఆరాక్షసులను దూషించుచూబోగా ఆదూషణములను వారిచిత్తవృత్తులు సత్త్వగుణప్రధానులైన జీవుని యొక్క కోరికలుగావున వృధాగా నశించిపోవీలులేక కర్మసూత్రము ననుసరించి సృష్టి కారణమైన ప్రకృతి ధాతువుతోగలిసి పరిణామముబొందుచుండెను.

**వివరణ:-**

ఇది అవతారలక్షణము. అసలు భగవంతుడఖండనిర్గుణసచ్చిదానందమయస్వరూపమని శ్రుతులు సెప్పుచున్నవి.

అట్టి అఖండమైన పరబ్రహ్మము ఖండముగుటకాని, నిర్గుణము సగుణముగా మారుటకాని, యన్యోన్యవిరుద్ధము. జీవాత్మస్వరూపవిషయమై గూడా ఆ యఖండపరిపూర్ణపరబ్రహ్మము దన మాయయైన మూలప్రకృతియందు ప్రతిబింబమునొంది, అద్దములోని సూర్యబింబమువలె పరమాత్మని అంశమై జీవుడని వ్యవహరింపబడుచు, సత్తు- చిత్తు- ఆనందమను భగవల్లక్షణములే స్వరూపముగాగలిగి క్రీడించుచున్నాడని చెప్పబడియున్నదిగాని ఆ యఖండస్వరూపము ముక్కలుముక్కలుగా జెదిరిపోయి యీ నానాజీవులైరని యర్థవాదము లేదు. సృష్టిపరిణామమునందు నద్దమువంటి ప్రకృతియే తునకలు తునకలై యసంఖ్యాకములగు ప్రతిబింబములను జీవులను గల్పించుచున్నది. అయితే అవతారమనున దట్లోకసామాన్యజీవుడుగా బరిగణింపబడ వీలులేదు. శ్రీమద్భగవద్గీతలోగూడా దానే ప్రతియుగమునందు నవతరించి ధర్మసంస్థాపన జేయుచుంటినని భగవంతుడు స్పష్టముగానే చెప్పికొనియుండెను. ఇది సూక్ష్మగ్రాహ్యము. ఎట్లనః- ఒక బలవంతుడకారణముగా నొకదుర్బలుని బీడించును. ఆబలహీనుడు సేయునదిలేక ఆ బలవంతునిపై వ్యసనపడి తన మనస్సులో దూషించికొనును. ఆ దూషణములను చిత్తవృత్తులు జీవాత్మయొక్క స్వాయంశక్తి ప్రధానములుగావున ఆబలశాలివైపు ప్రసరించును. ఆబలవంతు డట్లు గ్రమేణ ననేకదుర్బలులను హింసించుచుపోగా, వారివారియొక్క చిత్తవృత్తులుగూడా నల్పశాపములై ఆదుర్మార్గుని నావరించును. ఆప్రకారముగా ఆబలవంతునితో సమానమైనశక్తి సమకూడువఱకు నానా

జీవుల యొక్క లక్షలకొలది చిత్తవృత్తులు ప్రకోపించి గుమి గూడి ఆవరించికొనుచు నేకీభావమునొందును. అట్లు తగిన శక్తివంతము గాగా, ఆ ధాతువు దట్టమై సంకర్షణ బొందుచు, బీజమై సాకారముగా ప్రభవించి తనకర్మవృత్తమైన క్రియా పరిష్కారమునకు వేచికొనియుండును. అట్లనేక కోట్లకొలది జీవాత్మలయొక్క అంశలు గూడి యొకే తేజముగా జనియించుటచేత ఆవ్యక్తియొక్క చిత్తప్రకృతి సహజముగా అమానుషమైన శక్తికలిగియున్నదై, సామాన్యజీవుడని గణింపబడ వీలులేక, అవతారపురుషుడనియే ఆమోదింపబడుచున్నాడు. అట్టి అవతారపురుషుడును దన కర్మయోగమంతయు నివర్తించికొనుచు, సులభముగా జ్ఞానముగూడా సంపాదించికొని, తదనుసారముగానే జన్మసంస్కారము బొందుచున్నాడనుట ధర్మ సూక్ష్మము.

6. తా॥ క్రమక్రమముగా ఆచిత్తవృత్తులమోఘములై యేకీభవించి, నీరు ఆవిరిగామారి వర్షమేఘమైనట్లు, ఘనీభవించుచు బరిణామమునొంది, సత్వగుణప్రధానమైన తేజోవిశేషముతో నీలవర్ణముగా మారుచుండెను.

## వివరణ:—

మహాతేజమైన ప్రకాశము దృగ్గోచరమగునపుడు నీల వర్ణముగా గనుపించును. ఇందుకు దార్కాణము, ఆకసమునందలి సూర్యరశ్మి. ఎండయొక్క దుదీక్షణముగానుండు మిట్టమధ్యా

హ్నకాలమున ఆరశ్మి నీలముగానుండి, సాయంప్రాతః కాలములందు ప్రకాశముదక్కువకాగా వివిధరంగులతో కన్పించుచున్నది. అ కారణముచేతనే జ్యోతిర్మయమైన జీవాత్మపరమాత్మలకు నీలవర్ణ ముపాధిగా చెప్పబడియున్నది. అ ట్లా వర్ణమును జలాశయముగా నన్వయించి శ్రీమన్నారాయణుడు అనగా నీటియందు వసించినవాడనియు ప్రతిపాదింపబడియున్నది.

7. తా॥ అట్లు కోట్లకొలది దేవతాజనులయొక్క యంశలు కలిసి ఒక మహాతేజమగుచు నావిధముగా సృష్టివైచిత్ర్యము బొంది జీవస్వరూపమై దేశకాలపాత్రానుసారముగా భూలోకమున బుణ్యాత్ముడగు దశరథమహారాజుయొక్క పట్టమహిషియైన కౌసల్యాదేవికి బుత్రరూపమున ఆవిర్భవించెను.

8 తా॥ అట్టి సమష్టిశక్తియైన ఆశిశువు తనయొక్క మహాతేజ మెక్కుడు ప్రకాశమానముగా వెలుగుటచేత శ్రీయనియు, దన చైతన్యరూపమైన ఆత్మలీలలు మనోరమ్యమై చూపఱులనాకర్షించుటచేత రాముడనియు, చంద్రబింబమువంటి తనముఖకాంతులు జంద్రకిరణములవలె హృదయానందకరముగా నుండినందున చంద్రుడనియు, సార్థకపదములతో 'శ్రీరామచంద్రమూర్తి' యని వ్యవహరింపబడెను.

9. తా॥ తరువాత శ్రీరామచంద్రుడు పెరిగి పెద్దవాడై తన క్షత్రియ ధర్మము ననుసరించి రాక్షససంహారమును దుష్టశిక్షణము గావించుటకై దండకారణ్యము సేరెను.

10. తా॥ ఆ దండకారణ్యమునం దొక్కచోట జ్ఞానులును, వైరాగ్యవంతులును, శాంతులునునై నసంయమీంద్రులు గూడ నెల్లప్పుడు భగవద్ధ్యానతత్పరులై యుండిరి.

11. తా॥ అట్టియెడ ఆశ్రీరామచంద్రు డొకనా డొకముని పల్లె సమీపించి యంమసమావేశమైయున్న మునికూటములోనికి ప్రవేశించి వారికందఱకు దనజగన్మోహనమైనసౌందర్యముతో నేత్రపర్వమొనరించుచు, నక్షత్రరాశి నడుమనున్న నిండుచంద్రునివలె తేజోమూర్తియై ప్రకాశించెను.

## వివరణ :-

భగవంతుని యొక్క యన్ని అవతారములలోను శ్రీరామావతారమేయనన్యమైన రూపలావణ్య విభ్రమములుగలిగి మిక్కిలి సౌందర్యవంతమై యుండెనని చెప్పబడియున్నది.

12. తా॥ తొలకరిమబ్బువంటి మెఱుగుగల నీలవర్ణమైన శరీరచ్ఛాయయు, పదునాల్గులోకములను సంకల్పమాత్రముచే బుట్టించు గంభీరమైన నాభీస్థలమును, విశ్వమంతయు బ్రకాశింప జేయు సూర్యచంద్రులవంటి నేత్ర

ద్వయమును, లక్ష్మీదేవి కాటపట్టయిన విశాలమగు వక్షస్థలమును, మిగులసన్నమైన నడుమును, గలిగి, యేనుగుగున్నవలె ఠీవిగా నడచుచు రూపలావణ్యతేజో విశేషములచే బురుషులనుగూడా మోహింపజేయు సౌందర్యమూర్తియైన ఆ శ్రీరామచంద్రుని,—

13. తా॥ ఆ మునీశ్వరులు కనురెప్ప లార్పకుండగా జూచి చూచి, తనివిజెందక, పులకాంకితులై, తదేకదృష్టితో నివ్వెఱబడి లక్షించుచుండిరి.

14, 15. తా॥ అప్పు డాశ్రీరామచంద్రమూర్తి యొక్క ఆనీలవర్ణమైన దేహచ్ఛాయయు, ఆఎత్తైన విగ్రహసౌష్ఠవము, ఆమోకాళ్లనుదాకు పొడవైనచేతులు, ఆ చెవులు కన్నులు భుజములు ముఖము కంఠము నాభి పాదములు, దక్కగల నడుము తొడలు వక్షస్థలము మొదలైన ప్రతియొక్క యవయవము మనోరంజకములై మన్మథునిబాణములవలె గాఢముగా మనస్సుల నాటుకొనగా ఆమునీంద్రులు చలించి భ్రమించి చిత్తవైకల్యము నొందినవారలై విరహముజెందిన స్త్రీలవలె ఆయవతారపురుషుని మూర్తివైభవము నొక్కట నాలింగనముసేయ గుతూహలపడిరి.

16. తా॥ అంతలో ఆశ్రీరామచంద్రుడును దమవల్లనొకమగవాడే కదా యనియు, నగుబాటుసుమా యనియు,

తడబడుచు, సంబరపడుచు, ఒకరిమొగమొకరు చూచి కొనుచు, ముచ్చటపడుచు, తమలోఁదా మిట్లని తలపోయఁజొచ్చిరి,—

17. తా॥ అక్కటక్కటా వానప్రస్థాశ్రమవాసులమై యరణ్యముల నివసించుచు, నీవారధాన్యముతో పొట్టపోసికొనుచు ననేకసంవత్సరములనుండి బ్రహ్మచర్యదీక్షవహించి యింద్రియజయముగళిగి జీవితమునందుగూడా విసుగుజెందియున్న మాబోటి తపస్సంపన్నులనే యీ పురుషుఁడొకడీరీతిగా మోహింపజేయుచున్నాఁడు గదా!

18. తా॥ అయ్యయ్యో! కేవలమైన నిర్వికల్ప సమాధినిగూడా సాధించుచు, మనస్సును బుద్ధిని జిత్తమును లయమొనరించి, ద్వంద్వాతీతమైన అమనస్కయోగ మనుభవించుచుండిన ఆత్మ సంచలించిన మాతపశ్శక్తియంతయు గూడ నేడు వృధామైపోవును గదా!

19. తా॥ ఆ సచ్చిదానందపరబ్రహ్మమే ఈ శ్రీరామచంద్రమూర్తియై అవతరించెననుట యదార్థమైనను, ఆపరమాత్మునియొక్క అంశయని పిలువబడుటకు హంసమాత్రుడైన జీవునకు వ్యవహరించునుగాని, శుద్ధజడాత్మికమైన యీపాంచభౌతికస్థూలశరీరమే ఆపరబ్రహ్మస్వరూప మనుట అజ్ఞానమేయగును గదా!

20. తా॥ పరబ్రహ్మ మనునది సర్వాంతర్యామియు, మహాత్మ్యమాత్రము చేతనే రూపముగలవాడని తెలియబడువాడును, శాశ్వతుడును, తా నేవస్తువుచేతను జూడబడక తనకు దానే సర్వమునకు సాక్షిమాత్రుడు నగును గావున దదంశసంభూతుడైన జీవుడగు హంసునకే యీలక్షణము లేర్పడుచున్న వికాని క్షయవృద్ధులకులోనైన దేహమునకు గాదు కదా!

21. తా॥ అట్లని యెఱింగియు, నింతటి యింద్రియజయమును గూడా సాధించి గొడ్డుబాఱిపోయిన యీవృద్ధాప్యమున నిట్లాలింగనము సేయగోరు టెంతయనుచితము సుమా!

22. తా॥ అని ఆందోళనబడుచుండియు ఆశ్రీరాముని సౌందర్యముచేత నాకర్షింపబడి, హృదయస్థైర్యము సెడి, ఆతురబడుచున్న ఆమునిలోకమును జూచి,—

23. తా॥ లోకేశ్వరుడును, సమస్త స్థావరజంగమకోటులనేలువాడును నైన ఆశ్రీరామదేవుడా మునీశ్వరుల యభిమతమును గ్రహించి, దయామయుడును, భక్తుల కోరికల నొసంగువాడును గావున ననురాగము సూచించుచు వారి నెల్లను గలయజూచి యిట్లనియె,—

24. తా॥ ఓ సంయమిప్రవరులారా! నేను నిక్కువముగా బ్రహ్మజ్ఞానులకు వశ్యమయ్యేయున్నాను. అంతేగాక, సర్వసాధారణముగా నేమాన వుడైనను నాయొక్క సగుణస్వరూపముగాని నిర్గుణస్వరూపముగాని హృదయములో ధారణజేయుచు ధ్యానించుచుండిన నేను వానికి బ్రహ్మానంద మొనగూర్చుటయేగాక, యీ పదు నాలుగు భువనములుగూడా వానిధనమై ప్రవర్తిల్లును. అట్టియెడ చిత్తశుద్ధిగలిగిన యోగసిద్ధులు నిరంతరము నిర్వికల్పసమాధిలో నిమగ్నులగుచు మునిపుంగవులైన మీవంటి సిద్ధపురుషులు గోరినప్పు డీపాటి నా యీ దేహాలింగనమే మీకు దొరుకకపోవునా? కనుక, యది మీకందఱకు దప్పక సిద్ధించితీఱును.

25. తా॥ కాని మీ యీకోరిక నీక్షణమే నెఱవేర్చుటకు వీలు లేదు. ఏలననగా, నేనీజన్మమునందు గర్భిష్ఠుడనై కొన్ని అమోఘనియమముల బూనియున్నాడను గనుక నా యర్ధాంగియైన యొక్క సీతకుదప్ప నితరుల కాలింగనమొసగుటచేత నాయేకపత్నీవ్రతమునకు భంగము వాట్లిల్లును గావున నిషిద్ధమైయున్నది.

26. తా॥ అంతేగాక యమోఘమైన తపశ్శక్తిగలిగిన దేవతల నుండి సముద్భవమైన యీసమష్టితేజము దివ్యములైన యాషడ్గుణైశ్వర్యములయొక్క సమ్మేళనములో మూర్తీభవించుటచేత నాయీశరీరముగూడా మిక్కిలి

పవిత్రమైయున్నది. కనుక యట్టి యీ నా దేహమును గౌగిలించుట కయోనిజయు నా భూదేవికూతురునగు ఆసీతవినా యితరులెవరును పాత్రులుగాజాలరు.

27. తా॥ కనుక మీ రిప్పుడు గోరిన నాదేహాలింగనము మీకు రాబోవు ద్వాపరయుగాంతములో దప్పకలభింప జేయుచున్నాను. ఆయుగమ్ములో నేను నా నిజభూతితో మఱల నవతరించుచున్నాడను. మీరును స్త్రీబుద్ధితో నే డిట్లుగోరినవార లైతిరికావున మీరందఱు గోపవనితలై పునర్జన్మము నొందెదరు. నేను మీకొఱకై వ్రేపల్లెలో నివసించుచు యశోదాదేవికి గుమారుడనై విహరించునప్పుడు మీకు నా ఆలింగనము సిద్ధింపగలదు.

28. తా॥ అని పలికిన ఆశ్రీరామదైవము యొక్క వచనము లాలకించి యా మునీశ్వరులు, "శౌర! ఏమి యీరామావతార నియమములు? ఒక్కటే మాట, ఒక్కటే బాణము, ఒక్కతెయేనట భార్యయుగూడా నని తమలోదామ మెచ్చికొనుచు గుసగుసలాడుకొనిరి.

## వివరణ:-

శ్రీరాముడు ధనస్సునందు బాణముసంధించిన, దానికి నెత్తురు తగిలి తీఱవలయుననియు, శత్రువు పాఱజూచిన వెనుకగాబోయి తగులక వెన్నంటిమాత్రము దిరుగుననియు, జెప్పబడియున్నది.

29. తా॥ పిమ్మట ద్వాపరయుగము కడపటగా బృందారణ్య ప్రాంతమునందలి వ్రేపల్లియలో ఆసంయమీంద్రులు దమతమ కర్మానుసారముగా గొల్లపడుచులై పుట్టి పెరుగుచుండగా పెద్దగొల్లయగు నందుని భార్యయైన యశోదాదేవికి ఆరామావతారము యొక్క తేజము మఱల నిజభూతితో శ్రీకృష్ణుడై ఆవిర్భవించెను.

## వివరణ:-

త్రేతాయుగములో శ్రీరామచంద్రమూర్తియై ప్రభవించిన ఆమహాతేజము పుణ్యపాపవిచక్షణతోడి కర్మయోగపరిమగు సిద్ధిని గాంచుటచేత ఉత్తరజన్మమైన శ్రీకృష్ణావతారమునందు ఆజన్మజ్ఞాని యయ్యెను.

30. తా॥ అట్లు ఆజన్మజ్ఞానియైన గోపాలకృష్ణుడు దయాసముద్రుడును, అరిషడ్వర్గముల జయించినవాడును, మంగళప్రదుడును, కపటనాటకసూత్రధారుడును, భక్తపరతంత్రుడునై విలసిల్లెను.

31. తా॥ అట్టియెడ గోపికలు బూర్వజన్మజ్ఞానములేక, సంసారలంపటలోబడి శ్రీకృష్ణుడు వ్రేపల్లెవాడలో నవతరించిన కర్మయోగ రహస్యమైన భగవదాలింగన విషయమును గాని, ఆయవతారపురుషుని మహిమము గాని గుర్తింపకపోవుటచేత, ప్రజ్ఞగలపాత్రులకే దొరకువా

డును, జ్ఞానచక్షువు నొసంగువాడును నైన శ్రీకృష్ణుడు వారియందు జాలినొందినవాడై యిట్లని విమర్శించికొనెను.

**వివరణ:-**

గోపికలు సామాన్యజీవులవలె జన్మించుటచేత బూర్వజన్మజ్ఞానమును మఱచియుండిరి. కాని వారలకు బూర్వజన్మసంస్కారములు లేకపోలేదు. అనగా వారి మనస్సులందు బూర్వజన్మమునందు సాధించియున్న చిత్తశుద్ధి దాగికొనియేయున్నది. అట్లణగియున్న చిత్తవృత్తులు ప్రకాశించిననే కాని వారలు మఱల సత్త్వగుణప్రధానలు గాజాలరు. అట్లు సత్త్వగుణము ప్రకాశమానముగాక, యింద్రియప్రవృత్తిలోనేయుండిన, వారు బ్రిజ్ఞాలభ్యుడైన శ్రీకృష్ణుని యొక్క ఆలింగనము లభించుటకు బాత్రులుగారు. పూర్వజన్మమునందు వారలెట్టియంతఃకరణముతో శ్రీరామచంద్రుని యాలింగనము గోరిరో యట్టి సత్త్వగుణస్థితిలోనే యిప్పుడది చేకూఱవలసియున్నది, కాని వారింద్రియలోలలై యుండినగాదు. కావున. భక్తపరతంత్రుడగు శ్రీకృష్ణభగవానుడు వారి నుద్ధరింపవలసినవాడయ్యెను.

32. తా॥ పాప మీ గోపిక లింద్రియజాలములోబడి చిత్తభ్రమనొంది సంసారమార్గానువర్తినులై నన్ను దెలియలేకుండిరి కదా!

33. తా॥ వీరు గొల్లజాతికి జెందియుండుటచేత, ఆలమందల గాచికొనుచు, పాలువెన్నల నమ్మికొని సుఖముగా జీవ

నము సేయుచున్నారే కాని, యీజగత్తు మిథ్యయ
నియు, నీశారీరసుఖము లనిత్యములనియు నెంతమాత్ర
ము దెలియకుండిరి కదా!

34. తా॥ విశ్వమున కంతటికి జీవస్వరూపమైన ఆపరంజ్యోతి
యందు సమాధినిష్ఠలో లయముజెందిన పూర్వజన్మ
పరిపాకము గలిగియున్నవారలయ్యు, ఈ గోపికలు
నామాయాపాశమున జిక్కుబడియున్నారు గనుక
వీరల నే నిప్పుడు దప్పక రక్షింపవలసియున్నది.

వివరణ:-

సాధకుడు మొదట దన పురుషప్రయత్నముతో వ్యవ
సాయముసేసి యింద్రియజయము బొందినయెడల దదనంత
రము దైవమే ప్రయత్నపూర్వకముగా దన్నుద్ధరించుచున్నా
డు. అమెట్లు జీర్ణపిదప మానవునకు దాను తిను ఆహారము తన
ప్రయత్నము లేకపోయిననూ ఏవిధముగా జీర్ణమగుచున్నదో,
యాదేవిధముగా మనస్సు నివృత్తిపరమగునట్టి నాడీశుద్ధిని
బొందిన పిమ్మట ఆపరమాత్మునిచేతనే యాకర్షింపబడి సాధ
కుని చిత్తవృత్తికి బాహ్యేంద్రియసంకర్షణ నిరోధించి మనో
లయ మొనరించుచున్నది. కావుననే భక్తాగ్రేసరుడగు ప్ర
హ్లాదు డయస్కాంత మినుపముక్కను లాగికొను నట్లుగా
దనచిత్తము నాహృషీకేశునిశక్తి లాగికొని పోవుచున్నద
నియు, దానిని మఱలింప దనకు వశముగాకున్నదనియు దండ్రి
యైన హిరణ్యకశిపునితో విన్నవించికొనెను.

35. తా॥ అని తర్కించికొనినవాడై శ్రీకృష్ణుడు గనికరము విడిచి, తోడిగోపాలురతోఁగూడి ఆగోపికల సర్వసౌఖ్యములకు మూలమైన పాలు పెరుగు వెన్నల నపహరించి బాధింప సమకట్టెను.

## వివరణ:-

తమ శిశువును సన్మార్గములో నుంచుటకు మొదట దలిదండ్రులశిక్షణ మవసరమైయున్నది. అట్లు దామాకుమారుని గొట్టినను దిట్టినను వారి భావ మాబాలకుని క్షేమమేగావున నన్యాయము గాదు. అజ్ఞానుడగుబాలున కది తెలియక నిజముగానే భయపడవచ్చును. కాని తన క్షేమము విషయమై తనకంటె నెక్కువగా వాని తలిదండ్రులకే తెలిసియున్నదనుట నిర్వివాదము. అదేవిధముగా గోపికలయొక్క చిత్తప్రవృత్తి నిరోధించుటకు భగవంతుడు బాహ్యసుఖముల కంతరాయము గల్పింప సంకల్పించుటయు, ఆగోపికల యాత్మక్షేమమునకే కావున, వా రది మొదట గ్రహింపలేకపోయినను దాన్ని వారి జ్ఞానసంస్కారములను రక్షింపవలసినవాడయ్యెను.

36. తా॥ అక్కడక్కడ నాటలాడుకొనుచుండెడి గోపబాలురను గూర్చికొని, దొంగతనముగా, ఆగోపికలయొక్క యిండ్లలోనికి జాగరూకతతో జొఱబడి, ప్రతిదినమును చేతికందిన పాలుపెరుగువెన్నల సొంతముగా దినివేయుచుండుటచేత, ఆగొల్లసతులు శ్రీకృష్ణునిపై ఆ

సూయాద్వేషములు జెందినవారై యాబాలుని చిదానం
దలీలలు గ్రహింపలేక వాపోవుచు,—

37. తా॥ అబలలు, చంచలలునైన ఆగోపకన్యలు, భగవం
తుడైన శ్రీకృష్ణు నెఱుఁగజాలక, లోకవ్యవహారరీత్యా
నన్యాయము నవమానము జరుగుచున్నదని భ్రమించి
యొకనాడు వారందఱుగలిసి యశోదాదేవి యింటి
మీదికి దండెత్తి ఆకృష్ణుని చేతలవిషయమై ఆమెతో
ఘోరముగా బోట్లాడిరి,—

38. తా॥ ఓ యశోదమ్మగారూ! నీకు గొడుకుపుట్టుట మాక
ర్మకొలదీ మాకొంపలు దోచుకొనుటకే కాబోలు.
ఇంకేమున్నది, మాపాపమిట్లా పండిపోయింది. ఏమో
నమ్మా! ఈయూరిలో మే మిక కాపురములువదలి
యింకేయూరైనా లేచిపోవలసి వచ్చినట్లేయున్నది.

39. తా॥ అయ్యయ్యో! నీకొడు కేదో యొకవంకబెట్టుకొని
మాయిండ్లలో దూఱి యన్నియు నాశముచేసి పోతా
డమ్మా, అంటే, అడ్డము గనుపించలేదు కొంచెము
చుక్క బెట్టమ్మాయీ! యంటూ దగ్గరకు జేరుతాడు;
పోనీ లేయని, మొగమున జుక్క దిద్దుతుంటే, మెడ
లోని సొమ్ములు చూచినట్లు నటించి ఆసొమ్ములు-ముట్టు
కుంటాడు; ముట్టుకొని నీకొక మంచిరహస్యము చెపుతా
నంటూ! చెవియొద్దకువచ్చి చెక్కిలినొక్కుతాడు;నొక్కి

నీకంటె నేనే పొడవున్నాను కొలుచుకుందా
మంటూ, ముందునకు నిలబడి మోవి దగులుతాడు;
తగిలి నీవు కండ్లుమూసుకో గమ్మత్తుచూపుతానంటూ,
నాకండ్లు రెండూమూసి యింట్లోకిజొరబడి ఆపాలు
మీగడలు దోచికొని, పోతూపోతూ నానోటికికూడా
కొంచెముబూసి కెకిలినవ్వు నవ్వుకుంటూ పరుగెత్తి
పోతాడమ్మా! మీనల్లపిల్లగాడు.

వివరణ:-

శ్రీకృష్ణుడు పదునాకండేండ్ల ప్రాయమువచ్చువఱకే వ్రేపల్లెలో నందునింట పెరిగెనని శ్రీమద్భాగవతమునందే చెప్పబడియున్నది. అట్లు శ్రీకృష్ణుని బాల్యక్రీడలు పసితనమునందే జరిగియుండెనుకనుక నట్టిచిన్నవయస్సునకు జారత్వ మాపాదింప వీలులేదు. పోతనామాత్యుడు దనకవితాచమత్కృతితో భగవల్లీలలని యట్లు శృంగారరసములో దెలుగు భాగవతమునందు వర్ణించియుండెనుకాని, యౌవనమే లేని బాలున కట్టికాముకాభావము గలిగెననుటలో నర్థములేదు. అంతేగాక "నీవుయశోదబిడ్డవె నీరజనేత్ర సమస్త జంతు చేతో విదితాత్మ వీశుడవు" అని యాకవీశ్వరుడు బిమ్మట గోపికాగీతలందా వ్రేతల చేతనే స్తుతి జేయించియున్నాడు. కనుక గోపికలు మొదట దన్ను గడపద్రొక్కనీయకపోయినప్పుడా బాలకృష్ణుడేదో యొక చమత్కారముతో దగ్గరకు జేరి, మఱపించి, యుక్తిగా నింటిలోనికి జొచ్చుట జరిగియుండెడిది. అది సహజముగా కుఱ్ఱవాండ్లకుం దఱచును స్వాభావికమ్మై యున్నది.

40. తా॥ అంతేగాక మేము మాయిండ్లలోనున్న పాలకుండ లనన్నింటిని జాగ్రత్తగా దాచికొని, తలుపులు బిగించి, గుమ్మముమీదనే గూర్చొని కావలియుండగా, మాకంటబడకుండగనే యెటుగండి లోనికి బోవునో కాని, కడవలుమాత్రము ఖాళీయై యుండునమ్మా! ఇంకా యేమేమో పులి, తోడేలువలె దొంగయుఖపులఱచి మమ్ము నిర్ఘాంతపెట్టి మాయిండ్లలోదూఱి పాలకుండల దన్నికొనుచు జిక్కకుండా దప్పించుకొని మఱీ పాఱిపోతూయుంటే, యింకా నీ కేమిచెప్పవలెనమ్మా యశోదమ్మగారూ! మొత్తముమీద కనిపాకేసి యాబోతును విడిచినట్లుగా ఊరిమీద వదలితే స్తేమట్లుకు మే మిక యూరుకోలేమమ్మా!

41. తా॥ అని యుప్పతనబెట్టుచూ ఆడిపోసుకొనుచుండగా విని నివ్వెఱబొందిన యశోద తన చిన్నికుమారుని ముఖలక్షణములలోని యమాయకత్వమును జూడగానే చిఱునవ్వు గలిగి, తనముద్దుబిడ్డ నన్యాయముగా సరి పడక నిందించుచుండి రనితలంచి యొడలుపులకరింపగా వారిని నిరాకరింపనెంచి,—

42. తా॥ ఓహోహో గోపికలారా! మీ రిట్లు గోపమెత్తి వచ్చి యీరోజువరకు నాచనుబాలైనామానని యీ పసివాని నీరీతిగా జారచోరదూషణములతో నిందించి వృథాగా యెందులకి ట్లుప్పతనప్లాజ్జేసెదరమ్మా?

అన్యాయముగా శిశువుల నింద జేసిన గన్నకడుపైన తలిదండ్రుల కెంతయు విచారకరము గాదా!

43. తా॥ మీరుమట్టుకు బిడ్డలగనని గొడ్డుబోతులా యీరీతిగా నాముద్దులకొడుకుమీద బొంకులుసాపిమట్టి తిట్టిపోయుచున్నారు. చాలుజాలుగాని యీ వేషాలు మాని నాయింటిముంగటినుంచి వెళ్లిపొండి.

44. తా॥ కానిచో మీరు మీమగవాండ్లపై దిరుగుబాటు జేసి గెలువలేక, ఆకసియంతయు, యీ పరాయితల్లిగన్న పసివానిమీద జూపించి వాపోవుచుంటిరి కాబోల్సు.

45. తా॥ ఆహా ఏమి యీఆగడము? పసివాడన్న తరువాత బోరుగిండ్లవైపుకే రాకయుండునా? వచ్చినప్పుడొక వేళ నేమైన తినేవస్తువులు గన్పించిన నందుకొనక మానునా? అట్లని ఆపాలుపెరుగులు గంటబడకుండా జాటుగా దాచిపెట్టుకొని, యేదో కళ్లెదురుపెట్టి వాడందుకొనకుండా చూచుకొనవలెనుగాని, యిట్లు పరువుమర్యాదలులేకుండా శాస్త్రంతదానికి గంపెడంత చేసి బొంకులు చాపుతూ బాజారుకెక్కితే యేమున్నది?

46. తా॥ అని యీ గోపికలను తిరస్కరించినదై యశోద కుమారునిపై ప్రేమజనింపగా,వారి సంగతివిడిచి.శ్రీకృష్ణుని దగ్గరకుదీసికొని,—

47. తా॥ నాయనా! నిన్ను ఊరిలోనివారందఱు గొంటెపిల్ల వాడని యపఖ్యాతిని బెట్టుచున్నారు. నీవా నాకు లేక లేక కలిగిన వంశాంకురము గనుక చెడ్డపేరు దెచ్చికొన బోకుమురా నాతండ్రీ!

48. తా॥ అని లాలనము సేయుచు శ్రీకృష్ణుని గృహములోనికి దీసికొని వెళ్లి దృష్టిదోషము దగిలెనేమోయని భయ పడి విభూతిని మంత్రించి తన మనస్సునకు దృప్తిగా నాబాలుని కాపాదమస్తకమును బూసినదయ్యెను.

49. తా॥ ఆప్రకారముగా దల్లి చేత మందలింపబడిన శ్రీకృ ష్ణుడు పేక్షాభావము వహించి గోపికల విషయమై వద లివేయగా, దమ యింటిపురోహితుడైన గర్గమహా ముని యరుదెంచి యాకృష్ణావతారమర్మ మెఱిగియు న్నవాడు గనుక ఆయోగేశ్వరుని యోగవిద్యా విధాన మును బునశ్చరణ జేయవలసినదని హెచ్చరింపుచు క్రి యాయోగములో నుదాసీనుడు గాగూడదని యాశ్వా సించి వెళ్లెను.

## వివరణ:-

అట్లు లోకులచేత దూషింపబడి ఉదాసీనుడైయున్న బాలకృష్ణుని గర్గమునీంద్రుడు క్రిందివిధముగా నుదోబోధించెను:-

(10)

గర్గ॥ గోపాలదేవా! ఏమట్లుదాసీనునివలె యేదో చింతించుచున్నాడవు?

కృ॥ గురుదేవా! నే నితరులకు మేలుసేయుచుండగా నన్ను దుర్మార్గునిగా భావించుచున్నారుగదా స్వామీ!

గ॥ నాయనా! లోకము కాకులవంటిదనికదా సామెత. మఱియు "లోకో భిన్నరుచిః" కావున మన మితరుల యుద్దేశములు గమనింపకూడదు. నీవు నీబుద్ధికి దోచి నటుల జేయుట నీకర్తవ్యము.

కృ॥ కాని యితరులు నన్ను దూలనాడుచుండిరిగదా స్వామీ!

గ॥ ఎవ్వరెవ్వరిని దూలనాడిరోయీ, గోపాలా?

కృ॥ ఈ యూరివారందఱువచ్చి నన్ను దిట్టి మాయమ్మతో బోట్లాడిపోయిరి స్వామీ!

గ॥ ఎవరిని దిట్టిరి నాయనా?

కృ॥ నన్నే స్వామీ! నన్నే.

గ॥ అంటే నాకర్థముగాలేదే!

కృ॥ అయ్యో నన్నేనండి, నన్నే. ఈ యశోదాకుమారుడ నగు శ్రీకృష్ణుని.

గ॥ ఓహో! అటులానా, కృష్ణుడవైన నిన్నే తిట్టిపోయిరా?

కృ॥ ఔనండి, ఔను.

గ॥ అయితే నీపేరు కృష్ణుడన్నమాట.

కృ॥ కాదు స్వామి; నాపేరు శ్రీకృష్ణుడు.

గ॥ సరే, నీ పేరైతే శ్రీకృష్ణుడు.

కృ॥ అవును స్వామీ, నా పేరు శ్రీకృష్ణుడు.

గ॥ అయితే నీ వెవ్వర వోయీ?

కృ॥ అయ్యో! నేను శ్రీకృష్ణుడనని చెప్పుకొంటిని గాదండీ, యింతలోనే మఱచిపోతిరా స్వామీ!

గ॥ కావచ్చునబ్బాయీ! శ్రీకృష్ణుడనేది నీయొక్క పేరు గదా! అటువంటి నీవు ఎవ్వరో చెప్పుము.

కృ॥ అదేమిటి స్వామీ! అట్లా అడుగుచున్నారు.

గ॥ నీకు నామాట యర్థముగాలేదు కాబోలు. సరే, ఈయశోద ఎవరి తల్లి?

కృ॥ నా తల్లియే.

గ॥ ఔను గదా! నీవు వేఱు, మీయమ్మ యశోద వేఱుగా నుంటిరికావున, ఆమె నీయొక్క తల్లియైనది. కాని ఆమెయు నీవును నొక్కటే మనిషి కాదుగదా!

కృ॥ అవునండి, ఆమె నాతల్లి కాని, నేనూ ఆమె యొక్కరమే యెట్లగుదును!

గ॥ మఱి, యిందాక నీవు నీపేరు శ్రీకృష్ణుడంటివే. అప్పుడు నీవూ నీయొక్క పేరును వేఱే వేఱే గాక, యొకేవస్తు వెట్లైనది?

కృ॥ అవును స్వామీ! నేను బుట్టినతరువాత చిన్నప్పుడు దమరే దయచేసి నాకు శ్రీకృష్ణుడని పేరుబెట్టినా రటగదా! ఆ అబ్బాయి నేనండి నేను. ఇప్పుడింత పెద్దవాడనైతిని.

గు॥ సరే పోనీలే, నీ చేయి యేది?

కృ॥ ఇదుగో నండి, యిది కుడిచేయి.

గు॥ అవును, యిది ఎవరి చేయి?

కృ॥ నాచెయ్యి గదండి, నాదే.

గు॥ అవును, ఇది నీది. అనగా నీయొక్క చేయి. అంటే, యిందాక నీయొక్క తల్లి యన్నట్లుగా, నీ చేయి వేఱు, నీవు వేఱుగా నున్నారు గాదూ!

కృ॥ అ దెట్లాయగు నండి? నాచేయీ నేనూ కలిసియే యున్నాము. కాని నాతల్లీ నేను వేఱే వేఱే యున్నాము గాదండీ.

గు॥ అయితే, యీ నీచేయి తెగిపోయిన, నీవుగూడ లేక పోదువా?

కృ॥ అంహం; ఈచేయిపోతే, నా కింకొకచేయిగూడాయున్న దిగదండి.

గు॥ అవును, యీచేయిపోతేగూడా "నీవు" అంటూ యుంటున్నాడవు గనుక నీవు వేఱు, నీచేయి వేఱు. అనగా నీవు ఆచేయి వే యని చెప్పవీలులేదు అది నీయొక్క చేయి. అనగా నీవు వేఱేగా యుంటూయుండగా, ఆ చేయిగూడా వేఱే గానే యుండి, నీది యగుచున్నది.

కృ॥ ఔను స్వామి, తెలిసినది. ఇది నాయొక్కచేయి యగుచున్నది. అయితే యీకాలూ నాదియే, యీముక్కూ నాదియే, యీకన్నులూ నావియే నన్నమాట ఇవి యుంటే నావి, యుండకపోతే నాకు లేకపోవుచు

న్నవి కాని "నే" నంటూ నివి లేక పోయిన గూడా యుంటానండి!

మఱి, యీ కండ్లూ ముక్కూ, చెవులూ, కాళ్లూ తలా నీవు గాకపోతే "నీ" వెవ్వర వోయ్?

అదేనండి, నే నెవరిని?...ఆఁ, యీముక్కులో నడిచే యూపిరి గావచ్చును గాదండీ!

మంచిది, ముక్కు మూసిపట్టుకొని చూడు.

నాకు ఊపిరి ఆడదుగదండీ!

ఆఁ, నీకు ఊపిరియాడదంటే నీవు వేఱు, నీ యూపి వేఱు గాదూ?

అంతే నండి.

మఱి నీ వెవ్వడవు?

ఏమో తెలియుట లేదండి. అంతా అయోమయముగా నున్నది. స్వామీ! తమరే న న్ననుగ్రహింప వలసినది మునీంద్రా!

అటులైన వినుము. నీశరీరమునందు "నే" ననునది నీశరీరము కాదు. నీశ్వాసయు గాదు. ఈశ్వాస మనస్సు యొక్క స్థూలరూపము. ఈశ్వాసననుసరించుచు నను గమించిన, నీదేహమునందలి పంచకోశములను దాటి యగలవు. ఆ ఇంద్రియములజయించి, మనస్సును వశపఱచి కొని యహంకారము నణగద్రొక్కిన బుద్ధికి ఆత్మావలోకన మొదవి నిను నీవు యథార్థముగా నెఱిగికొనగలుగుచున్నాడవు. కాని, యీదేహమును

వనియు, మనస్సు నీవనియు పొఱపడుట మాయ (లేక) అజ్ఞాన మనబడుచున్నది. నీవు సర్వకాలసర్వావస్థలందునగూడా ఆత్మవే యై యున్నాడవు. ఆ అజ్ఞానమను మాయ తెఱ దొలగిన, సూర్యోదయముతో నిండుచీకటియంతయు నెగిరిపోవునట్లు, ఆత్మసాక్షాత్కారమొదవి, అజ్ఞానమంతయు నశించుచున్నది. ఆత్మ యెల్లప్పుడు సాక్షిమాత్రుడే కాని, కర్తయు భోక్తయు గాడు. కావున ఆత్మకు దూషణభూషణము లెన్నడును లేవు. నీవా ఆత్మస్వరూప మయ్యే యుంటివి గనుక లోకు లాత్మయగు నిన్ను దిట్టుచుండిరని తలంచుట యారోపిత మగుచున్నది. అన్ని జీవులిలోని ఆత్మ యొక్కటే గనుక తిట్టువాడు, తిట్టుబడినవాడు గూడ నాత్మయే యై యున్నది. ఇక ఈమిథ్యారోపణ చేయుంచునది మనస్సే యై యున్నది. ఆమనస్సు పంచజ్ఞానేంద్రియములద్వారా యానందము కొఱకు బాహ్యవిషయములలో వెతకికొనుచు, జీవునకహంకార మాపాదించి కర్మలంపట నొందించి జననమరణముల బొందించుచున్నది. జీవాత్మయే యథార్థస్థితిలో అఖండానందస్వరూపముగానున్నది. కావున మనస్సు నంతర్ముఖము సేయవలయును. రెండుకండ్లను మూసికొనిన, యీ మాయాప్రపంచమునం దొకయైదవభాగము అదృశ్యమగుచున్నది. నోరు గూడా మూసిన, రెండు వంతులుగా నశించుచున్నది. చెవులు మూసిన మూడువంతులు మాయమగుచున్నది. అట్లే

ముక్కుమూసిన నాల్గువంతులుగాను, శరీరమే మఱచిన బూర్తిగాగాను ప్రపంచము లేకపోవుచున్నది. అనగా యీ మైకు మార్గములు నిరోధించిన, మనస్సు పరిభ్రమించక జీవాత్మలో నణగిపోవుచున్నది. కనుక శ్రీ, గోపాలదేవా! నీ వా మనస్సునుజయించి లోకులకు వెలువక, నీ బుద్ధికి యుక్తమని తోచినట్లు కర్మాచరణము సేయుచు, గర్తృత్వాభిమానములేక లోకోపకారము సేయవలసినది.

కృ॥ అయితే, గురువర్యా! సాధన మేప్రకారముగా జేయవలయునో యనుగ్రహించి, నన్ను గృతార్థుని జేయుడు.

గ॥ కృష్ణభగవానుడా! నీవు సాక్షాత్ భగవంతుడవును ఆజన్మజ్ఞానివియు గావున నేను నీకు వేఱే యుపదేశింపవలశినది లేదు. ఐనను, నీ వీబాల్యమునందే యష్టాంగయోగముతో గూడిన రాజయోగమును బునశ్చరణచేసికొనిన, ఉత్తరోత్తరా లోకమునకు దత్త్వోపదేశము సేయుటకు మాననీయుడవగుదువు. కానిచో లోకులు నీయమానుషత్వమెఱుగజాలక నీ గీతాబోధతత్త్వమాదరింపకపోయిన రాబోవు కలియుగమున ధర్మము బొత్తుగా నశించిపోవును సుమా!

అని గర్గమహాముని శ్రీకృష్ణుని బ్రోత్సాహపఱచి వెడలిపోయెను.

50. తా॥ ఆవిధముగా మాతృదేవతకంటె గొప్పదైన గురుదేవునివాక్యము ననుసరించి, కాలయాపనము సేయక,

శ్రీకృష్ణుడు గోపికల విషయమై త్వరపడి విచ్చలవిడిగా వారి పెరుగు పాలు మొదలైన వస్తువుల నాశము సేయ మొదలుబెట్టగా, వారందఱు జాలా మనోవ్యధపాలైరి.

51. తా॥ గోపిక యొక్కతె ప్రతిదినము శ్రీకృష్ణుడు సేయు దానికి వానిని బట్టికొని ప్రతిక్రియ జేయవలెనని సంకల్పించి, ఆనాడు యేకాదశి గూడా అగుటచే నింటిలో వంటచేయనక్కఱలేదుగదా యని యితరపనులేమియు దలబెట్టక, కృష్ణుడందుకొన వీలులేకుండునట్లు నడికప్పున కొక యుట్టినిగట్టి, అందులో బాలు పెరుగు వెన్నకుండలను జాగ్రత్తపఱచి, తలుపులు బిగించి, పీధిగుమ్మము మీదనే మిక్కిలి మెలకువతో గూర్చొని త్రోవగాచికొనుచుండగా నంతలో మధ్యాహ్నకాలమయ్యెను.

52. తా॥ అట్లు పచ్చియుపవాసముసేయు నామెకు నోరు ఎండగా వాకిలిముంగటనున్న చెఱువులోనికి వెనుకకు దిరిగితిరిగి చూచికొనుచు బోయి, త్వరగా నొకగ్రుక్కెడు నీటితో నోరుదడిపికొని, మఱుక్షణములో గ్రున్న తిరిగి యిల్లుసేరుకొనునప్పటికి గుండెఝల్లురనగా నంతలోనేయిల్లంతయునిండియుండిన యనేకమంది గోపకులజూచెను.

53. తా॥ ఆబాలురతోపాటు శ్రీకృష్ణుడును రోళ్లు పీటలు బోర్లువెట్టి, వేఱొక పిల్లవాని నెక్కించి, వాని భుజ

ములపై దాఁనిలబడి, చేతికందని యీయుట్టియందలి కుండలకు రంధ్రముగొట్టి, అవిసురున కాయుట్టి యిటు నటు నూగుచుండగా దానితోబాటు దాను తనశిర మునుగూడా సమానముగా వంచిత్రిప్పుచు, క్రిందికి గారుచున్న క్షీరధారకు దోసిలిబట్టి, తానును దనక్రింద నిలబడినవాడును ద్రావుచుండగా, తక్కుగల బాలకులు మోచేతులక్రింద జుట్టికొని త్రావుచుండి, యందఱు దదేక నిమగ్నులై పిలచినా వినిపించికొనలేని స్థితిలో పొట్టలుమట్టుకు బెద్దవిగా బెరుగుచుండగా, ఆయిల్లాలి ఏకాదశీవ్రతము సఫలమాయెనా యన్నట్లుగా శ్రీకృష్ణుడు నిజవిభూతియైన గోపాలురతో సహా ప్రత్యక్షమయ్యెను.

## వివరణ:-

ఈ గోపవనిత యుపవాసదీక్షతో నేకాదశేంద్రియముల నిరోధించి, చిత్తైకాగ్రతగలదై, శ్రీకృష్ణునే స్మరించుచు బగచేతనో వగచేతనో ధ్యానించుచుండెను గనుక, భక్తపరాధీనుడైన్న భగవంతు డామె కవశ్యము దర్శన మీయవలసివచ్చినది. కాని ఆమెబుద్ధిపరిపక్వముకాకపోవుటచే ఆమె ఆభగవత్సాక్షాత్కారము నెఱుగ లేకపోయినది. అట్లాధర్మసూక్ష్మమాయిల్లాలు గ్రహింపలేకపోయిననూ, గర్మఫలము దప్పదుకావున, దదేకధ్యానముతో శుచియై ఆదిన మామె

సాధించిన కర్మయోగ్యతయే యామెపాత్రతకొలది నామెకు దక్షిణము ఫలించి భగవత్సందర్శనము ప్రసాదించెను.

54. తా॥ ఆరీతిగా జూచి, భయము, నాశ్చర్యములతో గూడి కొనిన వణకుపుట్టుచున్ననూ, దొంగయని యనుకొనిన ఆబాలకృష్ణుని బట్టుకొనవలయునని ధైర్యముతెచ్చి కొని, వానిమీదనే దృష్టినిలిపి, మెల్లమెల్లగా దగ్గరకు జేరుచుండగా శ్రీకృష్ణుడామె నేత్రము లుపవాసము చే జిక్కియుండెనని దయదలచెనన్నట్లుగా, బుక్కిట లోని పాల నామెకన్నులపై నుమిసి, ఆమె తెప్పరిల్లి చూడగలిగేలోపుగా నాగోపాలకులతో సహా చిత్ర ముగా నదృశ్యమయ్యెను.

55. తా॥ ఆవిధముగా నెవ్వరి కంటబడకుండా నెక్కడ నని పెట్టుకొని యుండునో, యెప్పుడింటిలోనికి దూఱునో యెట్లు పాఱిపోవునో, కాని యేమాత్రమును చప్పుడు గాదు. పైగాకుండలు బెట్టినట్లేయుండును కాని లోపల చూచిన శూన్యమని పరిపరివిధముల దలపోయుచు ఆకొంటెకృష్ణుని విషయమై వానితల్లికూడా పట్టించి కొనుట లేదుగదా యని వ్యసనపడుచు,—

56. తా॥ అట్టి విచార మారోజు కారోజు కెక్కుడుగాగా, ఆగోపికలు వాకిం డ్లూడ్చుచున్ననూ, ముగ్గుబెట్టు చున్ననూ, వంటకములు సేయుచున్ననూ, మాట

లాడుకొనుచున్ననూ, నిద్రపోవుచున్ననూ, తిరుగు చున్ననూ, చూచుచున్ననూ, వినుచున్ననూ, యింకా నేమేమిచేయుచున్ననూ, చిత్తముమాత్ర మాకృష్ణుని చేతలమీదనే యాకర్షింపబడి వేఱే తాముగా కష్టపడి సాధించే ప్రయత్నము లేకుండగనే మనస్సులంత ర్ముఖమై యేకాగ్రత్వము నొందిరి.

57. తా॥ అట్లు దాము బట్టుకొనవలయునని ప్రయత్నములు సేసినను, దొరికియు దొరకని బాలునిగూర్చి విసిగి, వేసరి, లో లో మెచ్చికొనుచు, యనురాగవతులై తుద కాగోపిక లసూయాద్వేషములు మఱచి, యొండొరులగలసి సమానముగా శ్రీకృష్ణుని ప్రేమింపదొడగిరి.

58. తా॥ ఈ ప్రకారముగా జిత్తైకాగ్రత నొందుచు, హృదయపూర్వకముగా గామక్రోధాదుల విసర్జించి శ్రీకృష్ణునియం దెక్కుడు మమకారము గలిగినవారలై గోపికలాబాలకుని దమ చేతులలోనికి జేరదిగిచికొని గాఢముగాన పేక్షింపగా రాంబము సేయవలయునని గాఢముగాన పేక్షింపగా ఆశ్రీకృష్ణుడు వారలకు శరీరము వేఱు ఆత్మలు వేఱు అని నిర్ధారణ చేయుచు స్ఫుటముగా ననహంకారోపదేశము సేయదలచినవాడై చిత్రముగా దన బాలక్రీడ నొకటి నిరూపించెను.

**వివరణ:-**

గోపిక లింద్రియలోలులుగానుండి యే ఆశ్రీకృష్ణుని దాకగోరుచుండిరి, కాని గతజన్మలోని మునీశ్వరులవలె నింద్రియాతీతలై కాదు. కనుక, వారికి స్థూలదేహవాసన పూర్తిగా నశింప జేయుటకై భగవంతు డుపదేశము సేయవలసివచ్చెను. అట్లని తన దైవత్వ మెఱుగని సంసారిణులగు ఆగోపికలను బిలిచి మంత్రోపదేశము సేయుటకు వీలులేమి క్రియారూపముగా నొక్కట ఆత్మచికిత్స నొనరింపగడగెను. ఆవిధముగా జ్ఞానులైన వారతాత్తుగా జిత్తప్రక్రియ నొనర్చిన బాత్రులు గానట్టిమూఢహృదయులగు శిష్యులకు నాడీదోషముసంభవించి ప్రమాదము జరుగుట తటస్థించును. అందువల్లనే యమనియమాదులు మొదట తప్పక సాధింపవలసియున్నది. కాని ఆగోపికలన్ననో అదివఱకే యింద్రియవాసనలను మఱల్చిన హృదయసైర్యమును బొందియున్నవారగుటచే వారి కా నాడీవిజృంభణము దరుణమేయయ్యెను.

59. తా॥ ఒకనాడు గోపికలందఱు గౌరీదేవీవ్రత మారంభించి వినోదముగా నాడుచు బాడుచు, యమునానదికి వెళ్లి నిస్సంకోచముతో వివస్త్రలై స్నానముసేయుచుండిరి.

60. తా॥ అప్పుడా బాలకృష్ణు డాయొడ్డు మీదనున్న ఆవ్రేతల చీరెలు దొంగిలుచుండగా వారు చూచి యాతని వారింపదొడగిరి,—

61. తా॥ అయ్యో, అయ్యో, కృష్ణా! ఇదేమిపనిరా? ఆడ వాండ్లు స్నానమాడుచుండగా మగవాండ్లిట్లు పొంచి చూచి రావచ్చునటరా? ఒకవేళ పొరపాటున వచ్చితేని, యీ విధముగా చీరెలెత్తుకొనిపోవుదురా? ఛీ! ఛీ! నీవు చాలామంచివాడవు గదా! పరుగెత్తి పాఱిపోక మాకోక లక్కడ విడిచిపెట్టి వెళ్లు నాయనా. అయ్యో! అప్పుడేచాలాప్రొద్దుగూడా మెక్కెనదే!

62. తా॥ ఓ కృష్ణా! నీవు మా మాట వినకపోయిన, మీయమ్మతో జెప్పెదము సుమా! అయ్యయ్యో! ఇవేమి యాటలురా? మా నాయనగాదూ! తే, మాచీరెలు మా కందిచ్చు తండ్రీ! యని స్వభావసిద్ధమైన లజ్జతో వినయమున భయమున బ్రతిమాలికొనిరి.

63. తా॥ అప్పుడా గోపాలకృష్ణుడు దానక్రియవలనగాదు గావున వారి కోకలు దీసికొని పాఱిపోక వారి కొక క్రియావిధానమును గల్పించి సాభిప్రాయముగా నిట్లనియె:—ఓ గోపికలారా! భయపడకుడు. మీ రేల యింత సిగ్గునొందెదరు? ఈజగమంతయు మిథ్యయే కదా! అటులనే యీపాంచభౌతికమైన మీశరీరములును మీ మీ ప్రారబ్ధకర్మానుభవమునకై మీరుధరింపవలసివచ్చినదేకదా! కావున అనిత్యములైన మీ యీతుచ్ఛదేహములపై నింతయభిమానమెందులకు?

మీరు యింద్రియవాసనలుమాని, దేహభ్రాంతివిడిచి ఆత్మాత్మానుసంధానబుద్ధితో నీటిలోనుండి వెలుపలికి వచ్చిన, మీకు మీమీ ప్రకృతిధారణావశ్యకము లైన వస్త్రములిచ్చుటయేగాక, తక్కు ఆత్మక్షేమకరము లైన దివ్యలక్షణములను దృఢమగు మనోబలమును గూడ బ్రాప్తింపగలవు.

64. తా॥ అని సహేతుకముగా వారిదేహవాసన బలాత్కారముగా హరింపగా, నిశ్శంకగా దద్బోధ గ్రహింప లేని చంచలలుగావున, నిర్విణ్ణహృదయలై ఆగోపికలోపికలు సెడి మఱల యశోదకడకుంజని కృష్ణుని విపరీతచర్యను సాదృశ్యముగా నిరూపించి వాపోయిరి.

65. తా॥ అప్పుడాయశోదాదేవియు సహజమైన స్త్రీహృదయముతో గమనించి, గోపికలు సెప్పినమాటయే నమ్మినదికాని, శ్రీకృష్ణుని బుద్ధియందలి సదుద్దేశమైన అనహంకారోపదేశవిధానము గ్రహింపలేకపోయెను. అందువలన, ఆమె తనకుమారునిపై నలుకదెచ్చికొని తాను వానిని దప్పక దండింతునని వ్రేతల సమాధానపఱచి పంపివేసెను.

66 తా॥ తరువాత ఆ యశోదమ్మ శ్రీకృష్ణుని దుశ్చేష్టల గురించి విచారగ్రస్తమై, యికబిల్లవాడింటనే యుండిన

బొత్తిగా జెడిపోవునని తలంచి, తను కులవృత్తియైన గొడ్లకాపరితనముపై నియమించుచు శీఘ్రముగా నడవులకు బంపవలసినదే యని మనస్సునకుదుర్చుకొని, భర్తయైన నందునకుగూడా నచ్చజెప్పినదై యొక నాటి సుముహూర్తము నిర్ణయించెను.

67. తా॥ అట్లు ప్రప్రథమముగా మందదోలికొనిబోవుటకై యలంకరింపబడిన ఆగోపాలకృష్ణుడు దన మాతృదేవతకు ప్రదక్షిణపూర్వక నమస్కారాదులాచరించి, ఆమె యాశీర్వచనమునందుకొని, చద్దియన్నము నొకకట్టెకు దగిల్చికొని తన్ను జూచి పరితపించుచున్న గోపికాజనమునకు నుపశాంతి కలుగునట్లుగా జిఱునవ్వు నవ్వుచూ, నొయ్యారముతో వారివైపు తిరిగి తిరిగి చూచుచు నావులమంద వెంట నడచెను.

68. తా॥ అట్లు శ్రీకృష్ణుడూరి వెలుపల నున్న పొలములలో బశువుల మేపికొనుచు క్రమముగా నన్నిదిక్కులందలి దూరపు బయళ్లనుగూడా యరసికొనుచు, తుదకు యమునానదీప్రాంతము చేరెను. అక్కడనున్న కొండభూములయందు, గడ్డి యెక్కుడుగా గన్పడుటచేతను ఆ నదియందెల్లప్పుడు నీరుగూడా పొలుదలగా నుండుటచేతను, ఆ ప్రదేశమే యెక్కువ వసతిగా నున్నదని నిశ్చయించికొని, క్రూరమృగములు సంచరింపని పచ్చికబీడులందా పశువుల మేపికొనుచుండెను.

69. తా॥ ఆవిధముగా యాదవకులశేఖరుడైన గోపాలదేవుడు దేశకాలపాత్ర మెఱిగికొని పశుపోషణ జేయుచుండగా ఆవులును బోదుగులు బెంచి పుష్కలముగా బాలిచ్చుచూ ఆ వ్రేపల్లెవాడలో గఱువుమాటయే కల్లగా సిరిసంపదల కభివృద్ధి గలుగ జేసెను.

70. తా॥ ఇట్లు శ్రీకృష్ణుడాలమేపికొనుటకై ప్రతిదినమును యూరిబైటకు బోవుచుండగా నక్కడ వ్రేపల్లెవాడలోని గోపిక లాబాలగోపాలు డట్లు గంటికిదూరము య్యోగదా యని వగజెందినవారై ప్రొద్దస్తమానము వానివిషయమే చెప్పికొని యాలాపము సేయుచు దిగులుపడజొచ్చిరి.

71. తా॥ అంతేగాక ఉపదేశము యొక్క బలముచేతగూడ నిరంతర మాశ్రీకృష్ణునిమీదనే ధ్యాసకలిగినవారై వాని విషయమే మాటలాడుకొనుచు, వానిమీదనే పాటలుబాడుకొనుచు, వాని సంగతియే యనుకొనుచు వానినే మెచ్చికొనుచు యెప్పుడెప్పుడు ప్రొద్దుగ్రుంకునా, యెప్పుడా బాలకృష్ణు డడవులనుండి మఱలి యింటికివచ్చునా యని తపించుచు వేచియుండి, సూర్యాస్తమయము కాగానే ఆగోపిక లాకృష్ణుని కిష్టమగు తినుబండములను సేకరించికొని వెళ్లి యాతురలై మాచిన్నికృష్ణు డెక్కడున్నాడమ్మా! యశోదా! యని వెతకికొనుచుండిరి.

## వివరణ:-

ఉపదేశమనునది ఉపన్యాసమువంటిది గాదు. ఉపన్యాసమనునది చిత్తక్షోభముగా జేయు గ్రంథవిమర్శనకు బర్యవసానమై యెప్పటికప్పుడు సెప్పువాడును, వినువాడును మఱచుటకవకాశము గలిగియుండును. ఉపదేశమన్ననో యట్లుగాక అక్షరస్పృహనే యరికట్టి దన్నుదానుగా బ్రపంచమునుండి మఱల్చుచు మనోవేగమునిలిపి జీవాత్మపరమాత్మలను జతగూర్చు దారమువంటి యొకనాడీచలన మగుచున్నది గురువైన వాడొక్కయుపదేశముతోనే తనయోగశక్తిని ప్రవేశపెట్టి శిష్యునిశరీరమునందలి నాడిని బ్రకోపింప జేయగా నిక నది యావజ్జీవమును వ్యక్తిగతముగానే ప్రసరించుచుండి, తదధిష్ఠానదేవత నేనాటికైననూ సాక్షాత్కరింప జేయుచున్నది. అట్లా యా దేవతలకా యా నాడీస్థానములుండి, బ్రహ్మత్వమునకును వేఱే యొకయూర్ధ్వనాడి హృదయమునందు గలదు గావున, అట్టితత్త్వోపదేశము సేయుటకును గురువైనవాడు బ్రహ్మజ్ఞానియేయై యుండవలెనుగాని యోగసిద్ధిలేని వారలు సేయజాలరు. అందునను క్షుద్రదేవతలు శీఘ్రముగాను గొప్పదేవతలాలస్యముగాను ప్రసన్నలగుదురు, గావున అవ్యక్తపరబ్రహ్మస్వరూపమగు నేకాక్షరప్రణవారాధన మత్యంత దూరముగానున్నది. అట్టి బ్రహ్మజ్ఞానినెఱుగుటయు గష్టతరమే. కాని సాధకునికి వైరాగ్యయుక్తమైన పాత్రత చేకూఱిన ఆపరబ్రహ్మమే గురుదేవునిరూప

ముగా స్వయముగావచ్చి యుద్ధరించుచున్నాడని శ్రుతులు చెప్పుచున్నవి.

72. తా॥ శ్రీకృష్ణభక్తి తత్పరురాలైన (రాధయను) ఒక గోపిక యెప్పుడు బ్రొద్దుగ్రుంకునా యెప్పుడువెళ్లి బాలకృష్ణుని ముద్దులమోమును జూడగలుగుదునా యని యాతురతతో తొందరతొందరగా దనయింటిలోని పనులన్నియు దీర్చికొని, చీకటిపడగానే, దివ్వె వెలిగించికొని వచ్చెదనను నెపముతో గడపదాటి నేలుగా యశోదయింటికిం జని యక్కడ దీపము ముట్టించికొనుచు, దాపుననున్న నందనందనుని సుందరముఖారవిందమును దిలకించియానందించుచు, తన్నుదా మఱచియుండగా, ఆమె వెలిగించుచున్న చేతిలోని వత్తియంతయు మండుకొని తుదకు చేతివ్రేళ్లు కాలిపోవుచున్ననూ ఆగోపిక తెలిసికొనలేకపోయెను. అంతలో ఆమె యత్తగారు తన కోడలాయశోదమ్మగారింటికే వెళ్లియుండునని యనుమానించి, యాగ్రహావేశముతో నచ్చటికి వెళ్లగా, ఆ యమాయకపుకోడలి చేతివ్రేళ్లు కాలిపోవుటజూచి, తనకు వచ్చిన కోపమంతయు మఱచి గొల్లుమంటూ ఱొమ్ముబాదుకొని యేడ్వసాగెను.

విశేషార్థము:-

ముఖ్యముగా నాగోపాలకృష్ణుని మేనత్తయైన రాధయను యువతి ఆ బాలకృష్ణునియందలి భగవల్లక్షణములను

దన పూర్వపుణ్య భాగ్యముచే స్వయముగా గుర్తించినదై, ఆకృష్ణకుమారకునిపై దివ్యమైనభక్తి భావమును బెంపొందించి కొనుచు, ఆమాయామానుష విగ్రహుని శిష్యబృందమన నొప్పు నాపదునాఱు వేల గోపిక లందఱిలోను ముఖ్య శిష్యురాల య్యెను.

వివరణ:-

సాధకుడు దనహృదయములో నిజమైన భక్తిని గలిగి యున్న వానికి ప్రకృతియంతయు ననుగుణ్యముగానే నడచి కొనెను, కనుక కోపముతో బోయిన ఆయత్తగారు శాంతురాలై గారాబముతో గోడలి నింటికిదీసికొని వెళ్లినది.

73. తా॥ ఆవిధముగా దినదినమును వృద్ధియగుచుండిన ధ్యాన శక్తితో ఆవ్రేతలు గ్రమక్రమముగా గృహచ్ఛిద్రము లయం దాసక్తి వదలి తమ చిత్తములయందు బ్రపంచ ధోరణియే మఱచి మనోలయము నొందుచుండిరి.

వివరణ:-

ఈప్రకారముగా బూర్వజన్మసంస్కారములు గలిగిన గోపికల నింద్రజాలమగు సంసారప్రవృత్తినుండి మఱలించి, భక్తులను సంసారచక్రమునుండి తఱింపజేయు ప్రభువైన యాశ్రీకృష్ణభగవానుండా గోపీజనమునకు ధారణాధ్యానసమాధియోగముల నలవాటుబఱచి సంయమనిష్ఠలనొసగి

చెను. కాని గోపికలన్ననో ఆ బాలకృష్ణు డవతారమూర్తి యని కాని, ఆజన్మజ్ఞానియని కాని యెఱిగికొనలేకపోగా, తాము ధ్యానాత్మనిష్ఠ బొందుచుండుటయుగూడా తెలిసికొనియుండ లేదు. అనగా వారికి దమ బుద్ధియొక్క ప్రమేయములేకుండి ననూ తమశరీరములలో జీర్ణకోశము, శ్వాసకోశము మొద లైన వెల్లుపని చేయుచుండెనో, యదేవిధముగా వారిబుద్ధి కవగతము గాకపోయిననూ ఆత్మానిష్ఠాధురంధరిణులగుట సహజమైనట్లుగా సంభవించినది.

74. తా॥ అక్కడ ఆయమునారణ్యములందు దోడిగోపాలు రాటపాటలయందు బ్రొద్దుబుచ్చుకొనుచుండగా, ఆజన్మజ్ఞానియైన శ్రీకృష్ణు డేకాంతముసొచ్చి నిజగురువు లాదేశించినచొప్పున రాజయోగము బునశ్చరణము సేయదలకొని యమనియమములతో అష్టాంగయోగాభ్యాసదీక్షవహించి సాధన కుపక్రమించెను.

75. తా॥ ఆ ట్లాటపాటలయం దాసక్తిలేనివాడై శ్రీకృష్ణు డాయమునారణ్యములందలి వింతలను జూడదలచి యేకాంతముగా బోవుచు బృందావనము బ్రవేశించి, యొకపొన్నచెట్టుక్రింద గూర్చొని వినోదించుచు ఆయమునానది యొక్క నీటిప్రవాహమును గమనించుచుండగా,—

విశేషార్థము:-

అట్లు యమనియమముల నవలంబించి యేకాంతము జొచ్చిన శ్రీకృష్ణుడు దీక్షవహించి, యొకపొన్నచెట్టుక్రింద బద్ధాసనస్థుడై కూర్చొని, చిన్ముద్రబట్టి, క్రమముగా రేచక పూరక కుంభకములతో హృదయకోశమునందలి యపానవాయువును వెల్బుచుండగా,—

76. తా॥ అటువైపున పెద్దపెద్దయలలతో బొంగుచుండి, లోపలదాగియున్న కాళియసర్పమునకు నిలయముగా నుండిన యొక నీటిమడుగును గుర్తించి దానిని సమీపించెను.

విశేషార్థము:-

కొలది యభ్యాసముతోనే తెంపులేని యింద్రియవాసనలతో బొంగిపొఱలుచు, లోపలనణగియున్న కుండలినీశక్తి కాశ్రయముగానున్న మూలాధారచక్రము నెఱిగికొనినవాడై,—

77. తా॥ అట్లా కాళిందీమడువును సమీపించి, సాహసముతో ఆమడుగులోనికి దుముకదలంచి, మొలనున్న పీతాంబరమును గట్టిగా బిగించికట్టుకొని, శిరోజములను జక్కగాముడివైచికొని, హారములను కంఠమునకు మెలికలుగా దగిల్చికొని, పింఛమును దీర్చి యమర్చికొని, తన పైనున్న యుత్తరీయమును గూడా గ్రిందబడవైచి, శరీ

రము: బెంచి, భుజములుగొట్టి, యూపుత్తో నుద్రేకము దెచ్చికొని, హుమ్మనుచు మూర్ఖపుపట్టుదలగా ముక్కు బట్టికొని, యెగిరి, యామడువులోనికి దూకినవాడై వలయాకారములు దిరుగుచు నలయక ఘోరముగా నీదులాడజొచ్చెను.

విశేషార్థము:-

ఒకనాడు దృఢమగు బుద్ధితో దీవ్రముగా గుంభకములు సేయదలంచి, కటిచేలమును జక్కగా వదులు సేసికొని, శిరోజములు గాలికెగిరి చెదరకుండా సర్దుకొని, హారములు దేహస్పృహ గలిగింపకుండునట్లుగా మడతలుగా వేసికొని, మీది యుత్తరీయమునే యాసనయోగ్యముగా గ్రిందబఱచికొని, బిగువుగా బద్ధాసనముమీద వెన్ను, కంఠము, శిరము సమానముగా నిలువరించి కూర్చొని, హస్తము సాపి చిన్ముద్ర బట్టి, పూనికతో "ఓం" అను ఏకాక్షరప్రణవమును స్మరించుచు బ్రజ్ఞమీఱగా నొకముక్కురంధ్రమును మూసి, రేచించి పూరించుచూ, ఆ ముల్లోకేశ్వరు డలసటనొందక యమోఘముగా గుంభకములు సేయుచు, ఆమూలాధార చక్రమును భేదింపజొచ్చెను.

78. తా॥ ముఖ్యముగా దా ననేకమాఱులు మత్స్యకూర్మాది యవతారములెత్తుచు మహాసముద్రములయందే యాది యున్న నేర్పరి కావున, శ్రీకృష్ణు డేమాత్రమునలయక

పీరావేశముతో గ్రుక్కబట్టి మునిగి తిరుగుచు ఆమడు
గంతయు గలచి బురద బురద చేసెను.

విశేషార్థము:-

యథార్థమునకు దాను, యోగేశ్వరుడైన సగుణనిర్గుణ
మయపరబ్రహ్మస్వరూపుడును అవతారపురుషుడుగా వున
అనంతవీర్యుడై దృఢముగా ననేక కుంభకములుసేసి తన చై
తన్యశక్తితో నామూలాధార కమలమును భీభత్సము సేయ
జొచ్చెను.

79. తా॥ అట్టామడుగులోని జలచరములన్నియు బెగ్గడిలు
నట్లుగా అల్లకల్లోలమొనరించుచు విజృంభించి, యడు
గుచేలవఱకుబోగా హఠాత్తుగా దనకాలుదాకి బుస్సు
మనుచు దఱిమివచ్చిన కాళియసర్పమునుజూచి
వినోదియై,—

విశేషార్థము:-

అట్టామూలాధార చక్రమునందలి ప్రాణశక్తి
భరించి తట్టుకొనలేనట్లుగా గుంభించి భీభత్సముసేయు
నిజమనోబలమునుజూపి భేదించి, ఆమూలాధారకమలమునం
నిద్రించియున్న కుండలినీశక్తిని లేవగొట్టి లీలావినోదియై,—

80. తా॥ తన సుషుమ్నరంధ్రములలో సంచరించెడి శ్వాస
యొక్క బుసలే నాదముగను, నదీతీరమునందలి యర
ణ్యములనుండిన ఆలమందలు మొదలగుజంతువులు ప్రే
క్షకులుగను, నరములయొక్కయు కీళ్ళయొక్కయు

చప్పుడులు మద్దెల మొదలగు వాయిద్యములుగను, ముక్కు యూదునప్పుడు ప్రసరించెడి యూపిరి యొక్క గతులు తాళముగను, ఒక పెద్దబూర నాగస్వరముగను మేళము సేసికొని ప్రపంచమునకంతటికి నాశ్చర్యముగలుగునట్లుగా, ఆమడుగులోని తామరపుష్పములమధ్యనున్న కాళియసర్పముపై నిలబడి యూతుంటరి పిల్లవాడైన గోపాలకృష్ణుడు కన్నులుగూడా మూసికొని పరవశమొందుచు మోడివేసెను,—

విశేషార్థము:-

అట్లు సులభముగా బాహ్యానుసిద్ధిగాంచిన శ్రీకృష్ణుడు దదేకదీక్షతో బ్రహ్మాహారము సేయువాడై సోహంభావమే స్వరముగాను, దశేంద్రియములే ప్రేక్షకులుగాను, 72,000 నాడులధ్వనులే బహువిధవాద్యవిశేషములుగాను, కుంభకమునందు బరిభ్రమించుచుండిన శ్వాసయొక్క గతియే తాళముగను, నిత్యానందదాయకమగు బ్రహ్మనాళమే నాగస్వరముగను నన్వయించికొని, ముల్లోకములకు నూతన మంగళమొనగూర్చెడి సర్వోపనిషద్సారసంగ్రహమైన గీతోపదేశ వైఖరిసూచించుచు, చైతన్యమాత్రస్వరూపుడై యూపద్మాసనము మీద నేయుండి తనమూలాధారకమలముమధ్యనున్న కుండలినీశక్తి నాడించుచు, తదధిష్ఠానదేవతయైన గణేశున కావందల హంసగాయత్రిని "వశషస" బీజాక్షరములతో జపించి సమర్పించెను.

81. తా॥ ఆప్రకారముగా గాళియమర్దన మాచరించిన శ్రీ కృష్ణుడా యమునారణ్యములలో నెల్లలుమిాఱి భయంకర మైన చోట్లుగూడ బ్రవేశించి యావులమేపికొనుచుం డగా దేవేంద్రుడు రాలవాన గురిపించెను. అప్పుడా వర్షములో గోవులు దడిసి బెగడువడి చావ సిద్ధము గాగా దత్క్షణము శ్రీకృష్ణుడాదాపుననున్న గోవర్ధన మను కొండను లేవనెత్తి ఆవులమందల కాశ్రయమిచ్చి వాటిప్రాణములు దక్కించెను.

విశేషార్థము:-

ఆవిధముగా బ్రిత్యాహార మొనరించిన శ్రీకృష్ణుడు మూలాధారచక్రమునుండి సహస్రారకమలమువరకుగల యేడు చక్రములనుదాట వలెనని ధారణాయోగమునుబూని నిర్మల త్వము బొందుచుండగా చంచలమైన మనస్సుయొక్క పరివర్త నచేత సూక్ష్మముగానున్న యింద్రియములు క్షోభించి దుర్బల మగుచు సడలి నశించిపోవుచుండగా నంతలో సులభముగా స్వాధిష్ఠానకమలములోని రేతోబిందువును గదల్చియూర్ధ్వరేత స్కుడైనందున ఆయింద్రియములకు బూర్ణసత్త్వముగలిగి బున రుద్ధారణము నొందెను.

**వివరణ:-**

ఇక్కడ నొక గూఢమైన విషయముగలదు. ఏమన, ఆదివఱ కధోముఖముగానుండిన కుండలనీశక్తి లేచినప్పు డూ ర్ధ్వముగా బైకిబ్రాకుచు సుషుమ్నామార్గముగా నడచునప్పుడు,

దద్వారభేదనముతో సాధకునికి ప్రాణాపాయమే సంభవించును. లేక, ఆసుషుమ్నా నాడిలోనున్న మలము కపాలమున కెక్కినచో మెదడు చెడి పిచ్చివాడగుటయు జరుగును. అట్టియేప్రమాదములుగలుగకుండా ఆపాచి కుత్తుకలోనికే వచ్చినిలబడి నోటిలోనుండి యుమియబడుటకు ఆకిర్యాసిద్ధి తన పురుషార్థములో లేక కేవలము సాధకుని యొక్క భగవద్భక్తి తాత్పర్యమును, ఆసర్వేశ్వరుని యొక్క దయాకటాక్షము నైయున్నది. ఈస్థితిలో సాధకునికి భౌతికముగా నొకపెద్దజబ్బు చేసి క్రమేణనివారించును. ఆపరీక్షతో ఆవ్యక్తి జీవన్ముక్తి గూడ ఆజన్మలోనే సాధింపగలుగుననుట నిస్సంశయముగా నుండును, యెందువల్లననగా నటనుండి ఆపరమేశ్వరునిశక్తి స్వతన మనస్సును ఆకర్షించి లాగికొనిపోవుచున్నది. మూలాధారచక్రమునుండి కుండలినీశక్తి కదలువరకు, మానవుడు గర్మేంద్రియములకువశ్యుడై స్త్రీలోలుడైయుండును. ఆకుండలినీశక్తియూర్ధ్వముఖమైన కామము స్వతః గానే నశించి బ్రహ్మచర్యము నిర్విఘ్నముగా నిలచుచున్నది. ఈకుండలినీ శక్తి నాభీకమలము యొద్దనున్న మణిపూరకచక్రమును జేరియున్నను, ప్రమాదముజరిగిన మటల మూలాధారమునందు వచ్చినిలచును, గాని యది యామణిపూరకచక్రమును గూడా గడచియున్న, తిరిగి మూలాధారచక్రము వరకు రాజాలక మణిపూరకచక్రమునందే నిలబడిపోవుచున్నదనియు యోగశాస్త్రము చెప్పుచున్నది.

82\. తా॥ ధీరుడైనగోపాలకృష్ణుడబ్బుని రాటంకముగా గోవులను మేపికొనుచు, అరణ్యమధ్యమును బ్రవేశించి,

దూరపరియాసముచే నొక్కింత విశ్రమించగా, నం
తలో నొక విపరీతమైన యీలవంటిధ్వని విని మేలు
కాంచి, యెవ్వడైనా బోయవా డాదాపున దిరుగుచు
ద నొకయడవిమృగమని పొఱపడి బాధించడుగదా
యని తన జాతకలక్షణము దలచికొనుచు ధైర్యము
దెచ్చికొని నలుదిక్కుల బరికించి చూచెను.

విశేషార్థము:-

సిద్ధసంకల్పుడైన శ్రీకృష్ణు డట్లు నిర్విఘ్నముగా యోగ
సాధన జేయుచు నూర్ధ్వరేతస్కుడై శ్వాసను హృదయస్థానము
నందలి అనాహతచక్రమున జేర్చి చిత్తశాంతినొందుచు ధార
ణాయోగ మతిక్రమించుచుండగా నంతలో నొక చిత్రమైన
"ర్రీజ్" కార శబ్దమొకటి విని మిక్కిలి శ్రద్ధతో ఆధ్వనియందు
బుద్ధిని దీవ్రముగా బ్రవేశపెట్టి సంయమన మొనరించెను.

83. తా॥ అట్లు జాగరూకుడై యాయడవిలోని చిన్నచిన్న
యెండుటాకుల చప్పుళ్లను, కిచకిచమను పిట్టలయొక్క
కూతలను, టంటం అని దొర్లుచుండెడి రాతిబండ
లయొక్క శబ్దములను, వెదురుచెట్లు మొదలైనవాటి
యొక్కయొరపిడిధ్వనులను, నలుగడలబరుగులెత్తు జిం
కలు లేళ్లు మొదలగు జంతువులయొక్క గిట్టలచప్పు
ళ్లను, ఆకసమును గప్పియున్న మేఘముల యొక్క
గర్జలను, నాలకించి, విమర్శించికొనుచు, సావధానుడై

యా యరణ్యసీమయందు దనకు వినిపించుచున్న "రీజ్" కారము దద్వాయువుయొక్క ప్రకృతిసిద్ధ మగు ఝంకారమేగదా యని బుద్ధితో సమాధానపడి మనస్సుగుదుర్చుకొని భయరహితుడయ్యెను.

విశేషార్థము:.

శ్రీకృష్ణుడట్లనాహతచక్రమునుండి స్ఫురించిన "రీజ్" కారముపై సంయమనము సేసి, క్రమముగా ద దంతర్భాగమైన "చిణీ" నాదమును, "చిణి-చిణీ" నాదమును, ఘంటారవమును, శంఖనినాదమును, వీణానాదమును, తాళధ్వనిని, వేణుస్వరమును, భేరీ నాదమును, మృదంగ శబ్దమును మేఘధ్వనిని, శ్రద్ధాయుక్తుడై విమర్శించికొని, యానంద పరవశుడై, అకార బీజమైన ఆసమష్టి నాదమునందు, ఉకారంసజ్ఞనొప్పు బుద్ధీంద్రియమును జొనిపి, తత్పర్యవసానముగా నొదవిన "మ్" అను వాచ్యార్థమునందు లక్ష్యము సేసి, సప్తకోటి మహామంత్రములకు మూలమైన యా "ఓం" కార బీజమును దనహృదయకర్ణికయందు సంశయరహితుడై ఆరాధించెను.

## వివరణ:-

84 లక్షల జీవరాసులందు "నేను—నే" నను అహంకారభావము సమానముగానేయున్నది. ఈ "నే" నను నప్పుడాభావము పాదములందుగాని, శిరస్సునందుగాని కలుగక హృద

యమునందే తెలియవచ్చుటచేత "నే" నని యచ్చోటనే చూచికొనుచున్నాము. మఱియు ముక్కురంధ్రములద్వారా నడచుచుండెడిశ్వాస, లోనికిబోవునపుడు "సో" అనియు, వెలుపలికి వచ్చునప్పుడు "హం" అనియు ధ్వనించుచున్నది. అట్టి "సోహం" అను పదను "సః + అహం" అను మాత్రల చేగూడికొనియుండి "సః" అను సత్తామాత్రస్వరూపమైన పరబ్రహ్మమునందు, "అహం" అను జీవాత్మను హృదయకమలమునుండి కలుపుచున్నది. అంతేగాక యీ "సోహం" అజపా గాయత్రీమంత్రవిశేషముచేతనే, పశుపక్ష్యాదులైజీవులుగూడా క్రమముగా నుచ్చజన్మలకు వచ్చుచు, తుదకు మానవజన్మ మెత్తగలుగుచున్నవని కూడా చెప్పబడియున్నది. అట్టి "సోహం" అను హంసగాయత్రియందలి హల్లులైన "స—హ" లను గొట్టివేసిన, "ఓం" అను అచ్చులతోగూడిన యేకాక్షరప్రణవము నిలచుచున్నది. ఆ "ఓం" అను అక్షరమును విడదీసిన "అ" "ఉ" "మ్"అను మూడుమాత్రలు గన్పడుచున్నవి. "అ" యని పలికినప్పుడాధ్వని బొడ్డువద్దనుండి పుట్టి హృదయములోనుండి మీదికెగసి కుత్తుకవఱకు వ్యాపించుచున్నది. "ఉ" యను మాత్రయొక్కధ్వని కుత్తుకలోనుండి పుట్టి నాలుకకొనవరకు వచ్చుచునది. "మ్" అను అనుస్వరము నోటికి వెలుపలగా పుట్టుచు, దీర్ఘముగా నెంత పొడవుగానైనను బోవుచున్నది. అట్టీ మూడుమాత్రలుగలిసినచో "ఓం" అను అక్షరమన్నిరకములైన ధ్వనులు (లేక) అక్షరములకు మూలమై మాతృరూపముగానున్నది ఈప్రణవశబ్దమునకు జాతిమతభాషాభేదములును, స్త్రీపురుషలింగభేద

ములును లేక సమస్తప్రాణులయందును సమానముగానే తెలియబడుచు "ఏకోపరబ్రహ్మ" త్వము నిర్దేశించుచున్నది. అంతేకాక వ్యక్తికి నెక్కుడు సంతోషము గలిగినప్పుడు, యెక్కువ దుఃఖము వచ్చినప్పుడు, "ఓ"—"హా" యను భిన్నధ్వనులలో జీవునిప్రాణము విలీనమై శాంతిబొందుచున్నది. మఱియు, రోగియైనవాడుగూడా "ఊఁ"యను భిన్నస్వరముతో మూల్గుచు ఆ "ఓం" కారమునందు శాంతిననుభవించుచున్నాడు. అట్టి మూర్తిత్రయరూపమైన "ఓం" కారమే శబ్దబ్రహ్మమై వేదములకుగూడా యందక, వేదాంతమనబడుచున్నది. అట్టి శబ్దాతీతమైన ఓంకారబ్రహ్మమే సత్ = శాశ్వతము, చిత్ = చైతన్యము, ఆనందము = సుఖము అను లక్షణముల మిశ్రమస్వరూపములో సకలజీవులయందున నిలిచియున్నది. కావుననే యెఱుకచెడినజీవాత్మ యింద్రియములద్వారా సుఖాన్వేషణకై బాహ్యవిషయవాసనలందు పరివర్తనజేయుచు నెచ్చోటను నిత్యానందముగానక తపించుచు కర్మాభిమానములో సంసారచక్రమునందు జన్మలెత్తుచున్నాడు. అట్టియింద్రజాలరూపమైన విశ్వమునకంతటికి, నవ్యక్తస్వరూపమైన ఆ ఓంకారపరబ్రహ్మమే సృష్టిస్థితిలయములకు గారణమై కర్మయోగప్రవృత్తిగల ప్రకృతితత్వములో ధర్మసూక్ష్మముగా వ్యాపించి, యీ క్రియాప్రపంచములో "సత్" గా నిలిచి "సత్కర్మ"యని నిర్వచింపబడుచు సర్వకాలసర్వావస్థలందను సాక్షిస్వరూపమై నిత్యముగా వెలయుచున్నది.

34 తా॥ ఐనను దాను భ్రమచే బొరపడిన బోయవాండ్రే యైనచో మోసమువాటిల్లునని తలచి యుపేక్షింపక,

ఆధ్వనిని నానావిధములఁ నాలకించి పరీక్షించి యను
మానరహితుఁడై ఆయరణ్యమునందలి సకలచరాచర
జంతుజాలములలో దాను దప్ప యితరుల నెవ్వరిని
గానక నిశ్చింతతో దన శరీరశ్రమయంతయు బూరి
గాబాసిపోవునట్లు గాఢ నిద్ర జెంది మహాసుఖము
నొందెను.

విశేషార్థము:-

అట్లు సచ్చిదానందస్వరూపమగు ఆత్మసాక్షాత్కార
ము బొందిజీవన్ముక్తుడయ్యు దీక్షవిడువక విదేహముక్తినిగూడ
ననుభవింపగోరిన వాడై శ్రీకృష్ణుడాయఖండపరిపూర్ణపర
బ్రహ్మమునే నాక్షర ప్రణవ బీజములో ధ్యానించుచు
నానావిధయుక్తిభేదములైన ప్రత్యక్షానుమానాగమప్రమాణ
విధుల మననము సేయుచు, తన ఆత్మవంటి ఆత్మయే సకలజీవ
రాసులయందు నున్నదని సమాధానము బొందినవాడై, త
ల్లక్ష్యమైన కేవలనిర్వికల్పసమాధి నధిగమించి, స్థితప్రజ్ఞుడై
విశ్వాతీతుడగు ఆయఖండపరిపూర్ణ సచ్చిదానందమయపర
బ్రహ్మమునందు లయసిద్ధినిగూడ ననుభవించి ఆయోగేశ్వరు
డైన గోపాలకృష్ణుడు యోగీశ్వరుడయ్యెను.

## వివరణ:-

యోగసాధనకు మొదట యమనియమముల నలవరిం
చికొని, తరువాత చిత్తవృత్తినిరోధకమైన సాధన మేదైనా

యభ్యసింపవలెను. ఈప్రయత్నమే యజ్ఞమున బరగి "యజ్ఞానాం జపయజ్ఞోస్మి" యన్నట్లు హింసాపూర్వకమైన యజ్ఞములకంటె జపయజ్ఞమే శ్రేష్ఠమైయున్నది. అట్లు వ్యవసాయము సేయగా క్రమేణ మనస్సు పరిపరివిధముల సంకల్పించుటలుమాని చిత్తము నిర్మలమగుచున్నది. అట్లు చిత్తశుద్ధి కలిగిన మీదట నిష్కల్మషమైన అద్దమునందలి బింబమువలె బరమాత్మని ప్రతిబింబమైన ఆత్మ ప్రత్యక్షముగా బుద్ధీంద్రియమునకు దర్శనమిచ్చుచున్నది. ఈస్థితికే "జీవన్ముక్తి" యని పేరు.

జీవన్ముక్తితో వ్యక్తి మోక్షాధికారి యగుచున్నాడు; కాని ప్రారబ్ధ మనునది పూర్తిగా నశించలేదు గనుక, ఆ యోగియొక్క జీవాత్మ హృదయకమలములోనుండి బైటకు దుమికిరాజాలదు. కావున ప్రారబ్ధమనుభవించుదనుక నంతఃకరణమునందే నణగియుండి, యవసానకాలమున గర్మరహితమయ్యెను గనుక బరమాత్మలో గలిసి పుట్టుటయే లేని మోక్షమొందుచున్నాడు. ఈ యోగ మెక్కుడు చిత్తశుద్ధిగల యధికారునకు ఆరుమాసములలోను, మధ్యస్థునకు ఒక్క సంవత్సరపరిమితిలోను, మూఢహృదయునకు బన్రెండు వర్షములలోను సిద్ధినొసగుచున్నదని శృతి ప్రమాణము.

అట్లు ఆపరమాత్మలో ఈ దేహమునందుండియే కలసిన "విదేహముక్తి" యనబడుచున్నది. దీనికి వేఱేయోగసాధనలు లేవు. జీవన్ముక్తుడాపరబ్రహ్మవృత్తిననుసంధానముసేసికొని తైలధారవలె ప్రణవధ్యానముసేయుచున హృరాత్రములునిమగ్నుఁ

డే గావలయును. అట్టి పరాభక్తికి మెచ్చికొని ఆ పర
బ్రహ్మమే యావిశ్వరూపము గటాక్షించుచున్నది. అట్టి నిర్వి
కల్పసమాధిసిద్ధికి దేశకాలపాత్రాన్యాయములులేక నడచు
చుండినను, మాటలాడుచుండినను గూడా అకస్మాత్తుగ
లభించుచున్నది. అట్టి అమనస్కయోగసిద్ధిని గాంచిన
వుడు తిరిగి ఆజీవన్ముక్తుని శరీరములోనికి మఱలివచ్చుటకు
దుర్ఘటము. తన ఆత్మయను జ్యోతి ఆపరంజ్యోతిలోగ
సముద్రములోబడిన ఉప్పుకల్లువలె అపరూపమే యగుచున్నది.
కాని యొక్కొక్కప్పుడాపరబ్రహ్మమే తన్నుదెలిసిన ఆ వి
దేహముక్తుని లోకోద్ధరణమునకై మఱలబ్రతికించుచున్నాడు.
కావున అట్టి నిర్వికల్పసమాధిలో నిర్జీవమైన జీవన్ముక్తుని కళే
బరము నిరువదొకదినములవరకు శిష్యులు గాపాడుకొనవలసి
యున్నది. అట్లా కాలములో ఆ దేహమునకు చైతన్యము గలు
గకపోయిన సంస్కారము నడపవచ్చునని శృతివచనము.
అది యట్టిది గావున, సాధకుడు జీవన్ముక్తి నొందిన తరువాత
వెంటనే విదేహముక్తికి బ్రయత్నించుటయు ప్రమాదకరమని
యెఱింగి, కేవలము స్వాభిలాషి కాక వేదాంతజ్ఞానమును ప్ర
చారముచేసి లోకములోని యజ్ఞానవారాయణుల నుద్ధరిం
చి, తద్వనరితరమే నిర్వికల్పసమాధికై యత్నింపవలయునని
యుశృతులు నిర్దేశించుచున్నవి. అప్పుడాజీవన్ముక్తుని కానిర్వి
కల్పసమాధి సిద్ధించినను, లేక యంతలో నవసానవేళ ప్రా
ప్తించినను, అనుభవ భేదమే గాని, మోక్షమునే పొందు

చున్నాడు గనుక పునర్జన్మము గలుగదు. కాని విదేహముక్తి గూడా నీభౌతికదేహములోనే సాధింపవలె. ననిన అది కోటి జీవన్ముక్తులలో నొకానొకనికే గాని సిద్ధించుటలేదని శ్రీభగవానువాచ:

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః॥

అనగా వేలకొలది గానుండిన సాధకులలో, నే యొకని కో జీవన్ముక్తి సిద్ధించుచుండగా, అటువంటి వేలకొలది సిద్ధులలోగూడా, నెవ్వడో యొక్కడే నన్ను సంపూర్ణముగా దెలిసికొన గలిగిన విదేహముక్తి సాధించి యనుభవింపగలుగు చున్నాడు సుమా!

85. తా॥ ఆజన్మజ్ఞానియైన శ్రీకృష్ణు డట్లు దృఢవ్రతుడై షణ్మాసప్రమాణమున జ్ఞానానందమహాత్స్వరూపమును, అవ్యక్తపరబ్రహ్మము నైన ఓంకారమునందట్టి స్వానుభవసిద్ధిగాంచి, ఆవిధముగా అహంకారమును దీసి వైచిన ప్రతిమానవుడును బ్రణవస్వరూపుడగుచున్నాడని సార్థకపఱచుటకుగాను, లోపలనున్న మలమంతయు దీసివేయబడి డొల్లగానుండిన వెదురుగొట్టమును పిల్లంగ్రోవిని తన విజ్ఞాన చిహ్నముగా స్వీకరించి ధరించెను.

86. తా॥ అట్లొకనాటిరాత్రి తెల్లవాఱురఝామున ఆబృందారణ్యమునందు బ్రణవధ్యాననిష్ఠాగరిష్ఠుడై తనివి సనక

తన్నిష్ప్రపత్తికి బాతాంతరముగ వేణువును గ్రహించి, గానలోలుడై, యొకగీతముతో నాగస్వరము నాలాపనజేయుచు నావేశపూరితుడయ్యెను.

87. తా॥ అట్లు విశ్వమంతట వ్యాపించి నిండుచుండిన ఆమురళియొక్క ప్రణవనాదమునకు నొకవైపున దనశరీరమునందలి 72,000నాడులు లయమగుచుండగా, రెండవైపున బాహ్యప్రపంచములో నాలమందలు మోరలెత్తి వినుచు దన్మయ మొందునట్లుగాను; ఇటు తనదేహమునందలి పంచప్రాణము లను ముఖ్యవాయువుల్లు విలీనమై తనకు వశ్యమగుచుండగా, అటుబాహ్యసృష్టిలో త్రాచుపాములు లేచి పడగలువిప్పి పరవశమొందునట్లుగాను; తన బ్రహ్మనాడియందలి షట్చక్రములు శ్వాసకు సులభమార్గములగుచుండగా, బాహ్యమున ప్రాతఃకాలముతో బాటు ప్రకృతియందలి పద్మములు చక్కగా వికసించునట్లుగాను; తనయొక్క స్థూలసూక్ష్మకారణోపాధిత్రియము సడలి బ్రహ్మానందమయమగుచుండగా, ఆచతుర్యామమున బ్రకృతిగల జీవకోటులు లాలింపబడి, మైమఱచి, గాఢనిద్రయను సుఖ మనుభవించుచుండినట్లుగాను; దన కుడిరెండవ హస్తములందా జీవమాత్రుడైన బాలకృష్ణుడు మురళినిధరించి; ఆబృందావనమునందు గానము సేయు

దొడగగా, సాక్షాత్తుగా ఆసర్వేశ్వరుడే హృదయ గోళమునందాయిడాపింగళానాడులమధ్యనున్న ఆసుషుమ్నా నాళమును ధరించి, నాదానుసంధానము సేయుచుండెనా యనునట్లుగా, ఆమురళీనినాదముగేవలము సోహంమంత్రరూపమగు బ్రహ్మనాదమైన ఓం-కారమై బ్రహ్మాండమంతయు నిండి ప్రతిధ్వనించెను.

## వివరణ:-

సిద్ధపురుషుడైన శ్రీకృష్ణభగవానుడు ప్రాకృతముగా వేణుగానము సేయునప్పుడు గూడా తన యోగకౌశల్యముతో శుద్ధమైన ఓంకారనాదమునే ప్రవర్తింపజేయగలుగగా నది యంతర్బహిర్వ్యాప్తముగా ప్రసరించి యొకవైపు యోగసిద్ధి నొందిన ఆబాలకృష్ణుని వ్యష్టిరూపమును రెండవవైపు సమష్టి రూపమైన యావత్ప్రపంచమును నిర్మలమగు నానందమహా సముద్రమున నోలలాడించెను.

88. తా॥ అట్లు తొమ్మిదిరంధ్రములతో చేయబడిన యా వెదురుగొట్టము, చాకచక్యముగల యెనిమిది వ్రేళ్లచే, నెడతెగకుండా నాదింపబడుచు, వాయువుతో పూరింపబడగా ఆ గానరసము దశదిశలందు దట్టమ్ముగా వ్యాపించెను.

విశేషార్థము:-

అట్లు నవద్వారములుగలిగిన ఆగోపాలదేవుని శరీరము మహనీయమైన యష్టసిద్ధులతో జాజ్వల్యమానమై శ్వాస

పర్యటనచేత నుద్ఘాటింపబడిన ఆప్రణవనాదము దశవిధనాదములతో భూనభోంతరాళములు నిండునట్లుగా ఘూర్ణమానమయ్యెను.

89. తా॥ అట్టి సమయమున నాప్రణవనాదపరంపరలు చెవులబడగానే ఆవ్రేపల్లెవాడలోని గోపవనితలు దపూర్వజన్మజ్ఞాన సంస్మృతిచే నిద్రావస్థనుండి యత్తుగా దెలివివచ్చి కలవరబడుచు,—

90. తా॥ ఆయపూర్వనాద మిదివఱ కెప్పుడో వినియటేమి సుమా యని యాందోళనబడి పూర్వజన్మ సంస్కారబలముచే నయ్యది స్మృతికిరాగా, అమ్మహానీయమైన ఓంకారనాదమును గుర్తించి, తత్క్షణమే దేహవాసనల నొక్కట విసర్జించి, తేనెవాసనల కెదురుగా బరుగులిడు తేనెటీగల చందమున, ఆమురళీగాన ప్రవాహమున కెదురీదునట్టి వారలై,—

91. తా॥ తమతమ స్వగృహములనుండి వెడలి నిజభర్తలనుగుఱించిగాని తదితర సంసారవిషయములనుగుఱించిగాని తలంపనేరక, తమ చిత్తశుద్ధి విశేషములో బృందారణ్యమునందలి వ్యత్యస్తపాదారవిందుడైన వేణుగానలోలుని నిజమనోవీధియందు బొడగని, సంభ్రమాశ్చర్యములు మురిపిరిగొనగా, నెదుట దోచుచుండిన ఆగోపాలదేవు నాతురపడి తమ రెండు గరములతో

నందుకొనబోయిన ట్లాహ్వానించుచు "కృష్ణా! కృష్ణా!" యను కేకలతో నా రాత్రియామునందా గోపికలు గొప్పులు ముడివీడగా నాయరణ్యమార్గములబట్టి-పరుగులెత్తి జనిరి.

92. తా॥ ఆ ట్లామురళీవినోదుని డాసి, యాగోపకాంతలు సాక్షాత్ భగవంతుడని తెలిసికొనిన వారై నందున, భయభక్తివినమ్రులై స్తోత్రములొనర్చి, తమ కా అద్వైతానుసంధానయోగప్రాప్తి దయజేసి కర్మరహితలను గావించి రక్షింపవలసినదని ప్రార్థించిరి.

93-94. తా॥ అప్పు డాజగదోద్ధారకుడగు శ్రీకృష్ణభగవానుడును ప్రసన్నుడై వారలకు బరమాత్మసందర్శనముగలిగింప నిచ్ఛగించి, పదునాల్గు భువనములకు మంగళప్రదమైన తన కుడిచేయి చాచి హస్తమస్తకసంయోగ మొనరించెను,—

95. తా॥ ఆకరస్పర్శతో వెంటనే సమస్త సంచితకర్మములు నశించినవారలై ఆమానవతుల తికష్టతరమైన నిర్వికల్పసమాధిని సునాయాసముగా నొక్కక్షణములోనే సాధింపగలిగి ఆ యఖండ పరిపూర్ణ నిరాకార పరబ్రహ్మసాక్షాత్కారము నొందిరి.

**వివరణ:-**

మానవశరీరమునందు 72,000 నాడులు గలవు. ఈ నాడులన్నియు వేలా వేలు దేవతాశక్తులుగా బరిగణింపబడి ఆ యా నాడీప్రసారములయొక్క ధ్వనులను బీజమంత్రములతో నారాధింపగా ద లక్షితమైన నాడీప్రకోపము సిద్ధించు చున్నది. ఈమంత్రాక్షరములకు స్వరమే ప్రధానమై, యా నాడీస్వరముతో దన మంత్రోచ్చాటనాధ్వని యేకీభవించినతోడనే ఆనాడిలో నుష్ణముగలిగి దానిని గదలింపగా జ్యోతిర్కళలు గూడా బుట్టుచున్నవి. కావున నీమంత్రాక్షరముల నెగుడుదిగుడుగా గాని, భాషాంతరీకరణముగాని చేయగూడదు. అట్లొనర్చిన యవి ఫలమునీయవు. ఆవిధముగా హృదయస్థానమునుండి కపాలమువరకు వ్యాపించియున్న యొకానొకనాడి అమృతనాడి యనబరగుచు ప్రణవారాధనతోడి గురుకటాక్షమువల్లనే తెలియబడి సంకల్పరహితమైన కేవలామనస్కయోగసిద్ధి బ్రసాదించుచు గపాలమోక్షలక్షణమైన విదేహముక్తి నొసగుచున్నది. కావున, అట్టిహృదయగ్రంథిని హస్తమస్తకసంయోగవిధానముతో నకస్మాత్తుగా సడలింప జేసియు దజ్జీవాత్మల స్థితప్రజ్ఞులుగా నిలువరించుట కాయాచర్యవరుడు సాక్షాత్ శ్రీకృష్ణభగవానుడు గ్రీస్తుదేవులవలె గేవల మవతారపురుషుడు గావలయునే కాని, యితర సిద్ధపురుషులవల్లనూ గాదు. కాని గురుదేవుడైనవా డామార్గము నెఱిగికొని యున్నవాడు గావున నిజశిష్యు నవశ్యము కృతార్థుని జేయగలుగుచున్నాడు. అంతే కాక అట్టిసద్గురునికటాక్షములేనిదే ఆమోక్షకవాట మెఱిగికొనుటయే సాధ్యము గాదని శ్రుతులు సెప్పుచున్నవి.

96 తా॥ అట్లు కేవలము సత్యమైనదియు, పుణ్య పురుషుల చేత గొనియాడబడునదియు, శృతిస్మృతేతిహాసములకు రహస్యమైనదియు, సత్త్వగుణప్రధానమైన ఆత్మనిష్ఠలో దర్శన మిచ్చునదియు, దేదీప్యమానమైనదియు, అవ్యక్తమైనదియు, ఆదియంతములులేని యఖండస్వరూప మైనట్టిదానిని,—

97. తా॥ సగుణము నిర్గుణ మను రెండునై యొప్పునదియు, శుద్ధసత్వరూపమైనదియు, జరారహితమైనదియు, నాశము లేనిదియు, తెగగొట్టబడనిదియు, కదలిక లేనిదియు మాలిన్యదోషము లేనిదియు, గోప్యమైనదియు, చైతన్యరూపమైనదియు, నిత్యమైనదియు, నంగుష్ఠప్రమాణమైనదియు, బ్రహ్మనందస్వరూపమైనదియు, సర్వవ్యాపియు, సర్వాంతరాత్మయు నైయున్న ఆదిపురుషుని,—

98. తా॥ బుద్ధికి నగమ్యమైన యవ్యక్తపరబ్రహ్మతత్త్వమును దమ హృదయాకాశమునందు జ్ఞాననేత్రముతో సువ్యక్తముగా సందర్శించి దివ్యమహిమ నొందినవారలై యా గోపిక లావిశ్వాత్ము నిట్లని స్తుతించిరి.

**వివరణ:-**

అసలు మానసిక ప్రపత్తిలో నేదైనా యొకవస్తువు నూహించుటకు దా నావస్తువు నొకప్పుడు గనియైన వినియైన యుండవలెను. ఎట్లనగా "ఆవు" యని చెప్పగానే,

మనస్సునకొకయావుయాకారము బొడగట్టి,తద్వారా తక్కిన విషయము గ్రాహ్యమగుచున్నది. అట్లదివర కేయావును దాను జూచియుండని పక్షమున, దా జూచియున్న వేఱొక జంతువుతోనైనా పోల్చిచెప్పవలసివచ్చుచున్నది. అటువలెనే పరబ్రహ్మస్వరూపము సూచి మొనగనంత వఱకు నిట్టిది యని నిర్దేశింప వీలుగాకున్నది. అందుననుఅవ్యక్త పరబ్రహ్మ మనలే గ్రాహ్యమనుగాజాలదు. అంతేగాక,యధాస్థితిలో జీవాత్మయు బరమాత్మస్వరూపమే గావున, దన మొగము దాను జూచుటకు వీలుగాదను న్యాయప్రకారమున, బరమాత్మస్వరూపము ముఖాముఖిగా దెలియ వీలులేకున్నదని శృతులుసెప్పుచున్నవి. ఐనను సమాధియం దాపరమాత్మదర్శనము బ్రత్యక్షముగా ననుభవవేద్యమే యగుచున్నదనియు శృతివాక్యము. కావున ఆపరబ్రహ్మస్వరూప మెట్లుండునా యని తర్కించిన మన కనుభవస్థితిలో గాఢనిద్రావస్థ కావలగా బోల్చుకొనవలసియున్నది. ఆనిద్రావస్థయు దమోగుణప్రధానమేమైయున్నప్పటికి, అది యవ్యక్తాత్మికస్థితిలోని చిట్టచివరి దశగా నుండి, వ్యక్తసృష్టికి మొదటి మెట్టగుచు దశేంద్రియములతోగూడిన మనస్సు ననుదినము లయమొనరించి పునరుద్ధారణ జేయుచున్నది. కాన దాని కాశ్రయమగు శుద్ధసత్వప్రధానమైన నిర్వికల్పసమాధిస్వరూప మగు అవ్యక్త పరబ్రహ్మలక్షణమును ద దంతర్గతముగా నూహించికొనవలసియున్నది.

99. తా॥ హే జగదీశ్వరా! నీ వీసమస్తమైన స్థావర జంగమ

ప్రాణికోటులందు సూత్రధారివై కర్తృత్వ భోక్తృత్వ ములు లేక సాక్షిమాత్రుడవయ్యు, సర్వాధారుడవై యుండి, మా పశువులు, యాదవులు, నందయశోదా దులు, మా బంధువులు, మేమునుగూడా సర్వము నీవే యగుచు నీవు గాసివస్తువే యీ విశ్వములో లే దని యిప్పు డనుభవసిద్ధమైన యీవిజ్ఞానము మఱల మాకు జన్మజన్మసి మఱపుగలుగకుండునట్లుగా స్థితప్రజ్ఞురాం డ్రను జేసి మమ్మనుగ్రహింపుమో యచ్యుతా! అనంత! హరి! పరమాత్మ! కృష్ణా! యని వేడుకొనిరి.

100. తా॥ ఓ యశోదాకుమారా! నీవు కేవలము మానవమా త్రుడవుగాక నిక్కమముగా నీ భూతకోటికెల్ల నాశ్ర యుడవైన ఆహిరణ్యగర్భుడగు పరబ్రహ్మవే సుమా! అట్టి నీవుభూభారముదొలగింపగా నవసరపడి యిట్లు లీలామానుషవిగ్రహుడవై యవతరించిన పురాణపురు షుడవే గదా!

101. తా॥ అని పరమానందముతో బ్రదక్షిణపూర్వకసా ష్టాంగదండప్రణామాదుల నాచరించి ఆగోవిందుని అనంతనామగుణముల గీర్తన జేయుచు నుతించిరి.

102. తా॥ అట్లు బాలకృష్ణు ననేక విధములుగా స్తుతించి ఆగోపాల దేవుని విజ్ఞానమయమగు మాయామానుషవి గ్రహమునందు జూపులు నిలిపి ఆరాధించుచు—

103. తా॥ భక్తిపరవశలై యత్యధికమైన యనురాగమును జెంది యాగోపిక లాప్రత్యక్షపరబ్రహ్మమైన బాలకృ

ష్ణుని నెత్తికొని, ముద్దుగొని, కౌగిటనిడికొని, భక్తి వివశాత్మలై బ్రహ్మానందమునొందిరి.

104. తా॥ అంతియుకాక తా మా యశోదాకుమారుని దివ్య విగ్రహముపై జిరకాలమునుండి స్నేహభావము గలిగి యుండినందున, నిరాకారమైన ఆయఖండనిర్గుణపర బ్రహ్మైక్యానుభవము నొల్లక కేవలభక్తిప్రధానలై, ఆ అవ్యక్తపరబ్రహ్మమే యీ బాలకృష్ణుడై యవతరించెనని సిద్ధాంతీకరించికొని సగుణోపాసనయందే నిలిచి యారాధింపదొడగిరి.

వివరణ:-

కేవలాద్వైత సమాధియందు జీవాత్మ పరమాత్మయను ద్వంద్వభావము నశించి సముద్రమునందుబడిన యుప్పుకల్లు వలె నపరూపమగుచున్నది. అట్టి స్థితియందు మనస్సు గాఢ నిద్రలోనుండునట్లు లయమైపోవుటచేత బుద్ధికిగూడా నయోమయముగానేయుండి,ఆసమాధినిష్ఠనుండి మెలకువవచ్చువరకు నేమియు దెలియక తరువాతనే తాను ఆనిష్ఠలో అట్టిసుఖము నొందితినిగదా యని యెఱిగికొనగలుగుచున్నాడు. సగుణోపాసనమన్ననో యట్లుగాక, తాను వేఱు, తేనె వేఱుగా నుంటూ, తానా మధుపానము సేయునప్పు డుండునట్లుగా ననుభవవేద్యమైన హృదయాహ్లాదమును బొందుచున్నాడు. ఆయానందానుభవము దానాతేనెలో గరగిపోయినచో బ్రాప్తించుట లేదుగదా! కావుననే ప్రహ్లాదనారదాది నిత్యసిద్ధులు

గూడా తాము భగవద్భక్తి విశేషముతో నాజన్మజ్ఞానులై యె న్నిమారులైనను బుట్టుదుమనుచు భక్తిప్రసాదమునే వేడుకొనిరి కాని కించిత్ గర్భనరకమును గుఱించి యీ మాయాసంసారచక్రమునకు భయపడి జన్మరహితమైన మోక్షము నాసించి యుండలేదు.

105. తా॥ అట్లు సగుణబహిర్హృదారాధనాసక్తులై యాగోపికలా బాలకృష్ణుని షోడశోపచారముల నిత్యము నర్చించి సేవింప దొడగిరి.

106. తా॥ ఓ నల్లని పిల్లవాడా యిటు రా! యని హాస్యమాడుచు వానమబ్బులవంటి కొప్పుగల యొకపొలతి యానందనందనుని స్నానము సేయించగా, వేఱొక సన్నని నడుము గల తన్వి ఓ గొప్పమగవాడా! యని మందహాసము సేయుచు వాని మొలకు బీతాంబరమును జుట్టును. ఓ గుట్టలెత్తెడివాడా! యని వెన్నముద్దలవంటి వక్షస్థలముగల యొకవెలది వెన్న దెచ్చి నైవేద్యము బెట్టగా, మంచికస్తూరివంటి శరీరవాసనగల వేఱొక చేడియ మాధవా! యని చేరదీసి దేహమునకు జందనము బూయును. చిగురుటాకువంటి యధరముగల నొకకన్నియ ప్రేమతో దాంబూలము నందించగా, పుష్పమాలవంటి కోమలమైన దేహముగల యింకొక జవ్వని కంఠమునకు బూలహారము వేయును. రత్నకంకణములు గలిగిన యొకయిల్లాలు మంగళహారతి నిచ్చు

చుండగా, మేటియైన కలకంఠి యొక్క తెయూగుచు
బాటబాడి లాలించి జోకొట్టును.

107. తా॥ ఈప్రకారముగా శ్రీకృష్ణ సేవాతత్పరలై మైమ
మరచియున్న తమ్ముగని మతిభ్రష్టలైరని బంధుజనులు
బెగ్గడిలుచుండగా ఆగోపికలు జాగ్రదావస్థలో నుండి
నపుడు గూడా బాలకు డెవ్వడు దృగ్గోచర మైననూ
ఆనందనందనుడేయని భ్రమించుచు, దుద కా సర్వ
మయుని దివ్యరూపము దమబంధుకోటితో సహా సకల
దేహధారు లందున బ్రత్యక్షముగా దమ మాంస
కన్నులతోనే చూడగలిగిన వారలైరి.

108. తా॥ అట్టి పరమోత్కృష్టమైన పరాభక్తితో
భౌతికప్రపంచ మా కృష్ణదేవము యొక్క దివ
హమయమేయని ప్రత్యక్షముగా జూచి యానం
చుచు, బరమహంసలై, భావముఖసమాధియందు నిలి
సగుణబ్రహ్మమునందే సంచరించిరి.

వివరణ:-

అద్వైతసిద్ధి నొందినప్పటికీ, ఆశ్రీకృష్ణుడుగాని యీ గోపికలుగాని యాద్వాపరయుగాంతమునందే సన్యాసాశ్రమమునుస్వీకరింపలేదు. ఇక నీకలియుగమునందన్ననో, సన్యాసాశ్రమమును నియోగమును, శ్రీశంకరాచార్యులవారిచేబూర్తిగాని వేధింపబడియున్నది. అసలు సన్యాసమనునది బౌద్ధమత సాంప్రదాయముగా బూర్తిగా కర్మసన్యాసమై పోయినది. వేదాంతమునందు జ్ఞానియైనవాడు నిరాటంకముగ భూతసేవ

జేసి లోకోద్ధారణము సేయవలయుననియు, నందులకుగాను
దనకు లంపటలేకుండిన నెక్కుడుస్వేఛ్ఛగా దిరుగుచు జ్ఞాన
బోధ జరుపగలుగుననియు వ్రాక్కువ్వబడియుండినన్నూ, ఆయా
చార్యుడు భార్యాసమేతముగాకూడా నుండవచ్చుననియే
చెప్పబడియున్నది. గావున బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ
సన్యాసాశ్రమప్రకారము జీవన్ముక్తి సాధించి, లోకసేవజేయు
టకే నిర్ణయింపబడియున్నను, బ్రహ్మజ్ఞానియైనవానికే యా
శ్రమధర్మములులేక కర్మఫలత్యాగియగుచు జనకునివలెను శ్రీ
కృష్ణునివలెను రాజ్యభారముగూడా వహింపదగియున్నది.
అంతేగాక, ఉపనిషత్తులందును బెక్కుచోట్ల రాజులే బ్రా
హ్మణులకధ్యాత్మబోధ జేసియుండిరనియు గ్రహింపనగును.
విశేషించి, జీవన్ముక్తి యను సగుణసాక్షాత్కారము సిద్ధించువ
ఱకు మనుజుడాశ్రమధర్మముల ననుసరించి, ఆత్మానుభవము
దొరికినమీదట త్యాగియగుచు ననగా బుద్ధిమాత్రముఁగర్మ
ఫలసన్యాసములో నిలిపికొనియుండి యజ్ఞానములోనుండిన
సంసారుల ననుసరించియే వారి నుద్ధరింపవలసియున్నది. తుద
కవసానకాలమెఱిగికొని నిర్వికల్పసమాధికొఱకు బ్రయత్నింప
వలయును. ఏలననగా దా నీయజ్ఞాననారాయణుల ప్రబోధిం
పకయే (సగుణసాక్షాత్కారముతో దృప్తినొందక) నిర్గుణస
మాధిలో బ్రవేశించిన దత్క్షణమే తన జీవాత్మ పరమాత్మలో
బూర్తిగా గలిసిపోయి తనకళేబరము సంస్కారయోగ్యమగు
చున్నది. అట్లు కేవలము స్వలాభియైనను మోక్షదూరుడై
నరకమునే పొందుచున్నాడనియు శ్రుతులు చెప్పుచున్నవి.

కనుక ప్రతిమానవునికి "బ్రహ్మం చరంతి బ్రహ్మచర్యంతి" అనునట్లు వేదాధ్యయనలక్షణమైన బ్రహ్మచర్యాశ్రమమనబడు 12 వర్షముల మాత్రకాలముతోడి కౌమారావస్థ గడచిన మీదట గృహస్థాశ్రమ వ్యవహారియై పండ్రెండు సంవత్సరముల మాత్రకాలము సంసారధర్మ మవలంబించి, పిదప వానప్రస్థాశ్రమ లక్షణమైన పండ్రెండు వర్షముల యస్ఖలితబ్రహ్మచర్యదీక్షతో దపోనిష్ఠబొందుచు భార్యాసమేతముగానే నడపికొని యోగసిద్ధినొందుచు ధర్మార్థకామ మోక్షము లనుచతుర్విధ పురుషార్థములను సాధింపవలసియున్నది. అట్లు జీవన్ముక్తువాడు సన్యాసాశ్రమము బ్రవేశించి వేదాంతతత్త్వప్రచారమును ముగించికొని కృతకృత్యుడై పిమ్మట నిర్వికల్పసమాధి ప్రయత్నించి విదేహముక్తినొందుచున్నాడు. కావున సన్యాసమనుదానికి గర్మసన్యాసమని పూర్వాచారము లేదు. సన్యాసాశ్రమమనగా కర్మఫలసన్యాసియై అనగా త్యాగియై భూపర్యటనచేసి జ్ఞానబోధచేయుచు తరువాత నిర్వికల్పసమాధి కధికారి కావలసియుండుటచేత ముఖ్యముగా భక్తియుగలిగియుండవలసియున్నది. అనగా కేవలకర్మఫలత్యాగముతోడి భక్తి లక్షణమే సన్యాసాశ్రమధర్మమై యుండెను. కాని బౌద్ధమతము ప్రచారమైన తరువాత సన్యాసమనగా బూర్తిగా గర్మనే సన్యసించుట యను నర్థవాదము బైలుదేరి సాధకునికి బ్రారంభదశనుండియు సన్యాసదీక్ష నిచ్చుచుండిరి. అందుచేతనే, శ్రీశంకరాచార్యులవారు అవతరించి, కలియుగమున సన్యాసము నిషేధముగాజేసి, వేదాంతధర్మమును సంస్కరింపవలసివచ్చెను.

109. తా॥ అట్లు దమ తమ కుటుంబములందుండియే మహా త్యాగినులై సగుణబ్రహ్మారాధన మాచరించుచు ఆ ద్రేవత లనుదినము రాత్రియామముల శ్రీకృష్ణు డేయరణ్య మధ్యమునుండి వేణుగానము సేసినను, దత్క్షణ మా దేవ దేవుని జేరంజని ఆప్రణవనాదామృత రసాస్వాదనమున బ్రపంచమే మఱచి పోవు చుండిరి.

110-111. తా॥ అట్టి సందర్భములలో బామరులైననిజభర్తలు గాముకులై తమ్మరసికొనుచు వెళ్లి మన్మథ కేళీరతు లగుచుండిననూ, తత్క్రియా పరతను పరమహంసలైన ఆగోపికలు పసిపాపలవలె గుర్తింపలేకయే, శ్రీకృ ష్ణుడే సన్నిహితుడాయెనను నిధిధ్యాసతో సంకల్పశూ న్యలై పరిభ్రమించుచు, ఆప్రణవామృతపానము చే జాక్కి లయము బొందినవారలైరి.

112. తా॥ అట్లు దమపతులు తిరిగి యిండ్లకేగగా, నంతలో దమ మనస్సులుగూడా క్రింది మెట్టునకుదిగి యింద్రియ స్పృహ కలిగినవారలై తమ కదివఱకు సన్నిహితమై నట్లుగా దోచిన ఆ శ్రీకృష్ణస్వరూప మప్పుడు దాపున గనుపింపమి దపించుచు, కృష్ణాన్వేషలై యరణ్యమంత యు గాలించుచు నొకరి నొకరుగా గృష్ణుడేయని భ్రమించుచు దిరిగి తిరిగి తుదకాపొన్నవృక్షము యొద్ద నెప్పటివలె బద్మాసనాసీనుడై వేణుగానము సేయు చుండెడి ఆ గోపాలబాలునిజూచి చిత్తశాంతి బొందు చుండిరి.

113. తా॥ ఆవిధముగా జగన్నాటక సూత్రధారుడును ఆస్ఖలితబ్రహ్మచారియునైన శ్రీకృష్ణకుమారుడు దన బాల్యమునందా గోపీజనముతో గూడి వివిధలీలల గ్రీడించుచు లీలామానుషవిగ్రహుడై విహరించెను.

114. తా॥ ఆ శ్రీకృష్ణ నాపదునాఱువేల గోపికాలలామ లర్చించి దాస్యముసేయుచుండగా నాకసమునుండి ఆ నక్షత్రములకు పతియైన చంద్రుడు చూచి యా మహాశోభ కసూయపడుచు క్షోభించి నిలువక వెనుకకు మఱలిపోవుచుండెనా యన్నట్లుగా బ్రతిదినము భల్లున దెల్లవాఱుచు ననేక సుదినములు గడచి చనెను.

115. తా॥ అట్లు నందనందనుడైన శ్రీకృష్ణపరమాత్ముడుదనకు బదునొకండు సంవత్సరముల ప్రాయము వచ్చుదనుక యశోదాకుమారుడై వ్రేపల్లెవాడలో బెరుగుచు ఆ రాధ మొదలైన గోపికాజనము నందఱను గర్భాతీతము రాండ్రనుగా నొనరించి మోక్షాధికారుల జేసి క్రియాకర్తృత్వమును బాచికొనియెను.

116. తా॥ అట్టి మధురానగరనివాసియు, దుష్టజనశిక్షకుడును అవతారపురుషుడును శ్రీమద్భగవద్గీతోపదేశకుడునైన ఆ రుక్మిణీపతియగు శ్రీకృష్ణభగవానుడు నిత్యమంగళస్వరూపుడై యీ చరాచర జంతుజాలములకు సదా శుభమంగళ మొనగూర్చుగాత!!!

## -: గద్యము :-

ఇది శ్రీమద్భరద్వాజసగోత్ర పవిత్ర యెల్లాప్రగడవంశోద్భవ
అత్మమయాఖ్యాతపౌత్ర రామకోటయామాత్యపుత్ర
సీతమాంబికా గర్భ శుక్తి ముక్తాఫలాయమా
నానవరతాద్వైతానందసమ్మిళితచిత్తవశవర్తి
శ్రీ కృష్ణ మూర్తి నామధేయ
విరచితతాత్పర్యవివరణసహిత
నిర్వచనైకాశ్వాస
శ్రీగోపికారహస్యం
బనుగ్రంథంబున
సర్వంబును,
సమాప్తము.



ఓం తత్ సత్..

శ్రీమత్ కృష్ణావతార పరబ్రహ్మణేనమః



తే॥ గీ॥ కపినిగాను, పండితుఁడనుగాను, గానఁ
గావ్యవివరణమున కీవెకర్తవనుచుఁ
తలిపికొంటిని, మన్మనోదృష్టినిలిచి
నన్ను గృతకృత్యుఁ జేయవే నుదతనయ!

శుభమస్తు

# కృతిసమర్పణ

—— :o: ——

"నాకేలా? రణ, మర్జునా! యని ప్రతి
జ్ఞాపాలకుం డౌచు, ను
ద్రేకుండై, నాగలాక్రమించి, విలస
ద్వీష్టాహతారాతినై,
మూకల్ గొందల మొంద ఘోటకములన్
ముప్పోకలందోలు, నా
లోకాతీతున కిత్తునీకృతి మదిన్
రూపించి సద్భక్తితోన్

శ్రీ

సద్గురుభ్యోనమః

## శ్రీవిఘ్నేశ్వర ప్రార్థన

శ్రీ సిద్ధివినాయకునిన్
వ్యాసార్చితషట్ఛతాజపాగాయత్రున్
భాస 'వ-శ-ష-స' దళస్థున్
దాసోహంబనుచు మ్రొక్కెదన్ తొలివేల్పున్॥

## శ్రీసరస్వతీ ప్రార్థన

శ్రీలలితాంగుళీప్రచురరేఖలనొప్పెసలారు తంత్రికా
లోల, విలోలలోచన, సరోజజు ముద్దులగుమ్మ, వాక్సుధా
జాలవిలాసవర్తిని, విశాలజగన్నుతశీల, శారదా
బాలఁ దలంచెదన్మది సుభావపదైక కవిత్వసిద్ధికిన్॥

## సిద్ధపురుషుల ప్రార్థన

వ్యష్టిస్థమైన యాత్మ స
మష్టిని బరమాత్మయై సమస్తజగంబున్
పుష్టింజేయును గావున
సృష్టిపరంపరఁగ ముక్తజీవులఁ గొలుతున్.

శ్రీ

సచ్చిదానంద పరబ్రహ్మణేనమః

## —:భగవత్ప్రార్థన:—

**పార్థా!**

స "ఓం" తదవ్యాకృతమ్మూలప్ర
కృతిఁబొంది జీవుఁడై తతమహాజ్ఞ
నిత లింగదేహ భాసితుఁడై జడాత్మక
మయిన స్థూలాది దేహంబులందు
నెనరొప్ప నేకాదశేంద్రియవ్యసనుఁడై
తన్నెఱుంగక కర్మతంత్రుఁడగుచుఁ
జంచలంబైన సంసారప్రయుక్తిచే
బాల్యాది భౌతికావస్థ లమరి
క్రీడ సలుపుచుఁ దిరిగి స్వకృతసుకర్మ
నప్రతిహతైక వైరాగ్య మలవరించి
కర్మనంటక మెలఁగి సంస్కార మొందు
నని ప్రబోధించు "భగవంతు" నాశ్రయింతు॥

"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశ స శ్శ్రియః
జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇ తీరణా॥

అనఁగా సమగ్రమైన ఐశ్వర్యము, ధర్మము, యశస్సు, సంపత్తి, జ్ఞానము, వైరాగ్యము అను నీయాఱు లక్షణములు గలిగినవాఁడే భగవంతుఁడని శృతులందుఁ జెప్పఁబడియున్నది. కావున ఓంకారవాచ్యుఁడైన నిరాకారపరబ్రహ్మ మనునది కేవలము జడస్వరూపమైన వస్తువుగాక, యీ షడైశ్వర్యములచే నొప్పియున్న జ్యోతిస్స్వరూపమని విశదమగుచున్నది. ముఖ్యముగా, ఐశ్వర్యముతోడి జ్ఞానవైరాగ్యములని వివరింపఁబడి యుండుటచేత ఆ పరబ్రహ్మమునందు గర్మచేయుచుండుట అనుస్వభావము సిద్ధమగుచు ఆరీతిగా విశ్వమంతయుఁ గల్పించికొని జగన్నాటక సూత్రధారియై క్రీడించుచున్నాఁడనియే స్పష్టమగుచున్నది.

వివరణ :—

నిరాకారాఖండ నిర్గుణ పరబ్రహ్మము నుండి జీవాత్మ యనున దేవిధముగా సంకల్పింపబడి మూలప్రకృతిలో వ్యాపకమైనదియు, నెదుట నున్న ప్రకృతిపటము నందు జూపింపబడి యున్నది.

అందు మొదట నట్టిట్టిదనరాని అఖండ పరిపూర్ణ నిర్గుణ పరబ్రహ్మ మాద్యంతములు లేక నిండి యున్నదని గ్రహింపవలసి యున్నది. అట్టి అవ్యక్త పరబ్రహ్మమునే ఓం-అనియు, తత్-అనియు, సత్-అనియు మూడు విధములుగా వాచ్యార్థము నందు శృతు లామోదించి పిలచుచున్నవి. ఆరీతిగా బ్రహ్మర్షులైన వారా అవ్యక్తపరబ్రహ్మ మెట్లున్నదా యని విమర్శించి కొనియు, నెక్కువగా దర్శించ జాలక, అఖండమైన జ్ఞానానందమహత్స్వరూపముగా నున్నదని మాత్రమే వాక్రుచ్చి యున్నారు. అనగా అఖండముగా నున్న మహత్తు, అఖండముగా నున్న బ్రహ్మజ్ఞానము, అఖండముగా నున్న బ్రహ్మనందము నను వస్తువిశేషము లేకరసమై అయ్యఖండ పరిపూర్ణపరబ్రహ్మముగా నొప్పి యున్నదని తెలిసికొనగలిగిరి. ఆ మహత్తు, బ్రహ్మజ్ఞానము, బ్రహ్మనందము ననునవి, మూడును ననంతములైన వస్తువిశేషములనియే చెప్పికొనవలసి యున్నది గాని, వాటిని వస్తువిశేషణములని యర్థము సేయగూడదు. అనగా నవ్యక్త పరబ్రహ్మమను వస్తువొకటి వేఱుగా నుండి ఆవస్తువున కీ మూడును గుణములుగ నున్నవని యన్వయింప వీలు లేక, యీ మూడు మహారసములు గలిసి యేకమైయుండియే

పరబ్రహ్మముగా నొప్పి యున్నదని చెప్పికొనవలసియున్నది.

ఇప్పుడొక మారు పై పటము నందు జూపించిన భాగ విభాగములను గమనింపుడు. అందు దేహాప్రకృతి, ఇంద్రియ ప్రకృతి, మనః ప్రకృతి, బుద్ధి ప్రకృతి యను నీ మెట్టులను గ్రమముగా నధిగమించి, నిర్వాణపదము, పరనిర్వాణపదము మహాపరనిర్వాణపదము లను మెట్టులు సూచింపబడి యున్నవి. ఈ మెట్టులు వరుసగా నొక దానికంటె మఱొక టిగా సూక్ష్మములై యుండి, యుచ్చస్థానములుగా నున్నవి. అట్లు చూపింపబడి యున్న యీ యేడుమెట్లును రెండేసి విభాగములుగా జేయబడి యుండి, పై భాగము, క్రింది భాగ మని గ్రహింపవలసి యున్నది. అట్లాయవ్యక్తపరబ్రహ్మము మహర్షులచేత దెలిసికొనబడి యున్నట్లుగా, మహా నిర్వాణ పదమునందు మూడు చక్రములు వేఱు వేఱుగా నొకే పై భాగమున జూపబడి యున్నవి. వాటిని గ్రమముగా మహాత్, బ్రహ్మజ్ఞానము, బ్రహ్మానందమని చెప్పికొనిన, మహాత్ అనునది మాత్రమూ పై భాగము నుండి క్రిందికి దిగక యుం డగా, బ్రహ్మజ్ఞాన మనునది పరనిర్వాణ పదము నందలి పై భాగము వరకు మాత్రము వచ్చి నిలబడుచుండి, బ్రహ్మానంద మనునది 5 వ మెట్టుగా నున్న నిర్వాణపదము యొక్క పై భాగము వరకు వ్యాపించుచున్నది. అట్లు పటము నందు జుక్కలు బెట్టి చూపబడి యున్నది. చూడుడు. ఆ విధముగా నణుబీజముగా నిర్వాణపదము వరకు దిగివచ్చిన బ్రహ్మానంద రస మొక్కటియే ఆ యవ్యక్తపరబ్రహ్మము యొక్క అంశ యని చెప్పికొనిన, ఆ అఖండ స్వరూపమును ఖండించి

వేటు చేసినట్లగుచున్నది. కనుక ఆది పూర్ణాంశ గానే యున్నదని గ్రహించుటకు మహత్ చక్రము నుండి వేటవా లుగా జూపియున్న గీట్ల ననుసరించి, ఆ మహత్తును, విజ్ఞాన మును, నిర్వాణ పదమున కందరాక యున్నను, ఆ అణుబీజ ముగా దిగివచ్చిన ఆనందరసమునందు దమ యఖండస్వభా వముతో నిమిడియే యున్నవని తెలిసికోన వలసి యున్నది. అట్టి యా జ్ఞానానందమహాద్రసమగు నవ్యక్తపరబ్రహ్మము యొక్క నేకాంశమైన యీయణుమాత్ర నిత్యానంద నిర్గుణ పురుషుడే గుణమయమగు నీ విశ్వమంతయు సృష్టించి ధరిం చికొని యున్నాడు.

"అథవా బహునైతేన కింజ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహ మిదంకృత్స్న మేకాంశేన స్థితో జగత్॥

(శ్రీమద్భగవద్గీత)

ఓ యర్జునా! నా విభూతుల నే నెంతని శ్రమపడి నీకు వివరింప గలను. నీ వెంతని యోపికతో వినగలుగుదువు. నే నీచరాచరమయమైన యావద్విశ్వమును నేకాంశముచేతనే సృజించి ధరించి యున్నాడను.

అట్లా నిర్గుణ పరబ్రహ్మము ఏ తనయొక్క శక్తిచేత నవ్యక్తము నుండి వ్యక్తమును సంకల్పించెనో, ఆ చిచ్ఛక్తియే విద్య యనియు, శుద్ధమాయాశక్తి యనియు బిలువబడి యున్నది. అట్టి వ్యక్తావ్యక్తసమ్మేళనమైన యా చిచ్ఛ క్తియు ననంతము గానే యున్నదని చూపుచు, పటము

నందలి నిర్వాణ పదములోని మధ్యభాగములో చిన్నచిన్న యడ్డగీట్లు మధ్య వ్రాయబడియున్నది. గమనింపుడు. ఈ శుద్ధ మాయా శక్తిని గడచిన ముక్తాత్ములు విదేహముక్తి నొందిన వారలై నిత్యానంద ప్రధానముగా నెలుగ బడుచున్న యా అణుమాత్ర నిర్గుణ పురుషునిలో నైక్యము బొందుచు బునరావృత్తి లేని నిర్వాణ మొంది నిత్యసిద్ధులగు చున్నారు.

ఈ నిత్యసిద్ధులును నొక్కొక్కప్పుడు పరబ్రహ్మముచే నాదేశింపబడి ధర్మ పోషణకై మరల బుట్ట వచ్చును. కాని ఆ జీవాత్మ తొల్లింటి జీవాత్మయే యని చెప్ప వీలులేదు. సముద్రము నందలి తరంగ మొక మారు సముద్రజలములో నణగిపోయిన, మరల నా తరంగమే లేచి రాజాలదు. ఒక వేళ నదే తరంగము మరల బయటికి వచ్చునది యైనను, మొదటి స్వరూపము కంటె పెద్దదిగానో లేక చిన్నదిగానో యుండుటయే సంభవింపవలసి యున్నది. అట్లే పరబ్రహ్మైక్యము నొందిన జీవుడు లోకోపకారార్థమై తిరిగి జన్మింపవలసి వచ్చిననూ, తొల్లింటికంటె భిన్నరూపముగానే భగవంతునిచే సంకల్పింపబడి జ్ఞానానందమహత్స్వరూపుడై ప్రహ్లాద నారదాది నిత్యసిద్ధుల వలె నాజన్మజ్ఞానిగానే పుట్టుచు, దన ధర్మరక్షణ ముగించికొనగానే మరల బ్రహ్మైక్యమునే పొందుచున్నాడు.

ఈ చిచ్ఛక్తి నుండి సత్త్వరజస్తమో గుణము లనునవి ప్రభవించి నందువలన, ఆ నిర్గుణ పురుషుడు సగుణపురుషుడై అణుస్వరూపమునొంది శక్తిప్రధానముగా నిలచియున్నాడు.

అనగా, ఆ సగుణ బ్రహ్మమునందు గూడా మహత్తు, బ్రహ్మజ్ఞానము, బ్రహ్మానంద మను మూడు విశేషము లా యవ్యక్త పరబ్రహ్మము నుండి మూర్తీభవించియే యున్నను, యవి బుద్ధికి గ్రాహ్యములుగా నుండుటకు వీలులేమి, ఆసగుణబ్రహ్మమందు విశేషముగా భాసమానమైన యీశక్తి బీజమునే మమ్ముక్షు డెఱిగికొనుచున్నాడు. అట్టి సగుణబ్రహ్మ సాక్షాత్కారముతోనే సాధకుడు జీవన్ముక్తుడై మోక్షాధికారి యగుచు, ప్రారబ్ధ కర్మ క్షయముతో విదేహ ముక్తిని బొంది నిత్యానందనిర్గుణపురుషునిలో నైక్యము నొందుచున్నాడు.

అట్లు శక్తి ప్రధానముగా గోచరించు నీ సగుణ బ్రహ్మమందు గూడా అవ్యక్తపరబ్రహ్మస్వరూపమైన జ్ఞానానందమహదాసములు మిక్కిలి సూక్ష్మీకరణము నొంది యున్నను, యా లక్షణములను స్వభావ మాత్రముగా నైనా గ్రహింపవలసి యున్నది. ఆరీతిగా బటమునందు మూడు మూడేసి చక్రములతోనే సత్, చిత్, ఆనందములను మూడు రసములు వేఱువేఱుగా గ్రహింపబడియున్నవి. ఈ మూటిని నిర్వాణపదమునందలి జీవన్ముక్తి యను క్రింది భాగమున వరుసగానే చూపించికొనుచు, వాటి యేకత్వమును గూడా గ్రహించుకొనుచున్నాను.

ఇప్పుడివి క్రింద నున్న బుద్ధిప్రకృతి యను నొక్క మెట్టులోనే వికారము జెందుచున్న విశేషమునుగమనింపుడు. సత్ - అను రసము మాత్రము బుద్ధిప్రకృతి కతీతము గానే నిలిచియున్నది. కాని, చిత్ - అనునది మధ్య భాగము వరకు

దిగుచు "తెలివి" యను విరూపము నొంది యున్నది. ఆనంద-మనునది కూడా బుద్ధిప్రకృతిలోని మధ్యభాగము నందు 'సుఖ' రస మను రూపముగా మార్పు జెందుచు, క్రింది మెట్టయిన మనః ప్రకృతి లోని పై భాగమగు కారణశరీరమువరకు క్షీణించి, అవిద్య (లేక) మూల ప్రకృతి యొక్క స్వభావమైన యింద్రియ శక్తులచేత నావరింపబడియున్నది. అట్లా సత్తా మాత్రుడైన సగుణపురుషుడు బుద్ధి ప్రకృతిద్వారా వ్యాపించి మూలప్రకృతిస్వరూపమైన కర్మేంద్రియ జ్ఞానేంద్రియ శక్తుల యొక్క సంఘర్షణ బొంది జీవాత్మ (లేక) ఎఱుక మాత్రము గా నిలబడి యున్నాడు. ఆ ఎఱుకయు ప్రక్షీణమైన సుఖ బీజముతో మనః ప్రకృతి యొక్క నిరాకార భావమునందే గోచరించుట చేత, పాంచభౌతికస్థూలదేహోపాధి నొందిన జీవాత్మ జాగ్రదావస్థలో నిరాకారభావము నసలే స్మరింప బోమి నందలి సుఖప్రపత్తిని గూడ బొత్తిగా గ్రహింపక, కర్మేంద్రియజ్ఞానేంద్రియ కార్యమైన యింద్రియ శక్తుల ద్వారా సులభసాధ్యములుగా నున్న బాహ్యార్థముల నపేక్షిం చుచున్నాడు.

అట్లాయవ్యక్త పరబ్రహ్మమే లీలామయుడై సంకల్ప మాత్రముతో దన యధీనమునందున్న విద్య, అవిద్య యను శక్తి విశేషములం దేకాంశ మాత్రముగానే ప్రవేశించి విశ్వమంతయు నెలకొల్పికొని జీవాత్ముడై యావిర్భవించి వర్ణ రూపప్రధానముగానున్న నానావిధ దేహోపాధుల ధరించి విస్తరిల్లి విహరించు చున్నాడు.

ఆ విధముగా సంభవించిన జీవాత్మ తన యొక్క మనో బుద్ధు లీ పాంచభౌతికమైన సాకార లక్షణ దోషము బొందగా వ్యష్టిభావమైన యహంకారమును జెందినవాడై, తా నాపరబ్రహ్మాంశగా నున్న నిజ లక్షణమునే మఱచి దేహాత్మాభిమానియై, కర్తృత్వ భోక్తృత్వాది కర్మకలాపము నారోపించికొని, జనన మరణాది రూపమైన సంసారచక్రము నందు బరిభ్రమించుచు, ధన దారా పుత్రులను ఈషణత్రయ బాధితుడై బాల్య యౌవన కౌమారాద్యవస్థల నొందుచు, శిశ్నోదర పరాయణుడై జీవయాత్రల నడపుకొనుచున్నాడు. అనగా నిట్టి కర్మ దోషమంతయు దన కర్తృత్వ కార్యమైన దేహాభిమానమునుండియే కలుగుచున్నది. కాని యాదోష మాకర్మలకు గాని, తన యాత్మస్వరూపమునకు గాని చెంది యుండలేదు. అట్టి జనన మరణహేతువైన దురభిమాన దోష మునకు దన బుద్ధీంద్రియమే కారణముగా నున్నది. కావున నాబుద్ధితో నిటు నిహవిషయముగా గర్మఫల త్యాగియగుచు నటు బరవిషయముగా భక్తి ప్రధానముగా నుండిన, దాను దన నిజ స్వరూపము నెఱిగికొనగలుగుచున్నాడని స్పష్ట మగుచున్నది.

ఆ విధముగా మనుష్య మాత్రుడైన జీవుని యొక్క లక్షణములను బటము నందలి దేహ ప్రకృతి యను మెట్టులో దెలిసికొనియుంటిమి. కాని, యీపాంచభౌతికసృష్టిజాలము నందలి మిగిలిన జీవరాసులను మాత్రము వేఱుగా నింకొక మెట్టుక్రిందగానే చూపవలసి వచ్చినది. ఎందువల్ల ననగా, ఆ ప్రకృతులలోని జీవరాసుల యొక్క యింద్రియ శక్తుల

దేహములలో జడస్వభావముగా నుండి, మానవ దేహములో బ్రకాశించి యుండుటయే గాక, ఆ జీవస్వరూపము గూడా మానవ శరీరమునందే పూర్ణ స్థితిలో నిలబడుచున్నది కాని, చతుష్పాద బహుపాద జలచర భూచర జంతు జాలములందు గాని, వృక్షలతాది స్థావర ప్రకృతియందు గాని, అట్లు సమగ్రముగా వ్యష్టిరూపము గలిగి యుండుట లేదు. అనగా నీ స్థావర జంగమ ప్రకృతులలో బ్రతియొక్క దేహోపాధియందు నొక్కొక్క జీవాత్మగా వ్యాపింపక, జీవుడు సమూహ దేహి యగుచున్నాడు. అనగా నొక్క జీవాత్మయే కొన్ని దేహముల సముదాయమునందు బ్రవేశించి, పరివర్తన బొందుచున్నాడు. ఎట్లనగా, ఒక భాండము నందలి శుద్ధ జలమును వేలు వేలు చిన్నచిన్న పాత్రలలో బోసిన, నాయా పాత్రల లోని నీ రా యాపాత్రల యొక్క దోషములతో సంకరము నొందుచున్నది. అట్టి యా పాత్రలలోని నీరును మరల గలియ బోసిన, ఆసంకరమంతయు నేకమగుచున్నది. అట్లే జీవులు దమ సమూహమునకు జెందియున్న కొన్ని కొన్ని స్వభావజనితములగు లక్షణములతోనే పుట్టుచున్నవి. ఉదాహరణముగా నీటిలో సంచరించెడి బాతుయొక్క గ్రుడ్డును నీటికి భయపడు కోడిపెట్టయే పొదిగియుండినను, ఆ గ్రుడ్డు నుండి బైట బడగానే యా బాతు పిల్ల నిర్భయముగా నీటిలో నికే బ్రవేశించి స్వేచ్ఛగా నీదులాడుచున్నది. ఈవిధముగా నీగలు, దోమలు, చీమలు, మొదలగునవి గుంపులు గుంపులు గానే పుట్టి పొరలుచున్నవి. అట్లే పక్షులు, పశువులు, మొదలైన యుచ్ఛ జాతులందు గూడా చూలునకు రెండు,

మూఢముగా సహజముగానే పుట్టుచున్నవి. ఇక వృక్షలతాదుల విషయమున్ననో వేఱుగా జెప్ప నక్కఱయే లేదు. ఆరీతిగా సమూహ దేహి యైన జీవాత్మ యేదో యొక పెంపుడు జంతువువలె బరిగణింపబడినప్పుడు, మానవప్రకృతిలక్షణము లందు దిగుచు సంకర్షణ బొంది, కుక్క, గుఱ్ఱము, మొద లగు జంతువులవలె విశ్వాసహేతు రూపమైన కార్యాలోచ నము లోనై బలాత్కారముగా జిత్త విజృంభణము నొందిన మీద, తన దేహసమూహమునకు దెగిపోయి విడిగా సమగ్ర మైన జీవాత్మ గానే నిలిచిపోవుచు, మానవత్వము నొంది క్రమముగా నుచ్చస్థితికి బోవుచున్నాడు.

అట్టి సంపూర్ణమైన జీవస్వరూపము గల మానవ దేహమునందా పరబ్రహ్మస్వరూప మెట్లు ప్రవేశించియున్నది తెలిసికొన గలుగుటకుగాను, ఆ ప్రకృతి పటములో వేఱుగా జూపబడి యున్న నాడీ పటము నించుక గమనింప వలసి యున్నది.

ఆ నాడీ పటమునందు నెం. 1 అను గుర్తుతో జూప బడియున్న నిర్గుణపురుషుడు, ఆ ప్రకృతిపటములోని నిర్వాణ పదము యొక్క విదేహముక్తి యను పైభాగమందు జూప బడియున్న అణుమాత్ర నిత్యానందనిర్గుణపురుషుడే యని యెఱుంగ నగును. ఆ నిర్గుణపురుషు డట్లు ప్రాణమయకోశము నుండి, ఆనందమయ కోశములో నున్న రెండు కన్నులయొక్క

నల్లగుడ్డుయందు బ్రవేశించి వర్ణరూపప్రధానముతో నున్న ప్రపంచమును జూచి యానందించుచుండుటయే కాక, అమృత నాడిద్వారా హృదయకమలమునందలి జీవాత్మను సదా లాగి పట్టుకొని యున్నాడు. అదేవిధముగా ఆనిర్గుణ పురుషునుండి బైలుదేరిన నెం. 10 అగు చిచ్ఛక్తి యను శుద్ధమాయాశక్తి జ్ఞాననేత్రమైన అగ్నిమండలము నందు నివసించుచు, అష్టదళ పద్మమునుండి సంతతధారగా స్రవించుచుండెడి యమృతము నాస్వాదన చేయుచుండుటయే కాక, శ్వాసను ఇడా పింగళా నాడుల ద్వారా ఝామున కొకమారుగా మార్చి దినమునకు 21, 600 చొప్పున నాడించుచు, ఆజ్ఞాచక్రము నందలి రెండు దళములతో సంకల్పవికల్పములను కలిగించుచున్నది. అదే విధముగా ఆనిర్గుణపురుషునినుండి ప్రభవించిన అవిద్యారూప మైన మూలప్రకృతి, కుండలినీశక్తి యనఁ బరగుచు, వెన్నె ముక యందు (పటములో నిలువు గీట్లతో సూచింపబడి యున్నది) గపాలము నుండి మూలాధారము వరకు వ్యాపించియున్న నెం. 19. 13. సుషుమ్నా (లేక బ్రహ్మనాడి యను సన్నని నరము ద్వారా నధోముఖగా నడచి, నెం. 14 అగు మూలాధార చక్రమునందు వసించి నిద్రించుచుండుటయే కాక, తల్లక్షణమైన కర్మేంద్రియ జ్ఞానేంద్రియ ప్రకారమైన ప్రాణశక్తిని నెం. 15 అగు స్వాధిష్ఠాన చక్రమునుండి బైలు దేరిన 72000 నాడుల ద్వారా శరీరమంతయు వ్యాపింప జేయుచున్నది.

ఇట్టి శరీర తత్వములో నివృత్తిమార్గమునందు సాధకుని యొక్క నాడీ కూటమునందుద్భవించు వైష్ణవ జ్వరమను

ఉష్ణము చేత నా కుండలినీశక్తి మూలాధార చక్రము నుండి లేచి యూర్ధ్వముగా గదలి బ్రాకుచు, ఆజ్ఞాచక్రము నుండి సూర్యమండలమను పేరిటి అర్చిరాదిమార్గముగా అష్టదళ పద్మము సొచ్చి సగుణ బ్రహ్మసాక్షాత్కారమను సిద్ధి నొసగు చున్నది. ఈ కుండలినీశక్తి నెం. 8 అగు చంద్రమండల ములోనికి బోయిన, మోక్షదూరుడై పునర్జన్మము నొందు చున్నాడు. అట్లు కుండలినీశక్తి సహస్రార మండలి ప్రాణమయ కోశమునుగూడా ప్రవేశించిన దత్క్షణమే కపాల మోక్షమై అమృతనాడి ద్వారా జీవాత్మ పరమాత్మలో నైక్య మగుచు విదేహముక్తి యను నిర్వికల్పసమాధి సిద్ధించు చున్నది. అట్టి విదేహ ముక్తినుండి మఱలి వచ్చిన నిత్య సిద్ధులగు పరమహంసలకు నెం. 3 అగు శుక్ల పేటిక యం దేర్పడు "ఓజస్సు" అను తేజోరసము భూత భవిష్యద్వర్త మానమను కాలజ్ఞానము నొసగుచు ఋషీంద్రుల జేయు చున్నది. ఆ ఓజశ్శక్తియు దా నస్ఖలితబ్రహ్మచర్య విధిగా సేకరించి యుంచికొనిన శుక్ల ప్రమాణముగా నేర్పడుచు నామహర్షిని ఒక నెల, ఒకవర్షము, ఒకయుగము, ఒకమహా యుగమునను పరిణామభేదములతో త్రికాలవేదిని జేసి బ్రహ్మ ర్షిగా బ్రకాశింప జేయుచున్నదనియు నుపనిషద్వాక్యములందు జెప్పబడి యున్నది.

ఇట్టి యీ జీవాత్మ పరమాత్మల సంబంధమును వివే చించు విషయమున 1. సాంఖ్యమార్గము, 2 బౌద్ధమతము, 3. పూర్వ మీమాంస, 4. యోగ సిద్ధాంతము, 5. తర్క—

శాస్త్రము, 6. ఉత్తర మీమాంస, (లేక) వేదాంతము అను నీ యారు మార్గములును బూర్వము నుండియు ప్రచారములుగా నున్నవి. అవి యెట్టివనగా:—

**1. సాంఖ్య మార్గము:** ఇది కపిల మహర్షి చేత స్థాపింపబడెను. ఈ మతమునందు ఈశ్వరుడన వేఱుగా లేక పరమాత్మయే పురుషుడై యున్నాడు. ఆ పురుషుడును బ్రకృతియు గలిసి ప్రపంచ మగుచున్నది. ఆత్మయైన పురుషుడు నిమిత్త మాత్రముగా నుండి ముక్తి సమయమున ప్రకృతినుండి వేఱగుచు గైవల్యము నొందుచున్నాడు. ఆత్మ కుంటివానివలెను, ప్రకృతి గుడ్డివానివలెను యుండి, నడువజాలని కుంటివానిని దాను మోసికొని పోవుటకు సిద్ధమైనచో ఈ గ్రుడ్డివానికా కుంటివాడు త్రోవ జూపికొనుచున్నాడు. ఆవిధముగా ఆత్మ ప్రకృతి నుపాధిగా జేసికొని ప్రపంచమును గల్పించుకొనుచున్నది. యజ్ఞాది కర్మలచేత ముక్తి లేదు. పరోపకారాదుల చేతనే మోక్షము గలుగుచున్నది.

**2. బౌద్ధ మతము:** దీనిని స్థాపించినది సుగతుడు. శాక్యుడు ప్రచారకుడయ్యెను. జీవేశ్వరుల విషయము అవాఙ్మానసగోచరములు గావున ఆ విమర్శన మనావశ్యకము. ప్రత్యక్షానుమానములే ప్రమాణములు గాని, వేదశబ్దములు ప్రమాణములు గావు. ఈ బౌద్ధమతము నుండి నాలుగు శాఖలు వెలువడినవి. 1. సర్వం దుఃఖం దుఃఖం-అనగా దుఃఖవాదులు, 2. సర్వం క్షణికం క్షణికం-అనగా క్షణికవాదులు,

3. సర్వం స్వలక్షణం స్వలక్షణం-అనగా స్వలక్షణవాదులు,
4. సర్వం శూన్యం శూన్యం-అనగా శూన్యవాదులు.

ఈ సర్వశూన్యవాదులలోను నాలుగు తెగలుగలవు: 1. యోగాచార్యులు, 2. మాధ్యమికులు, 3. సౌత్రాంతికులు 4. వైభాషికులు. మొదటి తెగవారు బాహ్య శూన్యత్వము నొప్పుకొని, విజ్ఞానమే సత్యమనిరి. మాధ్యమికులు సర్వము శూన్యమనిరి. మూడవ తెగవారు బాహ్యర్థములు కేవలము అనుమేయములే కాని ప్రత్యక్షములు గావనిరి. వైభాషికులు బాహ్యర్థములే ప్రత్యక్షములనియు, విజ్ఞానమే అనుమేయమనియు ప్రతిపాదించిరి. అట్లు బౌద్ధులు మొత్తము మీద శూన్యవాదులనియు, బాహ్యవాదులు (లేక) బాహ్యకులనియు రెండు శాఖలైరి.

బౌద్ధమతసిద్ధాంతములరీత్యా మానవునకు దా జేయు కర్మ ముఖ్యము. తాను చేయు ప్రతియొక్క పనియు కర్మయే యగుచున్నది. కర్మకు ఫలము తప్పదు గనుక దాని ననుభవించుటకై మరల జన్మ కలుగుచున్నది. కావున జన్మరాహిత్యమునకు గర్మనే సన్యసించుట ముఖ్యము. అట్లు జీవుడు శూన్యత్వము(లేక) నిర్వాణమును బొంది శాంతినొందుచున్నాడు.

**౬. పూర్వ మీమాంస :** ప్రవక్త జైమినిమహర్షి. ఈ మతప్రకారముగా నటు సాంఖ్యముగాని, యిటు బౌద్ధమతము గాని ముక్తినొసంగవు. వేదమంతయు ధర్మమునకుమూలము. సనాతనధర్మములే యాచారములు. వేదోదిత నిత్యనైమిత్తిక

కర్మములే యొక్క ధర్మమును దేవతావిశేషమున నావిర్భవించి మరణానంతరము స్వర్గ సుఖముల నిచ్చును.

**4. యోగ సిద్ధాంతము :** ప్రవక్త పతంజలి మహర్షి. ప్రాణాయామాద్యష్టాంగ యోగసాధనచే నంతరింద్రియము లను బాహ్యేంద్రియములను వశపఱచికొని, చిత్త వృత్తుల నిరోధించి. సమాధి నిష్ఠాగరిష్ఠుడై కైవల్యము నొందవలయు ననుట. చిత్తైకాగ్రత బొందుటకుగాను. అనేక విధములుగా ప్రతీకములను (అనగా ధ్యానము చేయుటకు ఆకారములను) గల్పించికొని సాధన చేయవలెను. అట్లు ఒక్కొక్క వస్తువు పై ధారణ, ధ్యానము, సమాధిని బొందిన సంయమించినవా డగుచున్నాడు.

**5. తర్క శాస్త్రము :** ఇది రెండువిధములు, 1. న్యాయ దర్శనము, 2. వైశేషికము.

1. న్యాయ దర్శనము:- ప్రవక్త గౌతముడు. యథార్థ జ్ఞానమునకు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము లను గుఱించి చెప్పుచు నెదుటి పక్షము వారి సిద్ధాంతములను ఖండించు యుక్తులు గలది. ఇందు ఈశ్వరత్వము లేదు.

2. వైశేషికము: ప్రవక్త కణాదుడు. ఇదియు న్యాయదర్శ నమువంటిదే, కాని పరమాణువాదము. జగత్తు అణుమయము. సుఖదుఃఖములు, ఔషధములు, ప్రళయము అన్నియు అణు కారణములు. ఇదియు నిరీశ్వరమతము.

!. ఉత్తర మీమాంస (లేక) వేదాంతము (జ్ఞానకాండ) స్థాపకుడు వేదవ్యాసుడు. జీవాత్మ పరమాత్మ సంబంధము లగు నుపనిషద్వాక్యముల నేరి బాదరాయణుడు బ్రహ్మ సూత్రముల నొనరించెను.

ఈ వేదాంతము నుండి 1. ద్వైతము, 2. అద్వైతము, 3. విశిష్టాద్వైతము, లను అభిప్రాయభేదములు ప్రవర్తిల్లెను. కాని యీ మూడును ఆస్తిక మతములే.

1. ద్వైత మనగా జీవుడెప్పుడును ఈశ్వరుడు గాజాలడు. ఆతనా శరీరముతో బరలోకమున ననుభవించును. ఎక్కువ పుణ్యముచే ఈశ్వర సాన్నిధ్యము బొందును.

2. అద్వైత మనగా జీవుడు ఈశ్వరుడేయై యున్నాడు. కాని తాను మాయచేత గప్పబడి తన నిజత్వమును మఱచి యహంభావమును బొంది దేహాభిమానియై, కర్తృత్వ భోక్తృత్వముల నారోపించికొను చున్నాడు. పుణ్యాతిశయముచే మఱల దేహాభిమానమును అహంకారమును వదలిన తన సచ్చిదానందస్వరూపము నెఱుగుచున్నాడు. సగుణోపాసన కేదేవుడైననూ నొకటియే.

3. విశిష్టాద్వైత మనగా జీవు డీశ్వరుడు గానేరడు. ముక్తి యందు సాటిరూపమును మాత్రము బొందును. ఈ మతస్థులు గొందరు విష్ణు పరముగా వైష్ణవు లనియు, శివ పరముగా శైవులనియు పిలువబడిరి.

ఇట్లభిప్రాయభేదములతో ననేకమతములు ప్రచారము లోనికి వచ్చిననూ యీ మతములన్నియు యథాస్థితిలో జీవు

డు పతితుడై క్షుద్రావస్థలో నున్నాడనియు, తాను ప్రయత్నించిన ఉచ్చదశకు బోగలడనియు నొక సర్వసామాన్యమైన సూత్రము ననుసరించియే యున్నవి. అట్లు సృష్టియందలి నానావిధ జీవరాసులలో, మానవజన్మయే సర్వోత్కృష్టమై యున్నది. అదియు కలియుగప్రమాణముతో నూరువత్సరముల పరిమితి నొంది యున్నది. అందు సగము నిద్రలో లయమైపోవుటయే కాక బాల్యకౌమారయౌవనాద్యవస్థలలో గూడా సర్వము నష్టమగు చున్నది. అట్టి స్థితిలో మానవుడొక్క జన్మలోనే ముక్తి సాధించు నిమిత్తమై నాలుగాశ్రమ ధర్మములు గల్పింపబడినవి. అందు కౌమారావస్థయే సాధనకు యోగ్యమై యున్నది కాన, కౌమారావస్థ నుండి 12 ఏండ్లు వేదాధ్యయన మనబడు బ్రహ్మచర్యాశ్రమ మనియు, తరువాత 12ఏండ్లు గృహస్థాశ్రమమనియు, పిమ్మట 12 ఏండ్లు నస్ఖలితదీక్షతోడి తపశ్చరణ మనబడు వానప్రస్థాశ్రమ మనియు, తదనంతరము సన్యాసాశ్రమ మనియు గల్పింపబడెను. వానప్రస్థాశ్రమతపోదీక్షయందు భార్యాసమేతముగానే నడపి ఆత్మసాక్షాత్కారమను జీవన్ముక్తి నెఱిగికొని, తదనంతరము సన్యాసాశ్రమము బ్రవేశించి జ్ఞానబోధ చేసి తుదకు మోక్షము బొందుచు ధర్మార్థకామమోక్షములను చతుర్విధపురుషార్థములను ఈ జన్మలోనే సాధింప గలుగు చున్నాడు. బ్రహ్మచర్యాశ్రమధర్మము, వేదాధ్యయనమును; గృహస్థాశ్రమ ధర్మము, ఋతుసమాగమ వ్రతము తోడి వంశాంకురమును; వానప్రస్థాశ్రమ ధర్మము, అస్ఖలితబ్రహ్మచర్య దీక్షతోడి తపస్సునైయున్నవి. "తపము తే దుపవాస

వ్రతంబుకంటె" నని యున్నట్లుగా, తపమనగా ఉపవాసవ్రత మేమై యున్నది. అది క్రమముగా దినమునకు రెండు కుడుపులని కొన్నాళ్లు సాధింపవలయును. తరువాత ఒంటి పూట భోజనము సాధింపవలయును. తరువాత రెండు దినముల కొకమాఱుగాను, మూడు దినముల కొకమాఱుగాను, యిట్లు క్రమముగా అభ్యాసబలముతో పక్షోపవాసదీక్షయు, మాసోపవాసదీక్షయు సాధింపగలిగిన, ఆ యా దీక్షల కా యా శక్తి సామర్థ్యము లేర్పడుచున్నవి. మాసోపవాసదీక్షతో మోక్షాధికారి డగుచున్నాడు. మాసోపవాసదీక్షకంటె నధికముగా నుపవసించుటచే ఆత్మహింస జరుగుచున్నదని మాసమునకు మించిన పరిమితి నిషేధింపబడినది. కాని, ముఖ్యముగా తన కంఠధ్వని క్షీణించిన, తత్క్షణమే దీక్ష నాపివేయవలె ననుట సాధకు డెప్పుడు గమనింపవలసి యున్నది.

ఈ పైజెప్పబడిన యన్ని మతములకంటెను నవవిధ భక్తియే శ్రేష్ఠమును సులభమునని శ్రీశుకమహార్షి మతము:-

మ॥ తను (1) హృద్భాషల సఖ్యముం (2) శ్రవణముం
(3) దాసత్వముం (4) వంద (5) నా
ర్చనముం (6) సేవయు (7) నాత్మలో నెఱుకయుం
(8) సంకీర్తనం (9) చింతనం,
బను నీ తొమ్మిది భక్తిమార్గముల స
ర్వాత్ముం హరిం నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలతుం
సత్యంబు దైత్యోత్తమా॥ (శ్రీమద్భాగవతము)

ఇట్టి వేదాంతధర్మమైన భక్తియోగమును—శ్రీశంక రాచార్యులవారుగూడా తరువాత నామోదించి తదనుగుణ్య ముగా దేవాలయములు విగ్రహారాధన గల్పించినట్లుగా— ద్వాపరయుగాంతము నాటి భగవద్గీతయందు శ్రీకృష్ణభగ వాను డీక్రిందివిధముగా బ్రతిపాదించి యుండెను:-

1. ఓం-తత్-త్స దితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః
బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥

అనగా ఆ అవ్యక్తపరబ్రహ్మము బ్రహ్మసూత్రము లందు ఓం-అనియు, వేదములందు తత్-అనియు, యజ్ఞ యాగాది కర్మకాండయందు సత్-అనియు, పిలువబడుచు 'ఓంతత్సత్' అను మంత్రము చేతనే పూర్ణముగా గలిపిచెప్ప బడుచున్నది. ఆస్వరూపమునే తరువాత 'సచ్చిదానంద'స్వరూ పమని చెప్పుట వాడుకలోనికి వచ్చియున్నది.

2. ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా॥

ఓ యర్జునా! ఆ పరమాత్మయే సర్వభూతముల యొక్క హృదయస్థానమునందు నిల్చి తన మాయాశక్తి యను కర్మసూత్రముచేత యంత్రములను నడపుచున్నట్లుగా గద లించి యాడించుచున్నది.

3. యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః స్సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

కావున నో యర్జునా! కర్మఫలమునం దాసక్తి విడిచిన యోగయుక్తి గలిగిన వాడవై కర్మలనే చేయుము. అప్పుడు నీకు కర్తృత్వముగాని భోక్తృత్వముగాని యుండదు. ('యోగః కర్మసు కౌశలం' అని చెప్పబడి యున్నట్లుగా, యోగ మనగా బుద్ధికౌశల్యము (లేక) సమత్వమని గ్రహింపనగును).

4\. సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరా వుభౌ
తయోస్తు కర్మసన్న్యాసా త్కర్మయోగో విశిష్యతే॥

సన్న్యాస మనగా కర్మసన్న్యాసము; కర్మయోగమనగా కర్మలను చేయుచు ఫలమును వదలుట. ఈ రెంటిలో గర్మలను పూర్తిగా వదలుట కంటె, యోగయుక్తితో గూడిన కర్మయే గొప్పది యగుచున్నది.

5\. ఉద్ధరే దాత్మ నాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః॥

తన ఆత్మ చేతనే త నుద్ధరించికొనవలయును. తన ఆత్మయే తనకు బంధువును శత్రువును నగుచున్నాడు.

6\. క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తాహిగతిర్దుఃఖం దేహవద్భి రవాప్యతే॥

అవ్యక్త బ్రహ్మోపాసనము మనస్సునకు క్లిష్టముగా నుండును. వ్యక్తులైన దేహధారు లవ్యక్తోపాసన చేయుటకు మిక్కిలి కష్టముతో సాధింపవలసి యున్నది. కనుక వ్యక్తమైన సగుణోపాసనయే సులభసాధ్యము సుమా.

7. శ్రేయో హి జ్ఞాన మభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే
ధ్యానాత్కర్మఫలత్యాగ స్త్యాగాచ్ఛాంతి రనంతరమ్॥

మూఢాభ్యాసము కంటె జ్ఞానము శ్రేష్ఠము. జ్ఞానము కంటె ధ్యానము శ్రేష్ఠము. ధ్యానముకంటె కర్మఫలత్యాగము శ్రేష్ఠము. తరువాత త్యాగము కంటెను శ్రేష్ఠమైన శాంతి కలుగుచున్నది.

8. యో నహృష్యతి నద్వేష్టి నశోచతి నకాంక్షతి
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్సమేప్రియః॥

అట్లు యిష్టాయిష్టములు, శుభాశుభములు, విడిచి, నాకు భక్తుడైనవాడు నాకు ఇష్టుడు, అనగా శ్రేష్ఠుడు.

9. సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణంవ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచ॥

కావున అన్ని ధర్మసంబద్ధములు విడిచి సర్వసంగపరిత్యాగివై నన్నేశరణుబొంది కర్మలను చేయుము. అట్లైన నేను నిన్ను సమస్త పాపములనుండి తప్పక రక్షించుచున్నాను. కావున నీవు అన్యథా శోకింప బనిలేదు.

10. ఓ మి త్యేకాక్షరంబ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాంగతిమ్॥

అట్లు ఎవ్వ డవసానదశయందు "ఓం" అనెడి యేకాక్షరమంత్రము నుచ్చరించుచు, నన్ను స్మరించుచు, దేహము

వదలి పోవుచున్నాడో, వాడు బరమోత్కృష్టమైన గతిని బొందుచున్నాడు.

అని భక్తిపరమైన త్యాగలక్షణమునే నిర్వచించుచు, సంగ్రహముగా:-

"ఓ పార్థా! సత్-అని చెప్పబడు నా ఓంకారమే తన మాయాశక్తియైన మూలప్రకృతితో గలిసి జీవాంశ సంభూతుడై క్రీడార్థముగా లింగదేహమును ధరించి జడమైన స్థూలాది శరీరములందు నేకాదశేంద్రియ వ్యాపారుడగుచు తాను బరమాత్మని యంశముగానే నుండినప్పటికి, తన నిరాకారత్వమును మఱచి, సాకారాభిమానియై యహంకారమునొంది దేహాత్మైకబుద్ధితో నింద్రియలోలుడై సంసారచక్రమున జిక్కి మాటిమాటికి బుట్టి గిట్టి పరిభ్రమించుచుదుదకు స్వార్జితమైన పుణ్యవిశేషముచే నింద్రియవాసనలందు విరక్తిబొంది త్యాగియగుచు గర్మఫలము నపేక్షింపక ప్రారబ్ధశేష మను జీవయాత్ర ముగించికొని తుదకు అక్షరపరబ్రహ్మత్వ మను సంస్కారమునొంది నిత్యసిద్ధుడై ప్రకాశించుచున్నాడు సుమా!"

యని ప్రబోధించిన యా శ్రీకృష్ణభగవానుడు నన్ను సదా రక్షించుగాక !!!

ఓం తత్సత్

శ్రీమ ద్రామావతారపరబ్రహ్మణే నమః॥

# శ్రీ గోపికా రహస్యము

ఓంకారరూప! విగతా
హంకారమునీంద్రహృద్గుహాంతర్వర్తీ!
శంకావిరహితభక్తవ
శంకర! సచ్చిత్సుఖాత్మ! సర్వేశ! హరీ!

సీ॥ త్రేతాయుగమున నుద్రేకించి పూర్వదే
వానీక[1] మతిఘోర మైన భంగిఁ
గవిసి, గోవుల యోగిగణముల మానుల
భూసురప్రతతి స్వర్భువననాథు
నప్సరోవర సిద్ధ యక్షాది సాధ్య గం
ధర్వ నిలింపుల సర్వలోక
ములఁ గ్రూరులగుచుఁ బాముఁ[2]బెట్టఁదొడఁగ ని
ర్వీర్యులై దివిజు లవ్వేధఁ[3] దలఁచి

1. దైత్యులు, దానవులు, రాక్షసులను యన్ని తెగలవారు.
2. కష్టముల 3. బ్రహ్మదేవుని.

తే॥ సత్యలోకమునకు నేగి జలజగర్భు
చరణపంకేరుహంబుల శరణుఁజొచ్చి
వరము మును బొంది దైత్యసంహారణమునకు
మొనయుమని కోరి వేడిరి మనికితముగ ॥

ఉ॥ వారిజసంభవుం డమరవర్యులనెల్ల దయార్ద్రచిత్తుఁడై
కూరిమి నాదరించి, రణకోవిదులైన నిశాచరేశులం
బోరునఁ దాకలేమి, నిజబుద్ధిఁ దలంచి, పురాణపూరుషుం
దారకశబ్దవాచ్యు సుఖదాయకు స్తోత్రముసేసి వేడినన్ ॥ 2

మ॥ అభయంబయ్యెడుమీకు, దివ్యవరగర్వాంధాత్ములై రాక్ష
సుల్
శుభకార్యంబుల కెగ్గుఁజేయుచు, జనక్షోభంబుగా లోకముల్
వ్యభిచారంబులపాలుసేసి, మతముల్ వంచించి, పాపాత్ములై
రభవా! కాలముగూడఁజంపెదస్వకార్యంబింతపొండింద్ర
కున్ ॥ 3

క॥ అని యొకభీషణనాదము
వినఁబడినం గలతఁదేఱి వేల్పులు వనజా
సనుఁ దగువిధమున వీడ్కొని
చనిరి శుభంబయ్యెననుచు సదనోన్ముఖులై ॥ 4

ఉ॥ దుర్జయులైన దానవులు దోర్మదులై కసి దేవకోటులన్
గర్జనతర్జనల్సెలఁగఁ గారియఁబెట్టు విదారితప్రకా
రోర్జితచిత్తవృత్తులుయథోచిత సత్త్వగుణప్రధానమై
కర్జముమీఱఁగాఁబ్రకృతి కార్యముబొందిక్రమక్రమంబునన్ ॥

ఆ॥ కాలమనుసరించి గంభీరమగుచుఁ గేం
ద్రత్వ మొంది మేఘరాజివోలె
నీలవర్ణ మెలయ నెఱిఁ బరిణామంబు
నొందుచుండెఁ గర్మయుక్తమగుచు॥ 6

ఆ॥ అట్లు పరిఢవిల్లి యవతారపురుషుఁడై
దశరథేశ్వరునకు ధర జనించెఁ
బట్టమహిషియైన భార్య కౌసల్యయం
దోజతో సమష్టితేజ మపుడు. 7

మ॥ తన సర్వాంగములందు దీధితులు విస్తారంబు గాఁ బ్రజ్వరి
ల్లిన 'శ్రీ' యొప్పు, తదాత్మరూపవిలసల్లీలల్మనోరమ్యమై
చన "రాముం" డనఁ జెల్లి, భాసిలెఁ దదబ్జా[1]స్యామృతాంశుల్ కనం
గ నితాంతైకసుఖప్రదంబులయి వెల్గం బూర్ణ 'చంద్రుం'
డనన్॥ 8

క॥ అక్షీణబలుఁడు రాముఁడు
దక్షుండై వెడలి క్షాత్రధర్మముఁ బేర్మిన్
రక్షోగణసంహారం
బక్షయమని చేరె దండకారణ్యంబున్॥ 9

1. చంద్రుఁడు.

శా॥ సారంబైన వివేకమూని, విజనస్థానంబులందుండి, సచె
న్నారన్ శాంతమనస్కులై తనరి, దుష్టాసక్తిఁబోనాడి,
ర్వారంభంబులుమాని, సంతతము "బ్రహ్మో௨హం-
శివో௨హం-నసం
సారమ్మస్తి"యటంచునుండి రట విశ్వాసాత్ములై
సంయముల్ ॥10

మ॥ ఒకనాఁడాభువనైకమోహనుఁడనుష్యత్వాహమే పారదం
డకసుక్షేత్రములందునన్ కఋ-మునికూటంబేర్పడఁగాంచి, లో
నికి సుస్వాగతుఁడై ప్రమోదకరుఁడై నేత్రోత్సవాకారుఁడై
యకలంకోజ్జ్వలుఁడై వెలింగె ముని తారానీకరాకేందుఁడై

సీ॥ తొలకరిమొగులు కాంతులనీను నవకోమ
ల శ్యామలాంగ విలాసవరుని
బదునాల్గుభువనముల్ ప్రభవించు మహితనా
భీకంజగంభీరవివరయుతుని
దిశలెల్ల వెలిగించు దినరాజు రేరాజు
రహిఁ విరాజిల్లు నేత్రములవాని
బేదఱికము వాపు పెద్దముత్తైదువ
శయనించు విపులవక్షంబువాని

తే॥ "గలదు-లే"దనఁ జెల్లెడి కౌనువాని
భద్రకుంజర[1]యాన వైభవమువాని
రుచిరలావణ్య నతులతారుణ్యుఁ బురుష
మోహనోద్దాము రఘుకులాంభోధిసోము॥ 12

1. భద్రజాతి యేనుఁగు.

క॥ అనిమిషులై కన్గవ ము
జ్జనితాశ్రుకణంబులొలుక సంయమివర్యుల్
గని, తద్వదనామృతమును
ఘనముగ సేవించి రధిక కౌతుకమొదవన్॥ 13

శా॥ఆనీలత్వము, నామహోన్నతియు, నాయాజాను బాహుత్వ,మా
పీనుల్ నేత్రము, లాభుజాస్యగళనాభీపాదపద్మంబు, లా
కౌనా పెందొడలాయురంబు, నొకటం, గందర్పబాణంబులై
మౌని స్వాంతములందు నాటిన మహామాయాపరిభ్రాంతులై॥

ఆ॥ వన్నెకాఁ డటంచు హృన్నియమముఁదప్పి
యంగజాగ్నివివశలైన యౌవ
నాంగులట్లు గడు భయంబు సంభ్రమము ద
లిర్పఁ గదిసి కౌఁగిలింపఁ బూని॥ 15

క॥ మగవాఁడని, నగుఁబాటని,
బెగడువడుచు, జడత గదుర బెదరుచు, లోలో
వగరుచు, నువ్విళ్లూరుచు,
మొగములు పరికించికొనుచు మురియుచుఁ దమలోన్॥ 16

ఉ॥ అక్కట! ధీరవృత్తి విపినాంతములందు వసించి, గింజలం
బొక్కుచుఁ బెక్కువర్షములు పూనికతో వ్రతచర్యనుండి, చేఁ
జిక్కనియింద్రియంబులఁ గృశింపఁగఁ జేయుచు, జీవయాత్ర చే
స్రుక్కినమమ్ము, నేఁడుపురుషుండొకఁ డిట్టుల నేచెడింగదే॥

చ॥ అచలసమాధియోగమున నంచితభక్తిమనంబుఁ గుచ్చి, చి
త్త చలనవృత్తుల న్నిలిపి, తర్కక బుద్ధిని మాన్చి, కర్త క
ర్మ చదిపి, మించి యద్వయసమాహితవర్తనమందు వెల్గు నా
త్మ చలితమయ్యె నెట్లొకో? వృథాకద నేఁడు తపఃప్రభావముల్॥

తే॥ ఆ పరబ్రహ్మ మీరాముఁ డగుచుఁ బుట్టె
ననుట నిశ్చయమయ్యె; నయ్యాది విశుద్ధ
హంసవాచ్య మగునుగాక, నరయ హేయ
మైన యీదేహ మాతత్త్వ మగునె తలఁప?॥ 19

సాక్షిస్వరూపమై, ఫా
లాక్షాది తృణాంతమై, మహద్రూపంబై,
యక్షరమై, ప్రత్యక్షవి
లక్షణమైనట్టిదే పరబ్రహ్మ మగుఁ॥ 20

గడ్డములు నెరసి, మిక్కిలి
జడ్డుఁదనము గదుర నొడలు సడలించి, కడు
న్నెడ్డెలగునట్టి ముసలి
గొడ్డులమై యుండి, యిట్లుగోరం దగునే? 21

అని బహుప్రకారముల నెమ్మనములందుఁ
గడు వితర్కించి యనురాగ ముడుగ లేక
ప్రీతి నాలింగనము సేయు వేడ్క గడలు
కొనఁగ వేగిర పడుచున్న మునుల నరసి. 22

శా॥ ఆలోకేశ్వరుఁ డాచరాచరవిభుం డారామచంద్రుండు శ్రీ
డాలోలాత్మకుఁ డామునీంద్రులయభీష్టం బంతరంగంబునం
దాలోకించి దయాసముద్రుఁడుస్వభక్తార్థప్రదుం డౌట హృ
న్నీలీరాగముచోప వారిఁ గలయన్వీక్షించి సోత్కంఠుఁడై॥

సీ॥ తాపసోత్తములార! తథ్యంబు బ్రాహ్మణా
ధీనుఁడనగు దేను; ధృతి దళిర్ప
నేమానవుండని హృదయకమలమందు
సర్వమంగళకర సత్త్వరూపుఁ
డన నొప్పు నన్ను భావనసేయ నిరతిశ
యానంద మొసఁగుదు, నమరలోక
మాదిగా నీవిశ్వ మతనిదయై యుండు;
శుద్ధమనస్కులు సిద్ధపురుషు

తే॥ లంచితాధ్యాత్మయోగవిద్యార్థవేదు
లుత్తమోత్తములగు మీర లుత్సహించి
సుమచిరాలింగనముఁ గోర, దొరక దెట్లు?
వరుస సిద్ధించు నది మీ కవశ్యముగను॥ 24

ఉ॥ ఐనను మీయభీష్ట మిపు డక్కట! చేకుఱఁజాల, దెట్లన
మానితమైన సత్యనియమంబులఁబూని చరించు జానకీ
జానిని గాఁగిలించు టపచారముగాన నిషిద్ధమింత, యో
ధీనిధులార! రాముని యతీతసతీవ్రత మట్టిదాఁజుఁడీ!॥ 25

తే॥ వరతపఃపుణ్యధనషడైశ్వర్యసమితి
కడఁగి మూర్తీభవించి నా కాయమయ్యె
నన్ను నిమ్మైన నాలింగనమును జేయఁ
బాత్రు లౌరువెవ్వ? రొక్క భూపుత్రితక్క॥ 26

చ॥ కొనకొనిమీరు నేఁడు మదిఁగోరినకోరిక మీకు ద్వాపరం
బున నిజభూతితో మఱలఁ బుట్టి యశోదకుఁబుత్రకుండనై
యనువుగఁగ్రీడసల్పు నపుడందగఁ జేయుదు; నేడుస్త్రీలువో
లె నిటులఁగోరుటందగఁజరింతురుగోపికలౌచుమీరటన్॥

తే॥ అనఁగ "నీ మహాత్మునకు సాయకము నొకటె,
మాట యొక్కటె, యొకరిత మగువ యట్టె,
ఔర ! యీ దివ్యరామావతార నియమ
సరణి యిట్లొప్పునె?" యను గుసగుసలొదవె॥ 28

శా॥ అంతన్ ద్వాపరమేగుదేర నట బృందారణ్యసామీప్యమా
గ్రాంతర్భూముల గొల్లభామలగుచుం గర్మానుసారంబుగా
దాంతుల్సంయములుద్భవించిమమతం దత్క్రియాలోలురై
భ్రాంతింబొంద యశోదగాంచెఁగడుసారన్ 'కృష్ణు'
రోచిష్ణునిన్॥

ఉ॥ బాలుఁడు గోపబాలకుఁ డపారకృపాదిగుణాలవాలుఁ డు
న్మూలితరాగలోభమదమోహవికారసుశీలుఁ డవ్యయ
శ్రీలలితుండు భక్తజనసేవితచిన్మయరూపుఁ డాత్మ లీ
లాలఘుతంత్రుఁడంచితభవాంబుధిబాడబుఁడాతఁడల్పుఁడే॥

శా॥ అజ్ఞానాంధపరీతలైన వ్రజకన్యానీక మధ్యాత్ముఁ డ
త్యజ్ఞానప్రదుఁడైన కృష్ణునెడ దైవత్వంబు లక్షింప కా
త్మజ్ఞానంబులఁ జూఱఁబుచ్చి గుణసంతానంబులం జొచ్చినం
బ్రజ్ఞాలభ్యుఁడు దేవదేవుఁడు గృపాపారీణధారేయుఁడై॥

క॥ వ్రేపల్లె గొల్లపడుచులు
చూపాఱఁగి ప్రవృత్తియందుఁ జొఱఁబడి కామ
వ్యాపారతఁ జంచలలై
తాపత్రియగుణములందుఁ దలఁపడి రకటా!॥ 32

ఉ॥ గొల్లలువీరు, శ్రద్ధమెయి గోవులఁగాయుదురింతవృత్తి, తా
మెల్లరుఁజల్లపాల్పెరుఁగు లెక్కయిఁగూర్చి గడించుచుందు, నీ
సల్లలితాబ్జలోచనలు స్వల్పసుఖంబుల నాసచేయుచుం
గల్లజగంబుఁగానని ప్రకారమతోఁ జెడి నెల్లభంగులన్॥ 33

తే॥ శుద్ధచైతన్యమయపరంజ్యోతియందు
మున్ను గ్రీడించు తాపసముఖ్యులయ్యు
నన్మహామాయ మునిఁగి, రి మ్మానవ్యమతులు
కించిదాత్ములు, వీరి రక్షింపవలయు॥ 34

క॥ అని చింతించి యదూత్తముఁ
డనుకంప తొలంగి నిజసహచరులతోడం
జని వారి సిరులఁ గొనియెం
జనదే సిరిమగని కఖిల సంపదలఁ గొనన్? 35

మ త్త॥ అల్లనల్లన గోపబాలకు లందఱున్ గుమిఁగూడి రా
మెల్లమెల్లఁగ నిండ్లలోనికి మిణ్కరించుచు దూఱి బల్
మల్లుఁడై కల పాలువెన్నల మంచిగా దిగఁద్రావి, యా
గొల్లభామల మర్లుగొల్పెను గూర్మి శైశవలీలలన్॥ 36

మ॥ అబలల్ చంచలలజ్జతంబరముసర్వాత్మున్ హరిన్ మాధవున్
సబలున్[1] లక్ష్యము సేయనేఱక రజ[2]స్సంబంధలై భ్రాంతలై
ప్రబలంబైచను జారచోరగుణసంబద్ధాత్ముఁగా నెంచి, డా
సి బహూదర్వ్యాత్తిఁదదంబపైఁగవిసి రిస్సీ! యంచుఁ
గోధించుచున్

క॥ గోపమ్మా! నీతనయుఁడు
మా పుణ్యముకొలఁదిఁ బుట్టె; మఱి యింకేలా?
యేపాపమొ? మేమిఁక నిటఁ
గాపురములు సేయలేము, కంజదళాక్షీ!॥ 38

సీ॥ ముకురంబు గనరాదు మొగమునఁగస్తూరి
చుక్కఁబెట్టుమటంచుఁ బ్రక్కఁజేరుఁ
జేరి, నీసరిగలు సిక్కుఁబొందినవంచుఁ
జన్నొనల్ స్పృశియించి శంకఁజేయుఁ
జేసి, నీకొకమాటఁ జెప్పెద వినుమంచుఁ
జెవిఁగ్గి కదిసి నుంజెక్కునొక్కు
నొక్కి, నీకంటె నే నెక్కుడుందు నటంచు
మోము మోమునఁ జేర్చి మోవినాను

1. బలరామునితో గూడియున్న వానిని
2. రజోగుణ

తే॥ నాని, చోద్యముఁజూపెద ననుచుఁ గనులు
మూసి, యిలుసొచ్చి, పాల్ద్రావి, మూతిఁబూయుఁ
బూసి, లేనవ్వుతో ముద్దుసేసి పోవుఁ
బిల్లవాఁడె? యశోద! మీ నల్లవాఁడు॥ 39

సీ॥ భద్రంబుగా క్షీరభాండంబు లందంద
జాగ్రత్తపఱచి నిశ్చయము మెఱయ
ద్వారబంధమునొద్ద ధైర్యంబుగా నిల్చి
'యెదెవచ్చె-నిదెవచ్చె' ననుచు బ్రిమసి
తలడిల్లుచుండ నేదారి లోఁజొచ్చునో
గుర్తింపఁగారాదు గూఢచారి
పాలు మీఁగడ వెన్న భక్షించి తాఁబోవుఁ
గల్ల కాదిది, వట్టికడవ లుండు,

తే॥ వింతకూఁతల మమ్మ్రు నిర్ఘాంతపఱచి
పాలకుండల నన్నిఁటిఁ గాలఁదన్ని
పాఱిపోవును; పెక్కేల? బడుగు నిట్టు
లూరిపైఁబడ విడిచిన నోర్వమమ్మ!॥ 40

క॥ అన్ని పెల్లారడిఁ బెట్టినఁ
గని, విస్మయమొంది, కృష్ణుఁగని సస్మితయై,
జనని గగుర్పాటొదవఁగ
వనితలఁ గలయంగఁ జూచి 'వంచన' యనుచున్॥ 41

ఉ॥ "గోపికలార! మీరిటులఁ గోపముతాపముతోడవచ్చి,యీ
పాపని, జన్నునేమఱని బాలుని, జారుఁడుచోరుఁడంచు మి
థ్యాపరివర్తనోక్తి నిటు లారడిఁబెట్టఁగఁ జూతురమ్మ! సం
తాపకరంబుగాదె తలిదండ్రులకీ కాత్మజునింద సేసినన్॥"42

క॥ "బిడ్డలఁ గాంచఁగ లేదో?
గొడ్డాండ్రో? నాదు ముద్దుకుఱ్ఱంగని చే
లొడ్డి మిగులదూఱెద రీ
జడ్డుగుణంబులనుమాని చనుఁడావలకున్"॥ 43

ఆ॥ "మగలయందుఁ గనలి, మగవారి ననలేక,
పొరుగుతల్లి కన్న బుడుతఁజూచి
తగుదుమనుచు వచ్చి తగవులాడఁగనౌనె?
జాణతనము లింకఁ జాలుఁజాలు"॥ 44

తే॥ "పసితనంబున నెపుడేని బాలకుండు
తిరిరి మీయిండ్లవరుస కేతెంచి యెదుట
నున్న తినుబండములఁగోరి తిన్న యెడల
నదురుబెట్టుడుగాక యీ యఱుపు లేల?॥" 45

క॥ అని వారిఁ బనిచి సుతుపై
ననురాగము ప్రబ్బికొనిన ననునయమతియై
చనుబాలాలుకఁగ వానిం
గని మూర్కొని చుంచుదువ్వి, కలఁకవాడమినన్॥ 46

ఆ॥ "కొంటెవాఁడు నీసుకొడు"కంచు దూఱి
వాడలోని గోపవనిత లెల్ల
మొనసి మదిమిఁగన్న ముద్దుబిడ్డఁడ నీవు
కొంటెతనము మానుకొనఁగదయ్య"॥ 47

క॥ అనిబుజ్జగించి లోనికిఁ
గొనిపోయి, జలమ్ముపోసి, గోపంచితముల్
మనసారఁ జల్లి, భస్మము
దొనకుచు మేనెల్లఁబూసె "ఛూః-ఛూః"యనుచున్॥ 48

ఆ॥ అవల గర్గమౌని యరుదెంచి, యాబాల
కృష్ణుపద్యమంబు నెదగ్రహించి,
యోగవిద్యఁ బలికి ప్రోత్సాహపఱచె, యో
గీశ్వరేశ్వరుఁడని యెఱిఁగి యెఱిఁగి। 49

క॥ ఆటపై శ్రీకృష్ణుం డు
త్కటముగఁ జెలరేఁగ క్షీరదధిభాండంబుల్
మటుమాయమయ్యె నతివలుఁ
గటకటఁబడి బెగ్గడిలిరి కష్టంబనుచున్॥ 50

సీ॥ గోపి యొక్కతె క్షీరకుంభంబు లేపొద్దు
రిత్తయుండుట కృష్ణకృత్యమనుచుఁ
గనలి యాదివస మేకాదశి యగుటచేఁ
బనులాపి ద్వారముల్ భద్రపఱచి

యుట్టిలోఁ గుండలుబెట్టి యుత్తిగ నడి
కప్పున కాయుట్టిఁగట్టి, యుంచు
కేమటియున్న వాఁడిలుసొచ్చునని గోడు
భయమున నితరభావములు మాని

తే॥ వీధిఁగాచుచు, నీనాఁడు విడువననుచుఁ
జింత సేయుచు, ధీరమై చీమ చిటుకు
మన్న భ్రమఁజెంది వెఱగొంది వెన్నుఁడనుచుఁ
గలువరించుడు మధ్యాహ్న కాలమయ్యె॥ 51

ఉ॥ అంతట దాహమేర్చినఁ బ్రియాసముఁజెంది జలంబుఁ గోరి యా
కాంతము హార్తమేయనుచుఁగాల్కడలించి సరిజ్జలంబుతో
గొంతుకఁదేర్చి, నెమ్మనను కొందల పెట్ట బిఱానవచ్చి య
త్యంతభయస్థయొకనె గృహంబున గోపక బాలబృందముఁ

సీ॥ పీటలు రోటిపై, బేర్చి దిట్టరియైన
వాని భుజంబులపైన నిలిచి
చిఱునవ్వు నవ్వుచు సెలగోల నొకచేతఁ
బట్టి యందనియట్టి యుట్టిఁగొట్టి
జెట్టియై యిట్టట్టు లుట్టితోనూఁగుచు
నంజలి వదనగహ్వరముఁజేర్చి
మోఁచేతులకుఁగ్రింద మసరిన చెలికాండ్రి
మన్నించి తత్క్రియామగ్నుఁడగుచు

తే॥ స్వయముగా బొజ్జ యెదుగ స్వభావయుక్తిఁ
దనివిఁ జెందని శుద్ధచైతన్యమూర్తి
కరుణ సపరివారముగ సాక్షాత్కరించె
నెలమిఁ బూఁబోఁడివ్రతము ఫలించెననఁగ॥ 53

మ॥ కని, లోవిస్మయమొందుచున్ భ్రమయుచుం గంపించుచున్ గోపి దాం
గను బట్టంగఁదలంచి ధైర్యమును జిక్కంబట్టి మెల్లంగ డా
సిన వీక్షించిదయాళుఁడామగువ శుష్కీభూతనేత్రంబులా
య్యనఁ బుణ్యామృతమాన నూఁదుచు నదృశ్యంబయ్యెఁ జిత్రంబుగాన్॥ 54

ఉ॥ "ఎప్పుడుచూచునో? గృహము లెప్పుడుచొచ్చునొ? యెట్లు పోవునో?
చప్పుడుగాదు, భాండములుఁ జక్కగనెప్పటియట్లయుండునే
మప్ప!" యటంచు నయ్యతివ లర్భకుఁ జేష్టల కగ్గలించి యా
'తప్పుడువాని' దల్లియును దండనసేయమిఁ గంటగించుచున్॥

శా॥ వాకిండ్లూడ్చుచు ముగ్గువెట్టుచుఁ బనుల్వాటించుచుం బాఁడుచున్
శాకాద్యన్నములేర్పరించుచు సఖీసల్లాపముల్ సేయుచున్
వీకన్నిద్రసుఖించుచుందిరుగుచున్ వీక్షించుచుం బల్కుచున్
నేకాగ్రస్థితిఁ బొందిరద్భుతముగా హేలావతుల్ కృష్ణుపై॥ 56

క॥ చిక్కియుఁ జిక్కని బాలుని
గ్రక్కునఁ బట్టంగలేక గాసిలి లోలో
నెక్కొను మక్కువఁ బొందిరి
యెక్కువదక్కువలు మాని యిందునిభాస్యల్॥ 57

మ॥ ఇటులచ్యుంగనలంచి తాభ్యుదయులై యిష్టానుసారంబుగాఁ
కుటిలత్వంబులువాసి సక్తలగుచున్ గోపాలదేవున్ విశం
కటవృత్తిం గదియంగఁజూడ 'ననహంకారోపదేశంబు' వి
స్ఫుటలీలుండయిచేసెఁగృష్ణుఁడుగడుంజోద్యంబుగా బాలుఁడై॥

మ॥ తనుమధ్యల్ వ్రతచర్యఁబూనివడుసన్ దాక్షాయణీదేవిలో
ననుసంధానము సేసిపాఁడుచు గృహీతాన్యోన్యహస్తాబ్జలై
యనివార్యంబుగ నేగియాయమునయందారూఢిమైఁజొచ్చిని
ర్జనతీరంబుననగ్నలై జలములన్ సంప్రీతిఁగ్రీడించుచోన్॥59

క॥ వారిజలోచనుఁడగు హరి
వారివిహారములఁ దేలు వారి వసనముల్
వారక వేచని దొంగిలె
వారు విహారములుమాని వారింపంగన్॥ 60

శా॥ "ఓరీ! కృష్ణ! యిదేమిరా? నిలువరా! యోషిజ్జనంబుల్ వడిన్
నీరంబుల్ సొరఁబొంచిచూచియిటురా నీకొప్పునే? వచ్చితే
నీరీతింగలవస్త్రముల్గొనుట మేలే? తెమ్ము మాచేలముల్
పారంజూఁడకుమంచివాఁడవుగదబ్బా! పెద్దప్రొద్దయ్యెడిన్'

క॥ "మీయమ్మతోడఁ జెప్పుదు
మోయీ! యివియేటిపను లయో! యిటురమ్మా,
మాయన్న! కోక లంది
మ్మా"-యని లజ్జించి పడఁతు లారట పడినన్॥ 62

శా॥ "ఏలా? కామినులార! లజ్జపడఁగా, నేలా చలం? బీజగ
జ్జాలంబెల్ల నశిత్య, మీతనువులిచ్ఛామాత్రదుష్టంబు, లిం
కేలా భ్రాంతి? జలంబులన్వెడలి రండిచ్చోటికిన్, వచ్చి, మీ
చేలంబుల్గొనఁడింతులార! శుభముల్ చేకూరెశిన్ మీఁదటన్॥

క॥ అని సిగ్గులపహరించిన
వసనములఁ బొరివోయి సతులు మఱల యశోదం
గని కృష్ణుదుడుకుఁదన మొ
య్యన నామెకుఁ దెలియఁజెప్పి యావురుమనినన్॥ 64

ఆ॥ సతియు వారిమాట సత్యంబుగానమ్మి
కినుకఁజూపి "నేడు కృష్ణుఁబట్టి
తగిన బుద్ధిసెప్పి దండింతుఁదప్పక
రామలార! సుగుణధామలార!"॥ 65

మ॥ అని యాకాంతలవీడుకొల్పి సుతునిం దాలాపముల్ నెమ్మనం
బునఁజింతించివిషాదమొందిమదిలో మూర్ఖించి, తామందపైఁ
జనబుచ్చున్ వలెనంచునాథుఁగని ప్రస్తావించి, గోపమ్మనం
దను నాయత్తముసేసె నొక్కసుముహూర్తంబందు
సోద్యోగయై॥ 66

ఉ॥ బల్లిదుఁడై ప్రభాతమున బాలకుఁ డావుల వెల్వరించుచుం
దల్లికి మ్రొక్కి, చల్ది నొకదండమునందుఁ దగిల్చి, నవ్వు శో
భిల్ల వ్రజాంగనాహృదయభేదకరైకమహోత్సవాంగుఁడై
యెల్లలుమీఱి గోగణము నెల్లెడలందునఁ గ్రుమ్మరించుచున్॥

చ॥ వరయమునానదీవిమలవారిపదంబులఁ డాసి తద్వనో
పరిగిరిభూము లెక్కుడుశుభప్రదమంచుఁ దలంచి, గోవులం
గరిశరభాది భీకరమృగంబులు లేని బయళ్లయందు బం
ధురగతి మేపఁగా దొడఁగెఁ దుష్టిగఁ బచ్చిక లొప్పమీఱఁగన్॥

క॥ యదుకులభూషణుఁ డగు హరి
సదములతీరములఁ జొచ్చి చనువున మేపన్
మొదవులు పుష్కలముగఁ బె
న్బొదుగులఁ బాల్గురిసె నూత్నభూతిం బ్రీతిన్. 69

ఉ॥ అక్కడ నావ్రజాంగన "లహా! యిఁకఁ గృష్ణుఁడు దూరమయ్యెనే
చక్కని మోమువాఁడు, రుచిసంపద లొప్పిన మేనువాఁడు, చేఁ
జిక్కక జాఱిపోయి యొక సెక్కెములాడెడువాఁ డటంచుఁ బెం
దిక్కును బొందిరోలి; నుపదేశమహత్త్వము నూనమై చనన్--

శా॥ తన్నే పల్కుచుఁ బాడుచుం దలఁచుచుం దర్కించి
చింతించుచున్,
నన్నారుల్ బగలెల్లఁ బోమఱచి సాయంకాలమైనంతఁ దా
మెన్నెన్నో తినువస్తువుల్గొని ప్రియం బెపారఁగాఁ బోయి 'మా
వెన్నుం డెక్కడ నే? యశోద!' యని యన్వేషింతురుద్విగ్నలై

సీ॥ కృష్ణవేణి యొకర్తు కృష్ణదర్శనమహో
త్కంఠయై ప్రొద్దు గ్రుంకకయమున్నె
చకచకఁ బనిఁజేసి సంధ్యఁ జీఁకటిరాఁగ
వత్తిని వెలిగించి తెత్తుననుచుఁ
దిన్నగాఁ గృష్ణమందిరముఁ బ్రవేశించి
వత్తిముట్టించుచుఁ జిత్తమలర
నందనందనుని యాననము వీక్షించుచుఁ
దత్పరచిత్తయై తడవుసేయ

తే॥ అత్త చూచిచూచి యాగ్రహమొంది, గో
పమ్మయింటి కరిగి సెమ్మెయొద్దఁ
జెయ్యిఁ గాల్చుకొనెడి చిన్నకోడలిఁ జూచి
యాగ్రహంబుమాని యార్తిఁ బొందె॥ 72

క॥ దినదినప్రవర్ధమానమ
యిననిష్ఠామహిమకతన నిందుముఖులు ప్ర
న్నన గృహకార్యంబులయం
దనాదరము గలిగి మఱచి రఖిల జగంబుల్॥ 73

మ॥ రమణుల్ గోపకుమారకుల్ సెలఁగి బాల్యక్రీడలం దేలుచో
యమునారణ్యమునన్ బలానుజుఁడు సోహంభావముం బూనిమే
మమకారంబులఁ బోకదీక్ష మెఱయన్ మానంబు వాటించి, యో
గముఁ బ్రారంభము సేసె వేడ్కమెయి గర్గప్రోక్తమార్గంబు
గన్॥ 74

తే॥ పొన్నవృక్షంబుక్రిందఁ జిన్ముద్రతోడఁ
బెలఁగు పద్మాసనమున రేచించి, పూర
కంబున హృదయబృందావనంబులో న
పానయమునా[1]ప్రవాహముఁ బట్టిచనుచు॥ 75

తే॥ ఒనర నామీఁద దుర్వారఘనతరంగ
సంగతోత్తుంగమగుచుఁ బ్రచ్ఛన్నభుజగ
మానితాధారమగు నిండుమడుఁగు దఱిసి
సరస నొక్కెడిసాన నిశ్చలత మెఱయ॥ 76

సీ॥ పట్టుపుట్టము మొలచుట్టుఁ జక్కఁగఁ గట్టి
దీర్ఘశిరోజముల్ దిటవు పఱచి
హారావళులఁ గంఠమందునఁ గీలించి
బర్హిపింఛము మౌళిఁ బాదుకొలిపి
పైవస్త్రమును గ్రిందవైచి నేరుపుమీఱఁ
గాయమధ్యమమును గళము శిరము
నిక్కించి బాహువుల్ నిగిడించి తొడరి యు
ద్రేకించి మది హుంకరించి మించి
ఆ॥ ముక్కు మూసిపట్టి ముప్పొకలాఁ దూఁది
మడువులోనదుమికి మహితవృత్తి
నలపుసొలపులేక వలయముల్ బచరించె
వింతయీఁతతోడఁ గొంతతడవు॥ 77

1. గంగా, యమునా, సరస్వతీ యని ఇడా పింగళా సుషుమ్నా నాడులకు పేర్లు.

శా॥ కల్లల్గాక యథేచ్ఛఁ దొల్లి కమఠగ్రాహాదిరూపంబులం
జెల్లాటంబుగ నీఁదు నేర్పుకలిమిం జెన్నారి శ్రీకృష్ణుఁ డ
త్యుల్లాసంబునఁ బీచుఁడై బహుళవాయుస్తంభనల్
సేయుచుం
గల్లోలంబొనరించె నామడుఁగుఁ బ్రాగ్భ్యక్రియాస్ఫూర్తి
తోఁ॥

క॥ లోపలి చేతననిచయము
లోపమిగా హృదముఁ గలఁచి యుగ్రస్థైర్యా
టోపమున నడుగునకుఁ జని
ఝోపునఁ గుండలినిఁ దన్ని హేలాగతుఁడై॥ 79

సీ॥ లలితాజపామంత్ర మలఘునాదముగాఁగ
సకలేంద్రియములు ప్రేక్షకులుగాఁగ
బహుళనాడీధ్వనుల్ ప్రథితవీణావేణు
శంఖమృదంగనిస్వనముగాఁగఁ
బటుకుంభితోదగ్రపవనఝంపాధ్వనుల్
గ్రమముగాఁ దాళశబ్దములుగాఁగ
నిర్మలానందాంబునిధియైన బ్రహ్మనా
ళము భవ్యనాగస్వరంబుగాఁగఁ
తే॥ ద్రిజగదభినవసౌభాగ్యరేఖ వెలయ
నంబుజాధారపల్వలాభ్యంతరమునఁ
జిత్రనటనుండు గోపాలశేఖరుండు
నృత్యమాడె నిమీలితనేత్రుఁడగుచు॥ 80

క॥ ఆవిధ మావరణంబుల1
కావలఁ గాఁబోవు నెడ సహస్రాక్షుని చే2
గోవులు బెజడిఁగొని తఱఁబడ
గోవర్ధనబిందు4 వెత్తె గోవిందుండై॥ 81

మ॥ ఘనుఁ డా కృష్ణకుమారకుం డిటు లవక్రప్రక్రియారంభుఁడై
వనమధ్యంబును జేరి దీర్ఘగమనాస్వస్థాంగుఁడై విశ్రమిం
చిన నాలో మృదుశబ్ద మొండు నెయిదిం జిత్రంబుగా
మ్రోగుచుఁ
వినరా మేల్కొని యాలకించె నచలాబ్ధి న్నైకధీభాసుఁడై॥82

సీ॥ ఎలమిఁ జిణీస్వాన మెఱిఁగి, యంతఁ జిణిచి
ణీనిస్వనము నేర్పుతో నెఱింగి,
క్రమముగా ఘంటారవమును గుర్తించి, శం
ఖనినాదమును జక్కఁగా గ్రహించి,
వెలయు వీణాతాళవేణునాదంబు ల
త్యంతభద్రార్థుఁడై యాలకించి,
యలఘు భేరీమృదంగారావములను నే
ర్పుఱిచి, మేఘధ్వని నెఱిఁగి, యనుప

=సుషుమ్నానాడియందలి చక్రములు (లేక) ఎల్లలు.
=వేలకొలది సాకల్పములను కన్నులు గలిగిన మనస్సు (లేక) దేవేంద్రుడు
=గో:-అనగా యింద్రియములు
=ఇంద్రియప్రవర్థమానమైన రేతోబిందువు

తే॥ మౌన నాదం "అ" కారంబుగాను, విమల
బిందువు "ఉ" కారముగను గావించి, తనరు
కళ "మ" కారముగాఁగ హృత్కమలమందు
ఘనతరోంకార మరసి లక్ష్యంబు సేసె॥ 83

శా॥ జ్ఞానానందమహత్స్వరూప రుచిరోంకారంబు నిట్లెంచి తద్
ధ్యానాకర్ణనయుక్తి భేదములచేతం దచ్చి యోగీంద్రుఁడై
నానాస్థావరజంగమప్రతతులం దన్వించి విశ్వానుసం
ధానోద్వేలమహాసుఖంబుఁ గనెఁ దత్త్వజ్ఞానసంపూర్ణుఁడై॥

క॥ ధీరుఁడు శ్రీకృష్ణుఁ డహం
కారము నాశంబు సేయగాఁ దనువున నోం
కార రవ మెఱుఁగఁ బడు నని
పేరెన్నికఁ దాల్చె నంతఁ బిల్లనగ్రోవిన్॥ 85

మ॥ ఒకనాఁడాయదువంశమండనుఁడుధ్యానోద్దీప్తి మైఁ బొంగి గా
యకుఁడై బ్రాహ్మముహూర్తకాలమున బృందారణ్య మధ్యంబునం
బ్రకటస్ఫూర్జితగాత్రుఁడై మురళిఁ గేలం దాల్చి పూరించుచోం
డ్రోకగీతంబును బాడెనద్వయరసంబాప్పం బ్రభూతంబుగాన్

సీ॥ చెలఁగి నాడీధేనువులు మోదమును జెంది,
తన్మయత్వముఁ బొంది, ధన్యమొందఁ;
జటులతర ప్రాణసర్పరాజంబులు
వశ్యమై, కడుఁ బారవశ్యమొంద;
వరబ్రహ్మదండి తామరసషండంబు లం
దంబులై, ఘనవికాసంబునొంద;
హాళి దేహజగత్త్రయంబు లానందించి
సుఖమొంది, దీర్ఘసుషుప్తిఁ జెందఁ;
తే॥ దన యిడాపింగళాకరద్వయమునందు
ఘనసుషుమ్నా మురళి ముద్దుగారఁ దాల్చి
హృదయబృందావనమున జీవేశ్వరుండు
గాన మొనరించె ననఁగ నోంకారమొప్ప॥ 87

క॥ నవరంధ్రాన్వితనాళం
బవిరళ సిద్ధాంగుళీవిహారోజ్జ్వలమై
పవనప్రసరోదంచిత
రవంబు దశగతులఁ బటుతరంబుగఁ బఱవన్॥ 88

తే॥ తేనెవాఁకలఁ బఱతెంచు తేంట్లువోలెఁ
బూర్వజన్మానుభవమైన బోధగదుర
విమల విజ్ఞానజనకమౌ వేణురవము
కర్ణపుటములసోఁక నాకాంతలెల్ల॥ 89

ఉ॥ “ఈవరశబ్ద మీస్వరము నీకళ లెన్నఁడొ వింటి” మంచు సం
భావనసేసి తత్స్వరము భాగవతార్ద్రసమృద్ధనాదమున్
వావిరిగుర్తెఱింగి, తనువాసనలం దెగఁగోసి, యద్వయ
శ్రీవిలసిల్ల గానలహరీమహితాంబుపధోన్ముఖంబుగన్॥90

శా॥ స్రస్తాకంపిత కేశపాళికలతో స్వస్థానముల్ వాసి, యే
ప్రస్తావంబులఁబోక, భర్తృజనులన్ భావింపఁగా లేక వ్య
త్యస్త శ్రీచరణారవిందు నెదలోదర్శించి, భ్రాంతాత్మలై,
హస్తాహ్వానము సేయుచుం జనిరి “కృష్ణా!” యంచు
నయ్యామినిన్॥ 91

మ॥ చని, డాయంగని, భామినుల్ ప్రణతలై సాక్షాత్కృతున్
మాధవున్
జనితోత్కర్షమనస్కలై ప్రవిమలోత్సాహాత్మలై కూడి, పా
యనిభక్తిన్ స్తుతిఁజేసి యత్యలఘునిత్యాత్మానుసంధానయో
గనిరూఢత్వమొసంగవే! మముదయాంగాంక్షించిరక్షింపవే!

ఆ॥ అని సభక్తికముగఁ బ్రార్థింపఁ గృష్ణయో
గీశ్వరుండు భువనహితుఁడు మిగుల
సంతసిల్లి యాత్మసందర్శనంబును
గలుఁగఁ జేతు ననుచుఁ గరుణఁ జేసి॥ 93

తే॥ గరుడ గంధర్వ కిన్నర సుర మునీంద్ర
సంఘముల కెల్ల మంగళాస్పదమగుచును
జెలువుమీఱెడు తన యాఱుచేయిఁ జాచి
హస్తమస్తకసంయోగ మపుడు సేసె॥ 94

క॥ మాధవుకరసంస్పర్శన
బోధితలై పూర్వకర్మపుంజము లెడలన్
సాధనలేకయ కాంచి ర
సాధారణమైన యాత్మసాక్షిత్వంబున్॥ 95

క॥ సత్యంబై, సుజనముని
స్తుత్యంబై, నిగమమూలసూత్రార్థంబై,
నిత్యంబై, సద్యోగ
ప్రత్యక్షంబై వెలుంగు పరము, ననంతున్॥ 96

తే॥ సగుణనిర్గుణమయు, శుద్ధసత్త్వరూపు
నజరు నక్షరు నచ్యుతు నచలు నమలు
గూఢుఁ జిద్రూపు నిత్యు నంగుష్ఠమాత్రు
నవ్యయానందుఁ బరిపూర్ణు నంతరాత్ము॥ 97

క॥ అధ్యేయు నాద్యు నవ్యయు
నధ్యాత్ము నగోచరుం బరాపరశక్తున్
మిథ్యాగుణు నిన్ సుమనో
మధ్యస్థుం గాంచి యధిక మహిమోన్నతలై॥ 98

సీ॥ జయజయసర్వేశ! సకలభూతములకా
ధారుఁడవగుచు హృద్వనజకర్ణి
కాంతంబులం దంతరాత్ముండవై యుండి
కర్తృత్వ భోక్తృత్వ కర్మఁబొరయ
కఖిలేంద్రియద్రష్టవై యొప్పు నిన్నన్య
థాకరించితిమి ప్రధానపురుష!
యహహా! మాగోవు లాయాదవుల్ నంద య
శోదాదు లేము మత్సుతులుఁ బతులుఁ
తే॥ గా సమస్తము నీవనాఁ గంటి మిప్పు
డిట్టి విజ్ఞానచక్షువు నెల్ల ప్రొద్దుఁ
గలుగ వరము బ్రసాదించి కరుణఁ జూడు
మచ్యుతా! నంత! హరి! పరమాత్మ! కృష్ణ!॥ 99

ఉ॥ నీవు యశోదసూనుఁడవె? నీరజనాభ! చరాచరాత్మలో
కావళి కెల్ల నాశ్రయుఁడ వారయ వేదమయుండవీవు,తం,
గావుమటంచు మున్ధరణి గాసిలి ప్రార్థనఁ జేసియుండుటన్
నీ విటులుద్భవించితివి నేఁడు జగంబుల నుద్ధరింపఁగన్॥ 100

క॥ అని బ్రహ్మానందము నొం
ది, నెతినమస్కృతులొనర్చి, దృఢచిత్తములన్
ఘనముగ నాభగవంతుని
గొనియాడి రనంతనామ గుణరూపములన్॥ 101

క॥ గరుఁడని పరుఁడని హరుఁడని
వరుఁడని ప్రణుతించి నయనపంకజముల నా
వరదుని గృష్ణబ్రహ్మము
సరోజలోచనలు పూజ సలిపిరి ప్రీతిన్ ॥ 102

తే॥ ప్రేమమీఱఁగ భక్తిమైఁ బ్రీతివుట్టి
విభవుఁ బ్రత్యక్షుఁ దిలకించి వివశలగుచు
నెత్తుకొని ముద్దుఁగొని ముదంబెసఁగఁ జాలఁ
"గౌఁగిలించిరి గోపికల్ గానలోలు"॥ 103

చ॥ అనవరతానురక్తి హృదయంబులఁగృష్ణుని బాయలేమి మా
నిను లనవద్యమవ్యయమనింద్యమఖండమబోధ్యమచ్యుతం
బనఁదనరారు నిర్గుణము నాత్మలఁ గాంచియు భక్తిఁబూని నె
మ్మనములలోన నాయదుకుమారునిగొల్చిరి
దేవదేవుఁగన్ ॥ 104

క॥ వెన్నుని సుస్మితవదనుఁ బ్ర
సన్నుని మురళీవినోదు సర్వాత్ముని నా
పన్నలయి కదియఁ బోవుదు
'రన్నా!ర' మ్మనుచుఁ దోయజాస్యలు ప్రీతిన్ ॥ 105

సీ॥ కృష్ణుఁడా! రమ్మని కేలిసేయుచు నొక్క-
జలధరకచభర జలకమార్చుఁ
బురుషోత్తమా!యని ముద్దుసేయుచు నొక్క-
యంబరమధ్య వస్త్రంబుఁగట్టు

నగధరా! యని యొక్క నవనీతహృదయ మేల్
వెన్న ముద్దలను నైవేద్యమిచ్చు
మాధవా! యని యొక్క మలయజగంధి శ్రీ
చందనం బలఁదు వక్షంబునందుఁ
తే॥ ప్రియమెసఁగఁ బల్లవాధర విడియ మొసఁగు
మాల లలినిడుఁ గుసుమకోమలి గళమున
రత్నకంకణ మంగళారతిని బట్టు
మేటి కలకంఠి యంకించి పాటఁబాఁడు॥ 106

ఉ॥ తమ్ము నెఱుంగలేక తమ తల్లులఁదండ్రుల నత్తమామలన్
బమ్మెరవోవ భామినులు బాలురఁజూచి యప్పుడెల్ల నే
మమ్మనఁ గృష్ణుఁడంచును గ్రిమమ్మన నాప్రభుఁగాంచి
రెల్లరూ
పమ్ములఁ బుత్రులం బతుల భ్రాతృజనంబుల బంధుమిత్రులన్

తే॥ పరమమైన పరాభక్తిఁ బ్రమద లఖిల
జగము శ్రీకృష్ణమయమని సంగ్రహించి
సచ్చిదానందపరమహంసల వడువున
జడతమిాఱి చరించిరి సగుణమందు॥ 108

ఉ॥ మాపటి వేళలందు వనమార్గములన్ హరి వేణుగాన మా
లాపము సేయుచో గృహకలాపములన్ మఱరోసి కృష్ణుఁడే
ప్రాపనిడాసి, తత్పరను పావన గానసుధారసాంబుధిం
దాపముదీఱఁ గ్రుంకులిడి తన్మయలయ్యెద నంగనామణుల్

మ॥ వనితల్ మన్మథకేళికిన్ నిజపతుల్ ప్రాపించినం జూచి తా
రని గుర్తింపఁగలేక కృష్ణుఁడని యువ్యాజానురాగంబుతోఁ
గనుచుంబల్కుచు నవ్వుచుం బెనఁగుచుం గందర్పలీలాతరం
గనికాయంబుల నోలలార్చెదరుతత్కాంతారభాగంబులన్

క॥ వేదార్థప్రతిపాదిత
నాదమధురసంబుఁ ద్రావి నారీమణు లు
న్మాదోద్ధతిఁ గ్రీడించిరి
నాదబ్రహ్మైకరతి సనాథోత్సుకలై॥ 111

మ॥ తమ జీవేశ్వరు లింతలో మఱలినన్ దందహ్యమానాంగలై
యమునారణ్యనికుంజపుంజముల మాయాకృష్ణునిన్ రోయుచుం
దమలోనొండొరులన్ భ్రమించుచు యశోదానందనుం
బొన్నభూ
జముపొంతంగని డాయఁబాఱుదురు చంచత్కాంతితోఁ
గామినుల్ ॥ 112

క॥ లీలామానుషవిగ్రహుఁ
డా లలనాజనముఁగూడి యస్ఖలితవిధిన్
హేలాగతిఁ గ్రీడించుచు
లీలలఁ దాఁ దేలి యొప్పె లీలాత్ముండై॥ 113

మ॥ పొదరిండ్లం బులినస్థలంబుల లసద్భూమీరుహచ్ఛాయలం
బదునాఱ్వేలసతీలలామ లనువొప్పన్ దాస్యముల్సేయ 'నీ
యదుశుభ్రాంశుని తేజముం గన నశక్యం బింక మీఁ'' దంచు వె
ల్లదనం బొప్పఁ బలాయితుండగును దారాకాంతుఁ
డశ్రాంతమున్॥ 114

ఉ॥ అందఱకన్ని రూపములనాడుచుఁ బాడుచు బోధసేయుచున్
నందఱియందు సర్వసముఁడై విలసిల్లుచు వ్రేతలన్ మహా
నందరసాబ్ధిఁ దేల్చి భవనాశకుఁడై తఱియింపఁజేసెఁ దా
నందఱి, నందునింటి శిశువై చెలియై గురుఁడై
కుమారుఁడై॥ 115

క॥ మంగళము రుక్మిణీధవ!
మంగళ మవతారపురుష! మధురావాసా!
మంగళము పాపహరణా!
మంగళ మఖిలాగమప్రమాణధురీణా! 116



1. తాత్పర్యము:- త్రేతాయుగమున నొకపాదము ధర్మము నశించునన్నట్లుగా నంతదనుక సత్ప్రవర్తనగలిగి యున్న రాక్షసులు గొప్పగొప్పవరములను బొంది యున్న వారలై, మదించి, ముల్లోకములందలి ప్రజలను నానాహింసల బెట్టుచుండగా ఆబాధలు పడలేక దేవతలు సృష్టికర్తయైన బ్రహ్మదేవు నొద్దకు బోయి రాక్షస నాశమునకు బూనుకొని తమ్ము గాపాడవలసినదని ప్రార్థించిరి.

2. తా॥ బ్రహ్మదేవు డాదేవతల మొఱయంతయు సావధానముతో విని రణశూరులైన రాక్షసులను జయించుటకు దనకు యుద్ధనైపుణ్యము లేదని విచారించి, పురాణపురుషుడును నవాఙ్మానసగోచరుడునైన ఆ అఖండ పరిపూర్ణసచ్చిదానందస్వరూపమగు పరబ్రహ్మమును దనహృదయమునందు ధ్యానించెను.

3-4. తా॥ అప్పు డొకశబ్ద మభయమిచ్చుచు నారాక్షసులు వరబలముచేతబిచ్చలించియధర్మపరులైయన్యాయముగాలోకులను హింసించుచుండిననూ, వారి వారి పాప కర్మ పరిపక్వముగాలేదనియు, అట్టికాలమే సమీపించిన శీఘ్రముగా దనమాయాధర్మమైన కర్మసూత్రప్రకారముగా స్వయముగా దానే వారిని నశింపజేయ గలవాడననియు, కావున నా దేవతలు నిశ్చింతగా

నుండవలసినదనియు, ఆబ్రహ్మదేవున కాత్మనిష్ఠలో స్ఫురించి, ఆదేవతలకును వినిపింపగా, వారందఱు సంతోషించి బ్రహ్మలోకమునుండి మఱలి నిజస్థానము లకు వెళ్ళిరి-

## వివరణ:-

భగవంతుడు సర్వాంతర్యామియయ్యు జీవుల పుణ్య పాపకర్మవిషయములో దాను గర్త కాడు. జీవుడు భగవంతుని యొక్క అంశయేగావున ఆపరబ్రహ్మమువలెనే తానుగూడ స్వతంత్రమైనశక్తి గలిగియున్నాడు. కావున జీవులుదాము సంకల్పించి చేయు కర్మయే, వారివారికి కాలపరిమాణములో దప్పక ఫలించి సుఖదుఃఖరూపముగా సిద్ధించుచున్నది. కాని సహజముగా నొకజన్మలోని కోరిక వేఱొకజన్మలో బక్వమై లభించుటచేత, అప్పుడది సుఖదాయకముగాక ప్రతిబంధకముగా నేర్పడుటయు దటస్థించుచున్నది. ఉదహరణముగా నొక భాగ్యవంతుడు మొదటిజన్మలో సంతానములేక కోరికొనియుండుటచేత రెండవజన్మలోగాని మూడవజన్మలోగానియాసంతానము గలుగవచ్చును. కాని యాజన్మలో దాను గర్భదరిద్రుడై యుండును- ఎందువల్లననగా, దా నా పూర్వజన్మలో సంతానమొక్కటియే గోరెనుగాని ధనముగూడ గోరియుండలేదు. కనుక ఆమఱుజన్మలో దనకు సంతానముమాత్రమే కలుగుచు, దరిద్రుడుగానే పుట్టుచున్నాడు. అట్లు దుఃఖభాజనముగా సంభవించిన ఆజన్మయందు, మఱల, ధనములేదని ధనమొక్క

టిమే గోరును గాని, సంతానము మాట కోరుటకూడ సంభవిం
పదు. ఆరీతిగా కోరికలపసవ్యములై దుఃఖకారకములే యగుచు
వాటి ననుభవింపవలసిన బంధనముతో జన్మలను బెంచుచు
న్నవి. అట్లు కర్మబీజము వృద్ధిబొందకయే, కోరిక పుట్టినతో
డనే ఫలించవీలులేనట్లు, కాలపరిణామముతో గర్మపక్వమై
వచ్చునే దేవతలు దన్ను బ్రార్థింపకపోయిననూ భగవం
తుడు స్వయముగానే దుష్టశిక్షణ జేయుననుట కర్మసూత్ర
లక్షణమైయున్నది. ఇందులకు ప్రమాణము శ్రీమద్భగవద్గీత
యందలి భగవానువాచ:-

పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥

౨. తా॥ అట్లు క్రూరులైన రక్కసులు దమ్ము వివిధప్రకార
ములు హింసించుచుండగా నాబాధల కోర్వలేని దేవ
తలు మొదలైన ప్రజలు దమ తమ హృదయములలో
ఆరాక్షసులను దూషించుచుబోగా ఆదూషణములను
వారిచిత్తవృత్తులు సత్త్వగుణప్రధానులైన జీవుని
యొక్క కోరికలుగావున వృధాగా నశించిపోవీలులేక
కర్మసూత్రము ననుసరించి సృష్టికారణమైన ప్రకృతి
ధాతువుతో గలిసి పరిణామముబొందుచుండెను.

## వివరణ:-

ఇది అవతారలక్షణము. అసలు భగవంతుడఖండనిర్గు
ణసచ్చిదానందమయస్వరూపమని శ్రుతులు సెప్పుచున్నవి.

అట్టి అఖండమైన పరబ్రహ్మము ఖండమగుటకాని, నిర్గుణము సగుణముగా మారుటకాని, యన్యోన్యవిరుద్ధము. జీవాత్మస్వరూపవిషయమై కూడా ఆ యఖండపరిపూర్ణపరబ్రహ్మము దన మాయయైన మూలప్రకృతియందు ప్రతిబింబము నొంది,అద్దములోని సూర్యబింబమువలె పరమాత్మని అంశమై జీవుడని వ్యవహరింపబడుచు, సత్తు- చిత్తు- ఆనందమను భగవల్లక్షణములే స్వరూపముగాగలిగి క్రీడించుచున్నాడని చెప్పబడియున్నదిగాని ఆ యఖండస్వరూపము ముక్కలు ముక్కలుగా జెదిరిపోయి యీ నానాజీవులైరని యర్థవాదము లేదు. సృష్టిపరిణామమునందు నద్దమువంటి ప్రకృతియే తునకలు తునకలై యసంఖ్యాకములగు ప్రతిబింబములను జీవులను గల్పించుచున్నది. అయితే అవతారమనున దట్లొక సామాన్యజీవుడుగా బరిగణింపబడ వీలులేదు. శ్రీమద్భగవద్గీతలోగూడా దానే ప్రతియుగమునందు నవతరించి ధర్మసంస్థాపన జేయుచుంటినని భగవంతుడు స్పష్టముగానే చెప్పికొనియుండెను. ఇది సూక్ష్మగ్రాహ్యము. ఎట్లన:- ఒక బలవంతుడకారణముగా నొకదుర్బలుని బీడించును. ఆబలహీనుడు సేయునదిలేక ఆ బలవంతునిపై వ్యసనపడి తన మనములో దూషించికొనును. ఆ దూషణములను చిత్తవృత్తులు జీవాత్మయొక్క స్వయంశక్తి ప్రధానములుగావున ఆబలశాలివైపు ప్రసరించును. ఆబలవంతు డట్లు గ్రమేణ ననేకదుర్బలులను హింసించుచుపోగా, వారివారియొక్క చిత్తవృత్తులుగూడా నల్పశాపములై ఆదుర్మార్గుని నావరించును. ఆప్రకారముగా ఆబలవంతునితో సమానమైనశక్తి సమకూడువఱకు నానా

జీవుల యొక్క లక్షలకొలది చిత్తవృత్తులు ప్రకోపించి గుమిగూడి ఆవరించికొనుచు నేకీభావమునొందును. అట్లు తగిన శక్తివంతముగాగా, ఆధాతువు దట్టమై సంకర్షణబొందుచు, బీజమై సాకారముగా ప్రభవించి తనకర్మవృత్తమైన క్రియాపరిష్కారమునకు వేచికొనియుండును. అట్లనేక కోట్లకొలది జీవాత్మలయొక్క అంశలు గూడి యొకే తేజముగా జనియించుటచేత ఆవ్యక్తియొక్క చిత్తప్రకృతి సహజముగా అమానుషమైన శక్తికలిగియున్నదై, సామాన్యజీవుడని గణింపబడ వీలులేక, అవతారపురుషుడనియే ఆమోదింపబడుచున్నాడు. అట్టి అవతారపురుషుడును దన కర్మయోగమంతయు నివర్తించికొనుచు, సులభముగా జ్ఞానముగూడా సంపాదించికొని, తదనుసారముగానే జన్మసంస్కారము బొందుచున్నాడనుట ధర్మసూక్ష్మము.

6. తా॥ క్రమక్రమముగా ఆచిత్తవృత్తు లమోఘములై యేకీభవించి, నీరు ఆవిరిగామారి వర్షమేఘమైనట్లు, ఘనీభవించుచు బరిణామమునొంది సత్త్వగుణప్రధానమైన తేజోవిశేషముతో నీలవర్ణముగా మాఱుచుండెను.

వివరణ:-

మహాతేజమైన ప్రకాశము దృగ్గోచరమగునపుడు నీలవర్ణముగా గనుపించును. ఇందుకు దార్కాణము ఆకసమునందు సూర్యరశ్మి. ఎండయొక్క తీక్ష్ణముగానుండు మిట్టమధ్యా

హ్నకాలమున ఆరశ్మి నీలముగానుండి, సాయంప్రాతః కాలములందు బ్రకాశముదక్కువకాగా వివిధరంగులతో కన్పించుచున్నది. అకారణముచేతనే జ్యోతిర్మయమైన జీవాత్మపరమాత్మలకు నీలవర్ణ ముపాధిగా చెప్పబడియున్నది. అట్లా వర్ణమును జలాశయముగా నన్వయించి శ్రీమన్నారాయణుడు అనగా నీటియందు వసించినవాడనియు బ్రతిపాదింపబడియున్నది.

7. తా॥ అట్లు కోట్లకొలది దేవతాజనులయొక్క యంశలు గలిసి ఒక మహాతేజముగుచు నావిధముగా సృష్టివెచిత్ర్యము బొంది జీవస్వరూపమై దేశకాలపాత్రానుసారముగా భూలోకమున బుణ్యాత్ముడగు దశరథమహారాజుయొక్క పట్టమహిషియైన కౌసల్యాదేవికి బుత్రరూపమున ఆవిర్భవించెను.

8 తా॥ అట్టి సమష్టిశక్తియైన ఆశిశువు తనయొక్క మహాతేజ మెక్కుడు బ్రకాశమానముగా వెలుగుటచేత శ్రీయనియు, దనచైతన్యరూపమైన ఆత్మలీలలు మనోరమ్యమై చూపఱులనాకర్షించుటచేతరాముడనియు, చంద్రబింబమువంటి తేనముఖకాంతులు జంద్రకిరణములవలె హృదయానందకరముగా నుండినందున చంద్రుడనియు, సార్థకపదములతో "శ్రీరామచంద్రమూర్తి" యని వ్యవహరింపబడెను.

9. తా॥ తరువాత శ్రీరామచంద్రుడు పెరిగి పెద్దవాడై తన క్షత్రియ ధర్మము ననుసరించి రాక్షససంహారమను దుష్టశిక్షణము గావించుటకై దండకారణ్యము చేరెను.

10. తా॥ ఆ దండ కారణ్యమునం దొక్కచోట జ్ఞానులును, వైరాగ్యవంతులును, శాంతులునునై నసంయమీంద్రులు గూడ నెల్లప్పుడు భగవద్ధ్యానతత్పరులై యుండిరి.

11. తా॥ అట్టియెడ ఆశ్రీరామచంద్రు డొకనా డొకముని పల్లె సమీపించి యంతనసమావేశమైయున్న మునికూటములోనికి ప్రవేశించి వారికందఱకు దనజగన్మోహనమైనసౌందర్యముతో నేత్రపర్వమొనరించుచు, నక్షత్రరాశి నడుమనున్న నిండుచంద్రునివలె తేజోమూర్తియై ప్రకాశించెను.

వివరణ:-

భగవంతుని యొక్క యన్నిఅవతారములలోను శ్రీరామావతారమేయనన్యమైన రూపలావణ్య విభ్రమములుగలిగి మిక్కిలి సౌందర్యవంతమై యుండెనని చెప్పబడియున్నది.

12. తా॥ తొలకరిమబ్బువంటి మెఱుగుగల నీలవర్ణమైన శరీరచ్ఛాయయు, పదునాలుగులోకములను సంకల్పమాత్రముచే బుట్టించు గంభీరమైన నాభిస్థలమును, విశ్వమంతయు ప్రకాశింప జేయు సూర్యచంద్రులవంటి నేత్ర

ద్వయమును, లక్ష్మీదేవి కాటపట్టయిన విశాలమగు వక్షస్థలమును, మిగులసన్నమైన నడుమును, గలిగి, యేనుగుగున్నవలె ఠీవిగా నడచుచు రూపలావణ్యతేజో విశేషములచే బురుషులనుగూడా మోహింపజేయు సౌందర్యమూర్తియైన ఆ శ్రీరామచంద్రుని,—

13. తా॥ ఆ మునీశ్వరులు కనుఱెప్ప లార్పకుండగా జూచి చూచి, తనివిజెందక, పులకాంకితులై, తదేకదృష్టితో నివ్వెఱబడి లక్షించుచుండిరి.

14, 15. తా॥ అప్పుడాశ్రీరామచంద్రమూర్తియొక్క ఆనీలవర్ణమైన దేహచ్ఛాయయు, ఆఎత్తైన విగ్రహసౌష్ఠవము, ఆమోకాళ్లనుదాకు పొడవైనచేతులు, ఆ చెవులు కన్నులు భుజములు ముఖము కంఠము నాభి పాదములు, దక్కగల నడుము తొడలు వక్షస్థలము మొదలైన ప్రతియొక్క యవయవము మనోరంజకములై మన్మథునిబాణములవలె గాఢముగా మనస్సుల నాటుకొనగా ఆమునీంద్రులు చలించి భ్రమించి చిత్తవైకల్యము నొందినవారలై విరహముజెందిన స్త్రీలవలె ఆయవతారపురుషుని మూర్తివైభవము నొక్కట నాలింగనముసేయ గుతూహలపడిరి.

16. తా॥ అంతలో ఆశ్రీరామచంద్రుడును దమవలెనొకమగవాడే కదా యనియు, వగుబాటుసుమా యనియు,

తడబడుచు, సంబరపడుచు, ఒకరిమొగమొకరు చూచి కొనుచు, ముచ్చటపడుచు, తమలోదా మిట్లని తలపో యజొచ్చిరి.—

17. తా॥ అక్కటకటా వానప్రస్థాశ్రమవాసులమై యరణ్యముల నివసించుచు, నీవారధాన్యముతో పొట్టపోసికొనుచు ననేకసంవత్సరములనుండి బ్రహ్మచర్యదీక్షవహించి యింద్రియజయముగలిగి జీవితమునందుగూడా విసుగుజెందియున్న మాబోటి తపస్సంపన్నులనే యీ పురుషు డొకడీరీతిగా మోహింపజేయుచున్నాడు గదా!

18. తా॥ అయ్యయ్యో! కేవలమైన నిర్వికల్ప సమాధినిగూడా సాధించుచు, మనస్సును బుద్ధిని జిత్తమును లయమొనరించి, ద్వంద్వాతీతమైన అమనస్కయోగ మనుభవించుచుండిన ఆత్మ సంచలించిన మాతపశ్శక్తియంతయు గూడ నేడు వృథామైపోవును గదా!

19. తా॥ ఆ సచ్చిదానందపరబ్రహ్మమే ఈ శ్రీరామచంద్రమూర్తియై అవతరించెననుట యదార్థమైనను, అపర మాత్మునియొక్క అంశయని పిలువబడుటకు హంసమాత్రుడైన జీవునకు వ్యవహరించును గాని, శుద్ధజడాత్మికమైన యీపాంచభౌతికస్థూలశరీరమే అపరబ్రహ్మస్వరూప మనుట అజ్ఞానమేయగును గదా!

20. తా॥ పరబ్రహ్మ మనునది సర్వాంతర్యామియు, మహత్తు మాత్రముచేతనే రూపముగలవాడని తెలియబడువాడును, శాశ్వతుడును, తానే వస్తువుచేతను జూడబడక తనకు దానే సర్వమునకు సాక్షిమాత్రుడు నగునుగావున దదంశసంభూతుడైన జీవుడగు హంసునకే యాలక్షణము లేర్పడుచున్నవికాని క్షయవృద్ధులకులోనైనదేహమునకు గాదు కదా!

21. తా॥ అట్లని యెఱింగియు, నింతటి యింద్రియజయమును గూడాసాధించి గొడ్డుబాఱిపోయిన యీవృద్ధాప్యమున నిట్లాలింగనము సేయగోరు టెంతయనుచితము సుమా!

22. తా॥ అని ఆందోళనబడుచుండియు ఆశ్రీరాముని సౌందర్యముచేత నాకర్షింపబడి, హృదయస్థైర్యముసెడి, ఆతురబడుచున్న ఆమునిలోకమును జూచి,—

23. తా॥ లోకేశ్వరుడును, సమస్త స్థావరజంగమరాసుల నేలువాడును నైన ఆశ్రీరామదేవుడా మునీశ్వరుల యభిమతమును గ్రహించి, దయామయుడును, భక్తుల కోరికల నొసంగువాడును గావున ననురాగము సూచించుచు వారి నెల్లను గలయజూచి యిట్లనియె,—

4. తా॥ ఓ సంయమిప్రవరులారా! నేను నిష్కావముగా బ్రహ్మజ్ఞానులకు వశ్యమయ్యేయున్నాను. అంతేగాక, సర్వసాధారణముగా నేమానవుడైనను నాయొక్క సగుణస్వరూపముగాని నిర్గుణస్వరూపముగాని హృదయములో ధారణజేయుచు ధ్యానించుచుండిన నేను వానికి బ్రహ్మానందమొనగూర్చుటయేగాక, యీ పదునాలుగు భువనములుగూడా వానిధనమై ప్రవర్తిల్లును. అట్టియెడ జిత్తశుద్ధిగలిగిన యోగసిద్ధులు నిరంతరము నిర్వికల్పసమాధిలో నిమగ్నులగుచు మునిపుంగవులైన మీవంటి సిద్ధపురుషులు గోరినప్పు డీపాటి నా యీ దేహాలింగనమే మీకు దొరుకకపోవునా? కనుక, యది మీకందఱకు దప్పక సిద్ధించితీఱును.

5. తా॥ కాని మీ యీకోరిక నీక్షణమే నెఱవేర్చుటకు వీలు లేదు. ఏలనన గా, నేనీజన్మమునందు గర్భిష్ఠుడనై కొన్ని అమోఘనియమముల బూనియున్నాడను గనుక నా యర్ధాంగియైన యొక్క సీతకుదప్ప నితరుల కాలింగనమొసగుటచేత నాయేకపత్నీవ్రతమునకు భంగము వాటిల్లును గావున నిషిద్ధమైయున్నది.

6. తా॥ అంతేగాక యమోఘమైన తపశ్శక్తి గలిగిన దేవతల నుండి సముద్భవమైన యీసమష్టి తేజము దివ్యములైన యాషడ్గుణైశ్వర్యములయొక్క సమ్మేళనములో మూర్తీభవించుటచేత నాయీశరీరముగూడా మిక్కిలి

పవిత్రమైయున్నది. కనుక యట్టి యీ నాదేహమును గౌగిలించుట కయోనిజయు నా భూదేవికూతురునగు ఆసీతవినా యితరులెవరును బాత్రులుగాజాలరు.

27. తా॥ కనుక మీ రిప్పుడు గోరిన నాదేహాలింగనము మీకు రాబోవు ద్వాపరయుగాంతములో దప్పకలభింపజే యుచున్నాను. ఆయుగములో నేను నా నిజభూతితో మఱల నవతరించుచున్నాడను. మీరును స్త్రీబుద్ధితో నే డిట్లుగోరినవార లైతిరికావున మీరందఱు గోపవని తలై పునర్జన్మము నొందెదరు. నేను మీకొఱకై వ్రేపల్లెలో నివసించుచు యశోదాదేవికి గుమారుడనై విహరించునప్పుడు మీకు నా ఆలింగనము సిద్ధింపగలదు.

28. తా॥ అని పలికిన ఆశ్రీరామదైవము యొక్క వచనము లాలకించి యా మునీశ్వరులు, "ఔరా! ఏమి యీరామావతార నియమములు? ఒక్కటే మాట, ఒక్కటే బాణము, ఒక్కతెయేనట భార్యయుగూడా నని తమలోదాము మెచ్చికొనుచు గుసగుసలాడుకొనిరి.

## వివరణ:-

శ్రీరాముడు ధనస్సునందు బాణముసంధించిన, దానికి నెత్తురు తగిలి తీఱవలయుననియు, శత్రువు బాఱజూచిన వెనుకగాబోను తగులక వెన్నంటిమాత్రము దిరుగుననియు, జెప్పబడియున్నది.

29. తా॥ పిమ్మట ద్వాపరయుగము కడపటగా బృందారణ్య ప్రాంతమునందలి వ్రేపల్లియలో ఆసంయమీంద్రులు దమతమ కర్మానుసారముగా గొల్లపడుచులై పుట్టి పెరుగుచుండగా పెద్దగొల్లయగు నందుని భార్యయైన యశోదాదేవికి ఆరామావతారము యొక్క తేజము మలల నిజభూతితో శ్రీకృష్ణుడై ఆవిర్భవించెను.

**వివరణ:-**

త్రేతాయుగములో శ్రీరామచంద్రమూర్తియై ప్రభవించిన ఆమహాతేజము పుణ్యపాపవిచక్షణలోడి కర్మయోగపరమగు సిద్ధిని గాంచుటచేత ఉత్తరజన్మయైన శ్రీకృష్ణావతారమునందు ఆజన్మజ్ఞాని యయ్యెను.

30. తా॥ అట్లు ఆజన్మజ్ఞానియైన గోపాలకృష్ణుడు దయాసముద్రుడును, అరిషడ్వర్గముల జయించినవాడును, మంగళప్రదుడును, కపటనాటకసూత్రధారుడును, భక్తపరతంత్రుడునై విలసిల్లెను.

31. తా॥ అట్టియెడ గోపికలు పూర్వజన్మజ్ఞానములేక, సంసారలంపటలోబడి శ్రీకృష్ణుడు వ్రేపల్లెవాడలో నవతరించిన కర్మయోగ రహస్యమైన భగవదాలింగన విషయమును గాని, ఆయవతారపురుషుని మహిమము గాని గుర్తింపకపోవుటచేత, ప్రజ్ఞగలపాత్రులకే దొరకువా

డును, జ్ఞానచక్షువు నొసంగువాడును నైన శ్రీకృష్ణుడు వారియందు జాలినొందినవాడై యిట్లని విమర్శించికొనెను.

వివరణ:-

గోపికలు సామాన్యజీవులవలె జన్మించుటచేత బూర్వజన్మజ్ఞానమును మఱచియుండిరి. కాని వారలకు బూర్వజన్మసంస్కారములు లేకపోలేదు. అనగా వారి మనస్సులందు బూర్వజన్మమునందు సాధించియున్న చిత్తశుద్ధి దాగికొనియేయున్నది. అట్లణగియున్న చిత్తవృత్తులు ప్రకోపించిననేకాని వారలు మఱల సత్త్వగుణప్రధానలు గాజాలరు. అట్లు సత్త్వగుణము ప్రకాశమానముగాక, యింద్రియప్రవృత్తిలోనేయుండిన, వారు బ్రహ్మజ్ఞాలభ్యుడైన శ్రీకృష్ణుని యొక్క ఆలింగనము లభించుటకు బాత్రులుగారు. పూర్వజన్మమునందు వారలెట్టి యంతఃకరణముతో శ్రీరామచంద్రుని యాలింగనము గోరిరో యట్టి సత్త్వగుణస్థితిలోనే యిప్పుడది చేకూఱవలసియున్నది, కాని వారింద్రియలోలలై యుండినగాదు. కావున భక్తపరతంత్రుడగు శ్రీకృష్ణభగవానుడు వారి నట్లుద్ధరింపవలసినవాడయ్యెను.

32. తా॥ పాప మీ గోపిక లింద్రియజాలములోబడి చిత్తభ్రమనొంది సంసారమార్గానువర్తినులై నన్ను దెలియలేకుండిరి కదా!

33. తా॥ వీరు గొల్లజాతికి జెందియుండుటచేత, ఆలమందల గాచికొనుచు, పాలువెన్నల నమ్మికొని సుఖముగా జీవ

సము సేయుచున్నారే కాని, యీజగత్తు మిథ్యయ నియు, నీశారీరసుఖము లనిత్యములనియు నెంతమాత్ర ము దెలియకుండిరి కదా!

4. తా॥ విశ్వమున కంతటికి జీవస్వరూపమైన ఆపరంజ్యోతి యందు సమాధినిష్ఠలో లయముజెందిన పూర్వజన్మ పరిపాకము గలిగియున్నవారలయ్యు, ఈ గోపికలు నామాయాపాశమున జిక్కుబడియున్నారు గనుక వీరల నే నిప్పుడు దప్పక రక్షింపవలసియున్నది.

**వివరణ:-**

సాధకుడు మొదట దన పురుషప్రియత్నముతో వ్యవ సాయముసేసి యింద్రియజయము బొందినయెడల దదనంత రము దైవమే ప్రయత్నపూర్వకముగా దన్నుద్ధరించుచున్నా డు. ఆమెట్లు జీగినపిదప మానవునకు దానంతను ఆహారము తన ప్రయత్నము లేకపోయిననూ ఏవిధముగా జీర్ణమగుచున్నదో, యదేవిధముగా మనస్సు నివృత్తిపరమగునట్టి నాడీశుద్ధిని బొందిన పిమ్మట ఆపరమాత్మునిచేతనే యాకర్షింపబడి సాధ కుని చిత్తవృత్తికి బాహ్యేంద్రియసంకర్షణ నిరోధించి మనో లయ మొనరించుచున్నది. కావుననే భక్తాగ్రేసరుడగు ప్ర హ్లాదు డయస్కాంత మినుపముక్కను లాగికొను నట్లుగా దనచిత్తము నాహృషీకేశునిశక్తి లాగికొని పోవుచున్నద నియు, దానిని మరలింప దనకు వశముగాకున్నదనియు దండ్రి యైన హిరణ్యకశిపునితో విన్నవించికొనెను.

35. తా॥ అని తర్కించికొనినవాడై శ్రీకృష్ణుడు గనికరము విడిచి, తోడిగోపాలురతో గూడి ఆగోపికల సర్వసౌఖ్యములకు మూలమైన పాలు పెరుగు వెన్నల నపహరించి బాధింప సమకట్టెను.

## వివరణ:-

తమ శిశువును సన్మార్గములో నుంచుటకు మొదట దలిదండ్రులశిక్షణ మవసరమైయున్నది. అట్లు దా మాకుమారుని గొట్టినను దిట్టినను వారి భావ మాబాలకుని క్షేమమే గావున నన్యాయము గాదు. అజ్ఞానుడగు బాలున కది తెలియక నిజముగానే భయపడవచ్చును. కాని తన క్షేమము విషయమై తనకంటె నెక్కువగా వాని తలిదండ్రులకే తెలిసియున్నదనుట నిర్వివాదము. అదేవిధముగా గోపికలయొక్క చిత్తప్రవృత్తి నిరోధించుటకు భగవంతుడు బాహ్యసుఖముల కంతరాయము గల్పింప సంకల్పించుటయు, ఆగోపికల యాత్మక్షేమమునకే గావున, వా రది మొదట గ్రహింపలేకపోయినను దాను వారి జ్ఞానసంస్కారములను రక్షింపవలసినవాడయ్యెను.

36. తా॥ అక్కడక్కడ నాటలాడుకొనుచుండెడి గోపబాలురను గూర్చుకొని, దొంగతనముగా, ఆగోపికలయొక్క యిండ్లలోనికి జాగరూకతతో జొఅబడి, ప్రతిదినమును చేతికందిన పాలుపెరుగువెన్నల సొంతముగా దినివేయుచుండుటచేత, ఆగొల్లభామలు శ్రీకృష్ణునిపై ఆ

సూయాద్వేషములు జెందివారై యాబాలుని చిదానం
దలీలలు గ్రహింపలేక వాపోవుచు,—

37. తా॥ అబలలు, చంచలలునైన ఆగోపకన్యలు, భగవం
తుడైన శ్రీకృష్ణు నెఱుంగజాలక, లోకవ్యవహారరీత్యా
నన్యాయము నవమానము జరుగుచున్నదని భ్రమించి
యొకనాడు వారందఱుగలిసి యశోదాదేవి యింటి
మీదికి దండెత్తి ఆకృష్ణుని చేతలవిషయమై ఆమెతో
ఘోరముగా బోట్లాడిరి,—

38 తా॥ ఓ యశోదమ్మగారూ! నీకు గొడుకుపుట్టుట మాక
ర్మకొలదీ. మాకొంపలు దోచుకొనుటకే శాబోలు.
ఇంకేమున్నది, మాపాప మిట్లాపండిపోయినది. ఏమో
నమ్మా! ఈయూరిలో మే మిక కాపురములువదలి
యింకేయూరైనా లేచిపోవలసి వచ్చినట్లేయున్నది.

39. తా॥ అయ్యయ్యో!నీకొడు కేదో యొకవంకబెట్టుకొని
మాయిండ్లలో దూఱి యన్నియు నాశముచేసి పోతా
డమ్మా. అంటే, అడ్డము గనుపించలేదు కొంచెము
చుక్కబె ట్టమ్మాయీ! యంటూ దగ్గరకు జేరుతాడు;
పోనీలేయని, మొగమున జుక్కదిద్దుతుంటే, మెడ
లోని సొమ్ములు చూచినట్లు నటించి బొమ్మలు-ముట్టు
కుంటాడు; ముట్టుకొని నీకొక మంచిరహస్యము చెవుతా
నంటూ! చెవియొద్దకువచ్చి చెక్కిలినొక్కుతాడు;నొక్కి

నీకంటె నేనే పొడవున్నాను కొలుచుకుందా
మంటూ, ముందునకు నిలబడి మోవిదగులుతాడు;
తగిలి నీవు కండ్లుమూసుకో గమ్మత్తుచూపుతా నంటూ,
నాకండ్లు రెండూమూసి యింట్లోకిజొఱబడి ఆపాలు
మీగడలు దోచికొని, పోతూపోతూ నానోటికికూడా
కొంచెముబూసి వెకిలినవ్వు నవ్వుకుంటూ పరుగెత్తి
పోతాడమ్మా! మానల్లపిల్లగాడు.

**వివరణ:-**

శ్రీకృష్ణుడు బదునొకండేండ్ల ప్రాయమువచ్చువఱకే వ్రేపల్లెలో నందునింట బెరిగెనని శ్రీమద్భాగవతమునందే చెప్పబడియున్నది. అట్లా శ్రీకృష్ణుని బాల్యక్రీడలు పసితనమునందే జరిగియుండెనుకనుక నట్టిచిన్నవయస్సునకు జారత్వమాపాదింప వీలులేదు. పోతనామాత్యుడు దనకవితాచమత్కృతితో భగవల్లీలలని యట్లు శృంగారరసములో దెనుగు భాగవతమునందు వర్ణించియుండెనుకాని, యౌవనమే లేని బాలున కట్టికామకాభావము గలిగెననుటలో నర్థములేదు. అంతేగాక "నీవుయశోదబిడ్డడవె నీరజనేత్ర సమస్త జంతుచేతో విదితాత్మ వీశుడవు" అని యాకవీశ్వరుడు బిమ్మట గోపికాగీతలం దావ్రేతల చేతనే స్తుతి జేయించియున్నాడు. కనుక గోపికలు మొదట దన్ను గడపద్రొక్కనీయకపోయినప్పుడాబాలకృష్ణుడేదోయొక చమత్కారముతో దగ్గరకు జేరి, మఱపించి, యుక్తిగా నింటిలోనికిజొచ్చుట జరిగియుండెడిది. అది సహజముగా కుఱ్ఱవాండ్లకందఱకును స్వాభావికమేయై యున్నది.

40. తా॥ అంతేగాక మేము మాయిండ్లలోనున్న పాలకుండ లనన్నింటిని జాగ్రత్తగా దాచికొని, తలుపులు బిగించి, గుమ్మముమీదనే గూర్చొని కావలియుండగా, మాకంటబడకుండనే యెటుగుండి లోనికి బోవునో కాని, కడవలుమాత్రము ఖాళీగాయుండునమ్మా! ఇంకా యేమేమో పులితోడేలువలె దొంగయటుపులఱచి మమ్ము నిర్ఘాంతపెట్టి మాయిండ్లలోదూరి పాలకుండల దన్నికొనుచు జిక్కకుండా దప్పించుకొని మఱీ పాఱిపోతూయుంటే, యింకా నీకేమిచెప్పవలెనమ్మా యశోదమ్మగారూ! మొత్తముమీద కనిపారేసి యాంబోతును విడిచినట్లుగా ఊరిమీద వదలివేస్తేమట్టుకు మే మిక యూరుకోలేమమ్మా!

41. తా॥ అని యుప్పతనబెట్టుచూ ఆడిపోసుకొనుచుండగా విని నివ్వెఱబొందిన యశోద తన చిన్నికుమారుని ముఖలక్షణములలోని యమాయకత్వమును జూడగానే చిఱునవ్వు గలిగి, తనముద్దుబిడ్డ నన్యాయముగా సరిపడక నిందించుచుండి రనితలంచి యొడలుపులకరింపగా వారిని నిరాకరింపనెంచి,—

42. తా॥ ఓహెూహెూ గోపికలారా! మీ రిట్లు గోపమెత్తి వచ్చి యీరోజువరకు నాచనుబాలైనామానని యీ పసివాని నీరీతిగా జారచోరదూషణములతో నిందించి వృథాగా యెందులకీ ట్లుప్పతనపాల్జేసెదరమ్మా?

యన్యాయముగా శిశువుల నింద జేసిన గన్నకడుపైన తలిదండ్రుల కెంతయు విచారకరము గాదా!

43. తా॥ మీరుమట్టుకు బిడ్డలగనని గొడ్డుబోతులా యారీతిగా నాముద్దులకొడుకుమీద బాఅలుసాపిమఱీ తిట్టిపోయుచున్నారు. చాలుజాలుగాని యీ వేషాలు మాని నాయింటిముంగటినుంచి వెళ్లిపొండి.

44. తా॥ కానిచో మీరు మీమగవాండ్లపై నిరుగుబాటు జేసి గెలువలేక, ఆకసియంతయు, యీ పరాయితల్లిగన్న పసివానిమీద జూపించి వాపోవుచుంటిరి కాబోలు.

45. తా॥ ఆహో ఏమి యీఆగడము? పసివాడన్న తఱువాత బొరుగిండ్లవైపుకే రాకయుండునా? వచ్చినప్పుడొక వేళ నేమైన తినేవస్తువులు గన్పించిన నందుకొనక మానునా? అట్లని ఆపాలుపెరుగులు గంటబడకుండా జాటుగా దాచిపెట్టుకొని, యేదో కళ్లెదురుపెట్టి వాడందుకొనకుండా చూచుకొనవలెనుగాని, యిట్లు పరువుమర్యాదలులేకుండా శాస్త్రంతదానికి గంపెడంత చేసి బాఅలు చాపుతూ బాజారుకెక్కితే యేమున్నది?

46. తా॥ అని యా గోపికలను తిరస్కరించినదై యశోద కుమారునిపై ప్రేమజనింపగా,వారి సంగతివిడిచి,శ్రీకృష్ణుని దగ్గరకుదీసికొని,—

47. తా॥ నాయనా! నిన్ను ఊరిలోనివారందఱు గొడ్డుపిల్ల వాడని యపకీర్తిని పెట్టుచున్నారు. నీవా నాకు లేకలేక కలిగిన వంశాంకురము గనుక చెడ్డపేరు దెచ్చికొనబోకుమురా నాతండ్రీ!

48. తా॥ అని లాలనము సేయుచు శ్రీకృష్ణుని గృహములోనికి దీసికొని వెళ్లి దృష్టిదోషము దగిలెనేమోయని భయపడి విభూతిని మంత్రించి తన మనస్సునకు తృప్తిగా నాబాలుని కాపాదమస్తకమును బూసినదయ్యెను.

49. తా॥ ఆప్రకారముగా దల్లి చేత మందలింపబడిన శ్రీకృష్ణుడు వైరాగ్యభావము వహించి గోపికల విషయమై వదలివేయగా, దమ యింటిపురోహితుడైన గర్గమహాముని యరుదెంచి యాకృష్ణావతారమర్మ మెఱిగియున్నవాడు గనుక ఆయోగేశ్వరుని యోగవిద్యా విధానమును బునశ్చరణ జేయవలసినదని ప్రేరేపించుచు క్రియాయోగములో నుదాసీనుడు గాగూడదని యాశ్వాసించి వెళ్లెను.

## వివరణ:-

అట్లు లోకులచేత దూషింపబడి ఉదాసీనుడైయున్న బాలకృష్ణుని గర్గమునీంద్రుడు క్రిందివిధముగా నుద్బోధించెను:-

(10)

గర్గ॥ గోపాలదేవా! ఏమ ట్లుదాసీనునివలె నేమో చింతించుచున్నాడవు?

కృ॥ గురుదేవా! నే నితరులకు మేలుసేయుచుండగా నన్ను దుర్మార్గునిగా భావించుచున్నారుగదా స్వామీ!

గ॥ నాయనా! లోకము కాకులవంటిదనికదా సామెత. మఱియు "లోకో భిన్నరుచిః" కావున మన మితరుల యుద్దేశములు గమనింపకూడదు. నీవు నీబుద్ధికి దోచి నటుల జేయుట నీకర్తవ్యము.

కృ॥ కాని యితరులు నన్ను దూలనాడుచుండిరిగదా స్వామీ!

గ॥ ఎవ్వ రెవ్వరిని దూలనాడి రోయీ, గోపాలా?

కృ॥ ఈ యూరివారందఱువచ్చి నన్ను దిట్టి మాయమ్మతో బోట్లాడిపోయిరి స్వామీ!

గ॥ ఎవరిని దిట్టిరి నాయనా?

కృ॥ నన్నే స్వామీ! నన్నే.

గ॥ అంటే నాకర్థము గాలేదే!

కృ॥ అయ్యో నన్నేనండి, నన్నే. ఈ యశోదాకుమారుడ నగు శ్రీకృష్ణుని.

గ॥ ఓహో! అటులానా, కృష్ణుడవైన నిన్నే తిట్టి పోయిరా?

కృ॥ ఔనండి, ఔను.

గ॥ అయితే నీపేరు కృష్ణుడన్నమాట.

కృ॥ కాదు స్వామి; నాపేరు శ్రీకృష్ణుడు.

గ॥ సరే, నీ పేరైతే శ్రీకృష్ణుడు.

అం ఔను స్వామీ, నా పేరు శ్రీకృష్ణుడు.
అయితే నీ వెవ్వర వోయీ?
అయ్యో! నేను శ్రీకృష్ణుడనని చెప్పికొంటిని గాదండీ, యింతలోనే మఱచిపోతిరా స్వామీ!
కాదబ్బాయీ! శ్రీకృష్ణు డనేది నీయొక్క పేరు గదా! అటువైన నీవు ఎవ్వరో చెప్పుము.
అదేమిటి స్వామీ! అట్లా అడుగుచున్నారు.
నీకు నామాట యర్థముగాలేదు బాబోలు. సర్లే, విను ఈయశోద ఎవరి తల్లి?
నా తల్లియే.
ఔను గదా! నీవు వేఱు, మీయమ్మ యశోద వేఱుగా నుంటిరికావున, ఆమె నీయొక్క తల్లియైనది. కాని ఆమెయు నీవును నొక్కటే మనిషి కాదుగదా!
అవునండి, ఆమె నాతల్లి కాని, నేనూ ఆమె యొక్క రమే యెట్లగుదుము!
మఱి, యిందాక నీవు నీపేరు శ్రీకృష్ణు డంటి వే. అప్పుడు నీవూ నీయొక్క పేరును వేఱువేఱేగాక, యొకేవస్తు వెటులైనది?
అవును స్వామీ! నేను బుట్టినతరువాత చిన్నప్పుడు దమరే దయచేసి నాకు శ్రీకృష్ణుడని పేరుబెట్టినా గటగదా! ఆ ఆబ్బాయి నేనండి నేను. ఇప్పు డింత పెద్దవాడనైతిని.

గ॥ సరే పోనీలే, నీ చేయి యేది?

కృ॥ ఇదుగో నండి, యిది కుడిచేయి.

గ॥ అవును, యిది ఎవరి చేయి?

కృ॥ నాచెయ్యే గదండి, నాదే.

గ॥ అవును, ఇది నీది. అనగా నీయొక్క చేయి. అంటే, యిందాక నీయొక్క తల్లి యన్నట్లుగా, నీ చేయి వేఱు, నీవు వేఱుగా నున్నారు గాదూ!

కృ॥ అ దెట్లాయగు నండి? నాచేయీ నేనూ కలిసియే యున్నాము. కాని నాతల్లీ నేను వేఱువేఱేయున్నాము గాదండీ.

గ॥ అయితే, యీ నీచేయి తెగిపోయిన, నీవుగూడ లేక పోదువా?

కృ॥ అహహ; ఈచేయిపోతే, నా కింకొకచేయిగూడాయున్న దిగదండి.

గ॥ అవును, యీచేయిపోతేగూడా "నీవు" అంటూ యుంటున్నాడవు గనుక నీవు వేఱు, నీచేయి వేఱు. అనగా నీవు ఆచేయి వే యని చెప్పవీలులేదు అది నీయొక్క చేయి. అనగా నీవు వేఱేగా యుంటూయుండగా, ఆ చేయిగూడా వేఱేగానే యుండి, నీది యగుచున్నది.

కృ॥ ఔను స్వామి, తెలిసినది. ఇది నాయొక్కచేయి యగుచున్నది. అయితే యీ కాలూ నాదియే, యీముక్కూ నాదియే, యీకన్నులూ నావియేనన్నమాట ఇవి యుంటే నావి, యుండకపోతే నాకు లేకపోవుచు

న్నవి కాని "నే" నంటూ నివి లేక పోయిన గూడా యుంటానండి!

గు॥ మఱి, యీ కండ్లూ ముక్కూ, చెవులూ, కాళ్లూ తలా నీవు గాకపోతే "నే" వెవ్వర వోయ్?

కృ॥ అదేనండి, నే నెవరిని?...ఆఁ, యీముక్కులో నడిచే యూపిరి గావచ్చును గాదండీ!

గు॥ మంచిది, ముక్కు మూసిపట్టుకొని చూడు.

కృ॥ నాకు ఊపిరి ఆడదుగదండీ!

గు॥ ఆఁ, నీకు ఊపిరియాడదంటే నీవు వేఱు, నీ యూపిరి వేఱు గాదూ?

కృ॥ అంతే నండి.

గు॥ మఱి నీ వెవ్వడవు?

కృ॥ ఏమో తెలియుట లేదండి. అంతా అయోమయముగా నున్నది. స్వామీ! తమరే న న్ననుగ్రహింపవలసినది మునీంద్రా!

గు॥ అటులైన వినుము. నీశరీరమునందు "నే" ననునది నీశరీరము కాదు. నీశ్వాసయు గాదు. ఈశ్వాస మనస్సు యొక్క స్థూలరూపము. ఈశ్వాసననుసరించుచు నను గమించిన, నీదేహమునందలి పంచకోశములను దెలియగలవు. ఆ ట్టింద్రియములజయించి, మనస్సును వశపఱచికొని యహంకారము నణగద్రొక్కిన బుద్ధికి ఆత్మావలోకన మొదవి నిను నీవు యథార్థముగా నెఱిగికొనగలుగుచున్నాడవు. కాని, యీదేహమునీ

వనియు, మనస్సు నీవనియు పొరబడుట మాయ (లేక) అజ్ఞాన మనబడుచున్నది. నీవు సర్వకాలస ర్వావస్థలందునగూడా ఆత్మవే యై యున్నాడవు. ఆ అజ్ఞానమను మాయతెఱ దొలగిన, సూర్యోదయ ముతో నిండుచీకటియంతయు నెగిరిపోవునట్లు, ఆత్మ సాక్షాత్కార మొదవి, అజ్ఞానమంతయు నశించుచు న్నది. ఆత్మ యెల్లప్పుడు సాక్షీమాత్రుఁడే కాని,కర్తయు భోక్తయు గాడు. కావున ఆత్మకు దూషణభూషణము లెన్నడును లేవు. నీ వా ఆత్మస్వరూప మయ్యే యుం టివి గనుక లోకు లాత్మయగు నిన్ను దిట్టుచుండిరని తలంచుట యారోపిత మగుచున్నది. అన్ని జీవుల లోని ఆత్మ యొక్కటే గనుక తిట్టువాడు, తిట్టుదిను వాడు గూడ నాత్మయే యై యున్నది. ఇక ఈమిధ్యా రోపణ చేయుంచునది మనస్సే యై యున్నది. ఆమ నస్సు పంచజ్ఞానేంద్రియములద్వారా యానందము కొఱకు బాహ్యవిషయములలో వెతకికొనుచు, జీవున కహంకార మాపాదించి కర్మలంపట నొందించి జనన మరణముల బొందించుచున్నది. జీవాత్మయే యథార్థ స్థితిలో అఖండానంద స్వరూపముగానున్నది. కావున మనస్సు నంతర్ముఖము సేయవలయును. రెండుకండ్లను మూసికొనిన, యీ మాయాప్రపంచమునం దొకటైన దవభాగము అదృశ్యమగుచున్నది. నోరు గూడా మూసిన, రెండు వంతులుగా నశించుచున్నది. చెవులు మూసిన మూడువంతులు మాయమగుచున్నది. అట్లే

ముక్కు-మూసిన నాల్గువంతులు గాను, శరీరమే మఱచిన బూర్తిగా గాను ప్రపంచము లేకపోవుచున్నది. అనగా యీ మైను మార్గములు నిరోధించిన,మనస్సు పరిభ్రమించక జీవాత్మలో నణగిపోవుచున్నది. కనుక ఓ, గోపాలదేవా! నీ వా మనస్సునుజయించి లోకులకు వెఱవక, నీ బుద్ధికి యుక్తమని తోచినట్లు కర్మాచరణము సేయుచు, కర్తృత్వాభిమానములేక లోకోపకారము సేయవలసినది.

కృ॥ అయితే, గురువర్యా! సాధన యేప్రకారముగా జేయవలయునో యనుగ్రహించి, నన్ను గృతార్థుని జేయుడు.

గ॥ కృష్ణభగవానుడా! నీవు సాక్షాత్ భగవంతుడవును ఆజన్మజ్ఞానివియు గావున నేను నీకు వేఱే యుపదేశింపవలశినది లేదు. ఐనను, నీ వీబాల్యమునందే యష్టాంగయోగముతోగూడిన రాజయోగమును బునశ్చరణచేసికొనిన, ఉత్తరోత్తరా లోకమునకు దత్త్వోపదేశము సేయుటకు మాఱనీయుడవగుదువు. కానిచో లోకులు నీయమానుషత్వమెఱుగజాలక నీ గీతాబోధతత్త్వమాదరింపకపోయిన రాబోవు కలియుగమున ధర్మము బొత్తుగా నశించిపోవును సుమా!

అని గర్గమహాముని శ్రీకృష్ణుని బ్రోత్సాహపఱచి వెడలిపోయెను.

50. తా॥ ఆవిధముగా మాతృదేవతకంటె గొప్పదైన గురుదేవుని వాక్యము ననుసరించి, కాలయాపనము సేయక,

శ్రీకృష్ణుడు గోపికల విషయమై త్వరపడి విచ్చలవిడిగా వారి పెరుగు పాలు మొదలైన వస్తువుల నాశము సేయ మొదలుబెట్టగా, వారందఱు జాలా మనోవ్యధపాలైరి.

51. తా॥ గోపిక యొక్కతె ప్రతిదినము శ్రీకృష్ణుడు సేయు దానికి వానిని బట్టికొని ప్రతిక్రియ జేయవలెనని సంకల్పించి, ఆనాడు యేకాదశి గూడా అగుటచే నింటిలో వంటచేయనక్కఱలేదుగదా యని యితరపను లేమియు దలబెట్టక, కృష్ణు డందుకొన వీలులేకుండునట్లు నడికప్పన కొక యుట్టినిగట్టి, అందులో బాలు పెరుగు వెన్నకుండలను జాగ్రత్తపఱచి, తలుపులు బిగించి, పీఢగుమ్మము మీదనే మిక్కిలి మెలకువతో గూర్చొని త్రోవగాచికొనుచుండగా నంతలో మధ్యాహ్న కాలమయ్యెను.

52. తా॥ అట్లు పచ్చియుపవాసముసేయు నామెకు నోరువెండగా వాకిలిముంగటనున్న చెఱువులోనికి వెనుకకు దిరిగితిరిగి చూచికొనుచు బోయి,త్వరగా నొకగ్రుక్కెడు నీటితో నోరుదడిపికొని, మఱుక్షణములో గ్రరున తిరిగి యిల్లుసేరుకొనునప్పటికి గుండెఝల్లురనగా నంతలోనేయిల్లంతయునిండియుండిన యనేకమంది గోపకులజూచెను.

53. తా॥ ఆబాలురతోపాటు శ్రీకృష్ణుడును రోళ్లు పీటలు బ్రోగువెట్టి, వే ఱొకపిల్లవాని నెక్కించి, వాని భుజ

ములపై దానునిలబడి, చేతికందని యాయుట్టియందలి కుండలకు రంధ్రముగొట్టి, ఆవిసురున కాయుట్టి యిటు నటు నూగుచుండగా దానితోబాటు దాను తనశిర మునుగూడా సమానముగా వంచిత్రిప్పుచు, క్రిందికి గారుచున్న క్షీరధారకు దోసిలిబట్టి, తానును దనక్రింద నిలబడినవాడును త్రావుచుండగా, తక్కగల బాలకులు మోచేతులక్రింద జుట్టికొని త్రావుచుండి, యందఱు దదేక నిమగ్నులై పిలచినా వినిపించికొనలేని స్థితిలో పొట్టలుమట్టుకు బెద్దవిగా బెరుగుచుండగా,అయిల్లాలి ఏకాదశీవ్రతము సఫలమాయెనా యన్నట్లుగా శ్రీకృష్ణుడు నిజవిభూతియైన గోపాలురతో సహా ప్రత్యక్ష మయ్యెను.

వివరణ:-

ఈ గోపవనిత యుపవాసదీక్షతో నేకాదశేంద్రియ ముల నిరోధించి, చిత్తైకాగ్రతగలదై, శ్రీకృష్ణునే స్మరించుచు బగచేతనో వగచేతనో ధ్యానించుచుండెను గనుక, భక్త పరాధీనుడైన భగవంతు డామె కవశ్యము దర్శన మీయవల సివచ్చినది. కాని ఆమెబుద్ధిపరిపక్వముకాకపోవుటచే ఆమె ఆభగవత్సాక్షాత్కారము నెఱుగ లేకపోయినది. అట్లాధర్మ సూక్ష్మ మాయిల్లాలు గ్రహింపలేకపోయినను, గర్మఫలము దప్పదుకావున, దదేకధ్యానముతో శుచియై ఆదిన మామె

సాధించిన కర్మయోగ్యతయే యామెపాత్రతకొలది నామెకు దక్షిణము ఫలించి భగవత్సందర్శనము ప్రసాదించెను.

54. తా॥ ఆరీతిగా జూచి, భయము, నాశ్చర్యములతో గూడి కొనిన వణకుపుట్టుచున్ననూ, దొంగయని యనుకొనిన ఆబాలకృష్ణుని బట్టుకొనవలయునని ధైర్యము దెచ్చికొని, వానిమీదనే దృష్టినిలిపి, మెల్లమెల్లగా దగ్గరకు జేరుచుండగా శ్రీకృష్ణు డామెనేత్రము లుపవాసము చే జిక్కియుండెనని దయదలచెనన్నట్లుగా, బుక్కిట లోని పాల నామెకన్నులపై నుమిసి, ఆమె తెప్పరిల్లి చూడగలిగేలోపుగా నాగోపాలకులతో సహా చిత్ర ముగా నదృశ్యమయ్యెను.

55. తా॥ ఆవిధముగా నెవ్వరి కంటబడకుండా నెక్కడ గని పెట్టుకొని యుండునో, యెప్పు డిండ్లలోనికి దూఱునో యెట్లు పాఱిపోవునో, కాని యేమాత్రమును చప్పుడు గాదు. పైగాకుండలు బెట్టిన ట్లేయుండును కాని లోపల చూచిన శూన్య మని పరిపరివిధముల దలపోయుచు ఆకొంటెకృష్ణుని విషయమై వానితల్లికూడా పట్టించి కొనుట లేదుగదా యని వ్యసనపడుచు,—

56. తా॥ అట్టి విచార మారోజు కారోజు కెక్కుడుగాగా, ఆగోపికలు వాకిం డ్లూడ్చుచున్ననూ, ముగ్గుబెట్టు చున్ననూ, వంటకములు సేయుచున్ననూ, మాట

లాడుకొనుచున్ననూ, నిద్రపోవుచున్ననూ, తిరుగుచున్ననూ, చూచుచున్ననూ, వినుచున్ననూ, యింకానేమేమిచేయుచున్ననూ, చిత్తముమాత్ర మాకృష్ణుని చేతలమీదనే యాకర్షింపబడి వేఱే తాముగా గష్టపడి సాధించే ప్రయత్నము లేకుండగనే మనస్సులంత ర్ముఖమై యేకాగ్రత్వము నొందిరి.

తా॥ అట్లు దామ బట్టుకొనవలయునని ప్రయత్నములు సేసినను, దొరికియు దొరకని బాలునిగూర్చి విసిగి, వేసరి, లోలో మెచ్చికొనుచు, యనురాగవతులై తుద కాగోపిక లసూయాద్వేషములు మఱచి, యందఱుగలసి సమానముగా శ్రీకృష్ణుని ప్రేమింపదొడగిరి.

తా॥ ఈ ప్రకారముగా జిత్తైకాగ్రత నొందుచు, హృదయపూర్వకముగా గామక్రోధాదుల విసర్జించి శ్రీకృష్ణునియం దెక్కుడు మమకారము గలిగినవారలై గోపికలాబాలుని దమ చేతులలోనికి జేరదిగిచికొని గారాబము సేయవలయునని గాఢముగానపేక్షింపగా ఆశ్రీకృష్ణుడు వారలకు శరీరము వేఱు ఆత్మలు వేఱు అని నిర్ధారణచేయుచు స్ఫుటముగా అనహంకారోపదేశము సేయదలచినవాడై చిత్రముగా దన బాల్యలీల నొకటి నిరూపించెను.

**వివరణ:-**

గోపిక లింద్రియలోలులుగానుండిరో శ్రీకృష్ణుని దాకగోరుచుండిరి, కాని గతజన్మలోని మునీశ్వరులవలె నింద్రియాతీతలై కాదు. కనుక, వారికి స్థూలదేహవాసన పూర్తిగా నశింపజేయుటకై భగవంతు డుపదేశము సేయవలసివచ్చెను. అట్లని తన దైవత్వ మెఱుగని సంసారిణులగు ఆగోపికలను బిలిచి మంత్రోపదేశము సేయుటకు వీలులేమి క్రియారూపముగా నొక్కట ఆత్మచికిత్స నొనరింపగడగెను. ఆవిధముగా జ్ఞానులైన వారతాత్తుగా చిత్తప్రక్రియ నొనర్చిన బాత్రులుగానట్టిమూఢహృదయులగు శిష్యులకు నాడీదోషముసంభవించి ప్రమాదము జరుగుట తటస్థించును. అందువల్లనే యమనియమాదులు మొదట తప్పక సాధింపవలసియున్నది. కాని ఆగోపికలన్ననో అదివఱకే యింద్రియవాసనలను మఱల్చిన హృదయనైర్మల్యము బొందియున్నవారగుటచే వారి కా నాడీవిజృంభణము దరుణమేయయ్యెను.

59. తా॥ ఒకనాడు గోపికలందఱు గౌరీదేవీవ్రత మారంభించి వినోదముగా నాడుచు బాడుచు యమునానదికి వెళ్లి నిస్సంకోచముతో వివస్త్రలై స్నానముసేయుచుండిరి.

60. తా॥ అప్పు డాబాలకృష్ణు డాయొడ్డు మీదనున్న ఆవ్రేతల చీరెలు దొంగిలుచుండగా వారు చూచి యాతని వారింపదొడగిరి,—

61. తా॥ అయ్యో, అయ్యో, కృష్ణా! ఇదేమిపనిరా? ఆడ వాండ్లు స్నానమాడుచుండగా మగవాండ్లిట్లు బొంచి చూచి రావచ్చునటరా? ఒకవేళ పొరపాటున వచ్చి తేని, యీవిధముగా చీరెలెత్తుకొనిపోవుదురా? ఛీ! ఛీ! నీవు చాలామంచివాడవు గదరా! పరుగెత్తి పొటిపోక మాకోక లక్కడ విడిచిపెట్టి వెళ్లు నాయ నా. అయ్యో! అప్పుడే చాలాప్రొద్దుగూడా యెక్కి నదే!

62. తా॥ ఓ కృష్ణా! నీవు మా మాట వినకపోయిన, మీయ మ్మతో జెప్పెదము సుమా! అయ్యయ్యో! ఇవేమి యాటలురా? మా నాయనగాదూ! తే, మాచీరెలు మా కందిచ్చు తండ్రీ! యని స్వభావసిద్ధమైన లజ్జతో నయమున భయమున బ్రతిమాలికొనిరి.

63. తా॥ అప్పుడా గోపాలకృష్ణుడు దానకర్మపరుడు గాడు గావున వారికోకలు దీసికొని పొటిపోక వారి కొక క్రియావిధానమును గల్పించి సాభిప్రాయముగా నిట్ల నియె:—ఓ గోపికలారా! భయపడకుడు. మీ రేల యింత సిగ్గునొందెదరు? ఈజగమంతయు మిథ్యయే కదా! అటులనే యీపాంచభౌతికమైన మీశరీరము లును మీ మీ ప్రారబ్ధకర్మానుభవమునకై మీరుధరిం పవలసివచ్చినదే కదా! కావున అనిత్యములైన మీ యీతుచ్ఛదేహములపై నింతయభిమాన మెందులకు?

మీరు యింద్రియవాసనలుమాని, దేహభ్రాంతివిడిచి ఆత్మాత్మానుసంధానబుద్ధితో నీటిలోనుండి వెలుపలికి వచ్చిన, మీకు మీ మీ ప్రకృతిధారణావశ్యకములైన వస్త్రములిచ్చుటయేగాక, తక్కు ఆత్మక్షేమకరము లైన దివ్యలక్షణములను దృ ఢ మ గు మనోబలమును గూడ బ్రాప్తింపగలవు.

64. తా॥ అని సహేతుకముగా వారిదేహవాసన బలాత్కా రముగా హరింపగా, నిశ్శంకగా దదోభ్ధ గ్రహింప లేని చంచలలుగావున, నిర్విణ్ణహృదయలై ఆగోపిక లోపికలుసెడి మఱల యశోదకడకుంజని కృష్ణుని విప రీత చ ర్య ను సాదృశ్యముగా నిరూపించి వాపో యిరి.

65. తా॥ అప్పు డాయశోదాదేవియు సహజమైన స్త్రీహృ దయముతో గమనించి, గోపికలు సెప్పినమాటయే నమ్మినదికాని, శ్రీకృష్ణుని బుద్ధియందలి సదుద్దేశమైన అనహంకారోపదేశవిధానము గ్రహింపలేకపోయెను. అందువలన, ఆమె తనకుమారునిపై నలుకదెచ్చికొని తాను వానిని దప్పక దండింతునని ప్రే త ల సమా ధానపఱచి పంపివేసెను.

66 తా॥ తరువాత ఆ యశోదమ్మ శ్రీకృష్ణుని దుశ్చేష్టల గురించి విచారగ్రస్తమై,యికబిల్లవాడింటనేయుండిన

బాత్రిగా జెడిపోవునని తలంచి, తమ కులవృత్తియైన గొల్లకాపరితనముపై నియమించుచు శీఘ్రముగా నడవులకు బంపవలసినదే యని మనస్సునఁగుదుర్చుకొని, భర్తయైన నందునకుగూడా నచ్చజెప్పినదై యొక నాటి సుముహూర్తము నిర్ణయించెను.

67. తా॥ అట్లు ప్రప్రథమముగా మందదోలికొనిబోవుటకై యలంకరింపబడిన ఆగోపాలకృష్ణుడు దన మాతృదేవతకు ప్రదక్షిణపూర్వక నమస్కారాదులాచరించి, ఆమె యాశీర్వచనమునందుకొని, చల్దియన్నము నొక కట్టెకు దగిల్చికొని తన్ను జూచి పరితపించుచున్న గోపికాజనమునకు నుపశాంతి కలుగునట్లుగా జిఱునవ్వు నవ్వుచూ, నొయ్యారముతో వారివైపు తిరిగి తిరిగి చూచుచు నావులమందవెంట నడచెను.

68. తా॥ అట్లు శ్రీకృష్ణుడూరి వెలుపల నున్నపొలములలో బశువుల మేపికొనుచు క్రమముగా నన్నిదిక్కులందలి దూరపు బయళ్లనుగూడా యరసికొనుచు, తుదకు యమునానదీప్రాంతము సేరెను. అక్కడనున్న కొండభూములయందు, గడ్డి యెక్కుడుగా గన్పడుటచేతను ఆ నదియందెల్లప్పుడు నీరుగూడా పాఱుదలగా నుండుటచేతను, ఆ ప్రదేశమే యెక్కువ వసతిగా నున్నదని నిశ్చయించికొని, క్రూరమృగములు సంచరింపని పచ్చిక బీడులందా పశువుల మేపికొనుచుండెను.

69. తా॥ ఆవిధముగా యాదవకులశేఖరుడైన గోపాలదేవుడు దేశకాలపాత్ర మెఱిగికొని పశుపోషణ జేయుచుండగా ఆవులును బోదుగులు బెంచి పుష్కలముగా బాలిచ్చుచూ ఆవ్రేపల్లెవాడలో గలవు మాటయే కల్లగా సిరిసంపదల కభివృద్ధి గలుగజేసెను.

70. తా॥ ఇట్లు శ్రీకృష్ణుడాల మేపికొనుటకై ప్రతిదినమును యూరిబైటకు బోవుచుండగా నక్కడ వ్రేపల్లెవాడలోని గోపిక లాబాలగోపాలు డట్లు గంటికిదూరమవ్వొగదా యని వగజెందినవారై ప్రొద్దస్తమానము వానివిషయమే చెప్పికొని యాలాపము సేయుచు దిగులుపడజొచ్చిరి.

71. తా॥ అంతేగాక ఉపదేశముయొక్క బలముచేతగూడ నిరంతర మాశ్రీకృష్ణునిమీదనే ధ్యాసకలిగినవారై వాని విషయమే మాటలాడుకొనుచు, వానిమీదనే పాటలుబాడుకొనుచు, వాని సంగతియే యనుకొనుచు వానినే మెచ్చికొనుచు యెప్పుడెప్పుడు ప్రొద్దుగ్రుంకునా, యెప్పుడా బాలకృష్ణుడడవులనుండి మఱలియింటికివచ్చునా యని తపించుచు వేచియుండి, సూర్యాస్తమయము కాగానే ఆగోపిక లాకృష్ణుని కిష్టమగు తినుబండములను సేకరించికొని వెళ్ళి యాతురలై మాచిన్నికృష్ణు డెక్కడున్నాడమ్మా! యశోదా! యని వెతకికొనుచుండిరి.

వివరణ:-

ఉపదేశమనునది ఉపన్యాసమువంటిది గాదు. ఉపన్యాసమనునది చిత్తక్షోభముగా జేయు గ్రంథవిమర్శనకు పర్యవసానమై యెప్పటికప్పుడు సెప్పువాడును, వినువాడును మఱచుట కవకాశము గలిగియుండును. ఉపదేశమన్ననో యట్లుగాక అక్షరస్పృహనే యెరికట్టి దన్నుదానుగా బ్రపంచమునుండి మఱల్చుచు మనోవేగమునిలిపి జీవాత్మపరమాత్మలను జతగూర్చు దారమువంటి యొకనాడీచలన మగుచున్నది గురువైన వాడొక్కయుపదేశములోనే తనయోగశక్తిని బ్రవేశపెట్టి శిష్యునిశరీరమునందలి నాడినిబ్రకోపింప జేయగా నిక నది యావజ్జీవమును వ్యక్తిగతముగానే ప్రసరించుచుండి, తదధిష్ఠానదేవత నేనాటికైననూ సాక్షాత్కరింప జేయుచున్నది. అట్లా యా దేవతల కా యా నాడీస్థానములుండి, బ్రహ్మత్వమునకును వేఱే యొకయూర్ధ్వనాడి హృదయమునందు గలదు గావున, అట్టితత్త్వోపదేశము సేయుటకును గురువైనవాడు బ్రహ్మజ్ఞానియై యుండవలెనుగాని యోగసిద్ధి లేని వారలు సేయజాలరు. అందునను క్షుద్రదేవతలు శీఘ్రముగాను గొప్పదేవత లాలస్యముగాను బ్రసన్నులగుదురు, గావున అవ్యక్తపరబ్రహ్మస్వరూపమగు నేకాక్షరప్రణవారాధన మత్యంత దూరముగానున్నది. అట్టి బ్రహ్మజ్ఞాని నెఱుగుటయు గష్టతరమే. కాని సాధకునికి వైరాగ్యయుక్తమైన పాత్రత చేకూఱిన ఆపరబ్రహ్మమే గురుదేవునిరూప

ముగా స్వయముగావచ్చి యుద్ధరించుచున్నాడని శ్రుతులు సెప్పుచున్నవి.

72 తా. శ్రీకృష్ణభక్తి తత్పరురాలైన (రాధయను) ఒక గోపిక యెప్పుడు ప్రొద్దుగ్రుంకునా యెప్పుడువెళ్లి బాలకృష్ణుని ముద్దులమోమును జూడగలుగుదునా యని యాతురతతో తొందరతొందరగా దనయింటిలోని పనులన్నియు దీర్చికొని, చీకటిపడగానే, దివ్వె వెలిగించికొని వచ్చెదనను నెపముతో గడపదాటి నేలుగా యశోదయింటికిం జని యక్కడ దీపము ముట్టించికొనుచు, దాపుననున్న నందనందనుని సుందరముఖారవిందమును దిలకించియానందించుచు, తన్నుదా మఱచియుండగా, ఆమె వెలిగించుచున్న చేతిలోని వత్తియంతయు మండుకొని తుదకు చేతివేళ్లు కాలిపోవుచున్ననూ ఆగోపిక తెలిసికొనలేకపోయెను. అంతలో ఆమె యత్తగారు తన కోడ లాయశోదమ్మగారింటికే వెళ్లియుండునని యనుమానించి, యాగ్రహావేశముతో నచ్చటికివెళ్లగా, ఆ యమాయకపుకోడలి చేతివ్రేళ్లు కాలిపోవుటజూచి, తనకు వచ్చిన కోపమంతయు మఱచి గొల్లుమంటూ బొమ్మబాదుకొని యేడ్వసాగెను.

విశేషార్థము:-

ముఖ్యముగా నాగోపాలకృష్ణుని మేనత్తయైన రాధయను యువతి ఆ బాలకృష్ణునియందలి భగవల్లక్షణములను

దన పూర్వపుణ్య భాగ్యముచే స్వయముగా గుర్తించినదై, ఆకృష్ణకుమారకునిపై దివ్యమైనభక్తి భావమును బెంపొందించి కొనుచు, ఆమాయామానుష విగ్రహుని శిష్యబృందమనఁనొప్పు నాపదునాఱు వేల గోపిక లందఱిలోను ముఖ్య శిష్యురాల య్యెను.

## వివరణ:-

సాధకుడు దనహృదయములో నిజమైన భక్తిని గలిగి యున్న వానికి ప్రకృతియంతయు ననుగుణ్యముగానే నడచి కొనును, కనుక కోపముతో బోయిన ఆయత్తగారు శాంతు రాలై గారాబముతో గోడలి నింటికిదీసికొని వెళ్లినది.

73. తా॥ ఆవిధముగా దినదినమును వృద్ధియగుచుండిన ధ్యాన శక్తితో ఆవేలతలు క్రమక్రమముగా గృహచ్ఛిద్రము లయం దాసక్తి వదలి తను చిత్తములయందు బ్రపంచ ధోరణియే మఱచి మనోలయము నొందుచుండిరి.

## వివరణ:-

ఈప్రకారముగా బూర్వజన్మసంస్కారములు గలిగిన గోపికల నింద్రజాలమగు సంసారప్రవృత్తినుండి మఱలించి, భక్తులను సంసారచక్రమునుండి తఱింపజేయు ప్రభువైన యాశ్రీకృష్ణభగవానుడాగోపీజనమునకు ధారణాధ్యానస మాధియోగముల నలవాటుబఱచి సంయమనిష్ఠల నొనగిం

చెను. కాని గోపికలన్ననో ఆబాలకృష్ణు డవతారమూర్తి యని కాని, ఆజన్మజ్ఞానియని కాని యెఱిగికొనలేకపోగా, తామ ధ్యాత్మనిష్ఠ బొందుచుండుటయుగూడా తెలిసికొనియుండ లేదు. అనగా వారికి దమ బుద్ధియొక్క ప్రమేయములేకుండి ననూ తమశరీరములలో జీర్ణకోశము, శ్వాసకోశము మొద లైన వెట్లుపనిచేయుచుండెనో, యదేవిధముగా వారిబుద్ధి కవగతము గాకపోయిననూ తామాత్మనిష్ఠాధురంధరిణులగుట సహజమైనట్లుగా సంభవించినది.

74. తా॥ అక్కడ ఆయమునారణ్యములందు దోడిగోపాలు రాటపాటలయందు బ్రొద్దుబుచ్చుకొనుచుండగా, ఆజ న్మజ్ఞానియైన శ్రీకృష్ణు డేకాంతముసొచ్చి నిజగురువు లాదేశించినచొప్పున రాజయోగము బునశ్చరణము సేయదలకొని యమనియమములతో అష్టాంగయోగా భ్యాసదీక్షవహించి సాధన కుపక్రమించెను.

75. తా॥ ఆ ట్లాటపాటలయం దాసక్తి లేనివాడై శ్రీకృష్ణ డాయమునారణ్యములందలి వింతలను జూడదలచి యే కాంతముగా బోవుచు బృందావనము బ్రవేశించి, యొకపొన్నచెట్టుక్రింద గూర్చొని వినోదించుచు ఆయ మునానదియొక్క నీటిప్రవాహమును గమనించుచుం డగా,—

విశేషార్థము:-

అటు యమనియమముల నవలంబించి యేకాంతము జొచ్చిన శ్రీకృష్ణుడు దీక్షవహించి, యొకపొన్న చెట్టుక్రింద బద్ధాసనస్థుడై కూర్చొని, చిన్ముద్రబట్టి, క్రమముగా రేచక పూరక కుంభకములతో హృదయకోశమునందలి యపానవాయువును త్రేల్చుచుండగా,—

76. తా॥ అటువైపున పెద్దపెద్దయలలతో బొంగుచుండి, లోపలదాగియున్న కాళియసర్పమునకు నిలయముగా నుండిన యొక నీటిమడుగును గుర్తించి దానిని సమీపించెను.

విశేషార్థము:-

కొలది యభ్యాసముతోనే తెంపులేని యింద్రియవాసనలతో బొంగిపొఱలుచు, లోపలనణగియున్న కుండలినీశక్తి కాశ్రయముగానున్న మూలాధారచక్రము నెఱిగికొనినవాడై,—

77. తా॥ ఆట్లా కాళిందీమడువును సమీపించి, సాహసముతో ఆమడుగులోనికి దుముకదలంచి, మొలనున్న పీతాంబరమును గట్టిగా బిగించికట్టుకొని, శిరోజములను జక్కగాముడివైచికొని, హారములను కంఠమునకు మెలికలుగా దగిల్చికొని, పింఛమును దీర్చి యమర్చికొని, తన పైనున్న యుత్తరీయమును గూడా గ్రిందబడవైచి, శరీ

రము చెంచి, భుజములుగొట్టి, యూపుతో నుద్రేకము దెచ్చుకొని హుమ్మనుచు మూర్ఖపుపట్టుదలగా ముక్కు బట్టికొని, యెగిరి, యామడువులోనికి దూకినవాడై వలయాకారములు దిరుగుచు నలయక ఘోరముగా నీదులాడజొచ్చెను.

విశేషార్థము:-

ఒకనాడు వృథమగు బుద్ధితో దీవ్రముగా గుంభకములు సేయదలంచి, కటిచేలమును జక్కగావదులు సేసికొని, శిరోజములు గాలికెగిరి చెదరకుండా సర్దుకొని, హారములు దేహస్పృహ గలిగింపకుండునట్లుగా మెడతలుగా వేసికొని, మీది యుత్తరీయమునే యాసనయోగ్యముగా క్రిందబఱచికొని, బిగువుగా బద్ధాసనముమీద వెన్ను, కంఠము, శిరము సమానముగా నిలువరించి కూర్చొని, హస్తముసాపి చిన్ముద్ర బట్టి, పూనికతో "ఓం" అను ఏకాక్షరప్రణవమును స్మరించుచుం బ్రజ్ఞమీఱగా నొకముక్కురంధ్రమును మూసి, రేచించి పూరించుచూ, ఆ ముల్లోకేశ్వరు డలసటనొందక యమోఘముగా గుంభకములు సేయుచు, ఆమూలాధార చక్రమును భేదింపజొచ్చెను.

78. తా॥ ముఖ్యముగా దా ననేకమాఱులు మత్స్యకూర్మాది యవతారము లెత్తుచు మహాసముద్రములయందే యీది యున్న నేర్పరి కావున, శ్రీకృష్ణు డేమాత్రము నలయక

వీరావేశముతో గ్రుక్కబట్టి మునిగి తిరుగుచు ఆమడుగంతయు గలచి బురద బురద చేసెను.

విశేషార్థము:-

యథార్థమునకు దాను, యోగేశ్వరుడైన సగుణనిర్గుణమయపరబ్రహ్మస్వరూపుడును అవతారపురుషుడుగా వున అనంతవీర్యుడై దృఢముగా ననేక కుంభకములు సేసి తన చైతన్యశక్తితో నామూలాధార కమలమును భీభత్సము సేయజొచ్చెను.

79. తా॥ అట్లామడుగులోని జలచరములన్నియు బెగ్గడిలునట్లుగా అల్లకల్లోలమొనరించుచు విజృంభించి, యమడుగునేలవఱకుబోగా హఠాత్తుగా దన కాలుదాకి బుస్సుమనుచు దఱిమివచ్చిన కాళియసర్పమునుజూచి క్రీడావినోదియై,—

విశేషార్థము:-

ఆట్లామూలాధార చక్రమునందలి ప్రాణశక్తులు భరించి తట్టుకొనలేనట్లుగా గుంభించి భీభత్సము సేయుచు, నిజమనోబలమునుజూపి భేదించి, ఆమూలాధారకమలమునందు నిద్రించియున్న కుండలినీశక్తిని లేవగొట్టి లీలావినోదియై,—

80. తా॥ తన ముక్కురంధ్రములలో సంచరించెడి శ్వాసయొక్క బుసలే నాదముగను, నదీతీరమునందలి యరణ్యములనుండిన ఆలమందలు మొదలగుజంతువులు ప్రేక్షకులుగను, నరములయొక్కయు కీళ్లయొక్కయు

చప్పుడులు మద్దెల మొదలగు వాయిద్యములుగను, ముక్కు యూదునప్పుడు ప్రసరించెడి యూపిరియొక్క గతులు తాళముగను, ఒక పెద్దబూర నాగస్వరముగను మేళముసేసికొని ప్రపంచమునకంతటికి నాశ్చర్యముగలుగునట్లుగా, ఆమడుగులోని తామరపుష్పములమధ్యనున్న కాళియసర్పముపై నిలబడి యూతుంటరి పిల్లవాడైన గోపాలకృష్ణుడు కన్నులుగూడా మూసికొని పరవశమొందుచు మోడివేసెను,—

విశేషార్థము:-

అట్లు సులభముగా బాల్ణాయూమసిద్ధిగాంచిన శ్రీకృష్ణుడు దదేకదీక్షతో ప్రత్యాహారముసేయువాడై సోహంభావమే స్వరముగాను, దశేంద్రియములే ప్రేక్షకులుగాను, 72,000 నాడులధ్వనులే బహువిధవాద్యవిశేషముగాను, కుంభకమునందు బరిభ్రమించుచుండిన శ్వాసయొక్క గతియే తాళముగను, నిత్యానందదాయకమగు బ్రహ్మనాళమే నాగస్వరముగను నన్వయించికొని, ముల్లోకములకు నూతన మంగళమొనగూర్చెడి సర్వోపనిషద్సారసంగ్రహమైన గీతోపదేశవైఖరిసూచించుచు, చైతన్యమాత్రస్వరూపుడై యూపద్మాసనము మీదనేయుండి తనమూలాధారకమలముమధ్యనున్న కుండిలినీశక్తి నాడించుచు, తదధిష్ఠానదేవతయైన గణేశునకారువందల హంసగాయత్రిని "వశషస" బీజాక్షరములతో జపించి సమర్పించెను.

81. తా॥ ఆప్రకారముగా గాళియమర్దన మాచరించిన శ్రీ కృష్ణుడాయమునారణ్యములలో నెల్లలుమిాఱిభయంకర మైన చోట్లుగూడ బ్రవేశించి యావులమేపికొనుచుం డగా దేవేంద్రుడు రాలవాన గురిపించెను. అప్పుడా వర్షములో గోవులు దడిసి బెగడువడి చావ సిద్ధము గాగా దక్షణము శ్రీకృష్ణుడాదాపుననున్న గోవర్ధన మను కొండను లేవనెత్తి ఆవులమందల కాశ్రియమిచ్చి వాటిప్రాణములు దక్కించెను.

విశేషార్థము:-

ఆవిధముగా బ్రిత్యాహార మొనరించిన శ్రీకృష్ణుడు మూలాధారచక్రమునుండి సహస్రారకమలమువరకుగలయేడు చక్రములనుదాట వలెనని ధారణాయోగమునుబూని నిర్మల త్వముబొందుచుండగ చంచలమైన మనస్సుయొక్క పరివర్త నచేత సూక్ష్మముగానున్న యింద్రియములు క్షోభించి దుర్బల మగుచు సడలి నశించిపోవుచుండగా నంతలో సులభముగా స్వాధిష్ఠానకమలములోని రేతోబిందువును గదల్చియూర్ధ్వరేత స్కుడైనందున ఆయింద్రియములకు బూర్ణసత్త్వముగలిగి బున ర్ధారణము నొందెను.

**వివరణ:-**

ఇక్కడ నొక గూఢమైన విషయముగలదు. ఏమన, అదివఱ కధోముఖముగానుండిన కుండలనీశక్తి లేచినప్పు డూర్ధ్వముగా బైకిబ్రాకుచు సుషుమ్నామార్గముగా నడచునప్పుడు,

దద్వారభేదనముతో సాధకునికి ప్రాణాపాయమే సంభవించును. లేక, ఆసుషుమ్నా నాడిలోనున్న మలము కపాలమున కెక్కిననూ మెదడు సెడి పిచ్చివాడగుటయు జరుగును. అట్టి యే ప్రమాదముగలుగకుండా ఆపాచి కుత్తుకలోనికే వచ్చినిలబడి నోటిలోనుండి యుమియబడుటకు ఆక్రియాసిద్ధి తన పురుషార్థములో లేక కేవలము సాధకుని యొక్క భగవద్భక్తి తాత్పర్యమును, ఆసర్వేశ్వరుని యొక్క దయాకటాక్షము నైయున్నది. ఈస్థితిలో సాధకునికి భౌతికముగా నొక పెద్దజబ్బు చేసి క్రమేణనివారించును. ఆపరీక్షతో ఆవ్యక్తి జీవన్ముక్తి గూడ ఆజన్మలోనే సాధింపగలుగుననుట నిస్సంశయముగా నుండును, యెందువల్లననగా నటనుండి ఆపరమేశ్వరునిశక్తియే తన మనస్సును ఆకర్షించి లాగికొనిపోవుచున్నది. మూలాధారచక్రమునుండి కుండలినీశక్తి కదలువరకు, మానవుడు గర్మేంద్రియములకువశ్యుడై స్త్రీలోలుడైయుండును. ఆకుండలినీశక్తియూర్ధ్వముఖమైన కామము స్వతః గానే నశించి బ్రహ్మచర్యము నిర్విఘ్నముగా నిలచుచున్నది. ఈకుండలినీశక్తి నాభీకమలము యొద్దనున్న మణిపూరకచక్రమును జేరియున్నను, ప్రమాదముజరిగిన మఱల మూలాధారమునందు వచ్చినిలచును, గాని యది యామణిపూరకచక్రమును గూడా గడచియున్న, తిరిగి మూలాధారచక్రము వరకు రాజాలక మణిపూరకచక్రమునందే నిలబడిపోవుచున్నదనియు యోగశాస్త్రము చెప్పుచున్నది.

82. తా॥ ధీరుడైనగోపాలకృష్ణుడట్లుని రాటంకముగా గోవులను మేపికొనుచు, అరణ్యమధ్యమును బ్రవేశించి,

దూరప్రయాసముచే నొక్కింత విశ్రమించగా, నం
తలో నొక విపరీతమైన యీలవంటిధ్వని విని మేలు
కాంచి, యెవ్వడైనా బోయవా డాదాపున దిరుగుచు
ద నొకయాడవిమృగమని పొఱపడి బాధించడుగదా
యని తన జాతకలక్షణము దలచికొనుచు ధైర్యము
దెచ్చికొని నలుదిక్కుల బరికించి చూచెను.

విశేషార్థము:-

సిద్ధసంకల్పుడైన శ్రీకృష్ణు డట్లు నిర్విఘ్నముగా యోగ
సాధన జేయుచు నూర్ధ్వరేతస్కుడై శ్వాసను హృదయస్థానము
నందలి అనాహతచక్రమున జేర్చి చిత్తశాంతినొందుచు ధార
ణాయోగ మతిక్రమించుచుండగా నంతలో నొక చిత్రమైన
"ర్రీజ్" కార శబ్దమొకటి విని మిక్కిలి శ్రద్ధతో ఆధ్వనియందు
బుద్ధిని దీవ్రముగా బ్రవేశపెట్టి సంయమన మొనరించెను.

83. తా॥ అట్లు జాగరూకుడై యాయడవిలోని చిన్నచిన్న
యెండుటాకుల చప్పుళ్లను, కిచకిచమను పిట్టలయొక్క
కూతలను, టంటం అని దొర్లుచుండెడి రాతి బండ
లయొక్క శబ్దములను, వెదురుచెట్లు మొదలైనవాటి
యొక్కయొరపిడిధ్వనులను, నలుగడలబరుగులెత్తు జిం
కలు లేళ్లు మొదలగు జంతువులయొక్క గిట్టలచప్పు
ళ్లను, ఆకసమును గప్పియున్న మేఘముల యొక్క
గర్జలను, నాలకించి, విమర్శించికొనుచు, సావధానుడై

యా యరణ్యసీమయందు దనకు వినిపించుచున్న "రీఙ్" కారము ద ద్వాయువుయొక్క ప్రకృతిసిద్ధ మగు ఝుంకారమేగదా యని బుద్ధితో సమాధానపడి మనస్సుగుదుర్చుకొని భయరహితుడయ్యెను.

విశేషార్థము:.

శ్రీకృష్ణు డట్లనాహతచక్రమునుండి స్ఫురించిన "రీఙ్" కారముపై సంయమనము సేసి, క్రమముగా ద దంతర్భాగమైన "చిణీ" నాదమును, "చిణి-చిణీ" నాదమును, ఘంటారవ మును, శంఖనినాదమును, వీణానాదమును, తాళధ్వనిని, వేణు స్వరమును, భేరీ నాదమును, మృదంగ శబ్దమును మేఘధ్వ నిని, శ్రద్ధాయుక్తుడై విమర్శించికొని, యానంద పరవశుడై, అకార బీజమైన ఆసమష్టి నాదమునందు, ఉకారసంజ్ఞనొప్పు బుద్ధీంద్రియమును జొనిపి, తత్పర్యవసానముగా నొదవిన "మ్" అను వాచ్యార్థమునందు లక్ష్యముసేసి, సప్తకోటి మహామంత్రములకు మూలమైన యా "ఓం" కార బీజమును దనహృదయకర్ణికయందు సంశయరహితుడై ఆరాధించెను.

## వివరణ:-

84 లక్షల జీవరాసులందు "నేను—నే"నను అహంకా రభావము సమానముగానేయున్నది. ఈ "నే"ననునప్పు డాభా వము పాదములందుగాని, శిరస్సునందుగాని కలుగక హృద

యము నందే తెలియవచ్చుటచేత "నే" నని యచ్చోటనే చూచుకొనుచున్నాము. మఱియు ముక్కురంధ్రములద్వారా నడచుచుండెడి శ్వాస, లోనికిబోవునపుడు "సో" అనియు, వెలుపలికి వచ్చునప్పుడు "హం" అనియు ధ్వనించుచున్నది. అట్టి "సోహం" అను పదము "సః + అహం" అను మాత్రల చేగూడికొనియుండి "సః" అను సత్తామాత్రస్వరూపమైన పరబ్రహ్మమునందు, "అహం" అను జీవాత్మను హృదయకమలమునుండి కలుపుచున్నది. అంతేగాక యీ "సోహం" అను అజపా గాయత్రీమంత్రవిశేషముచేతనే, పశుపక్ష్యాదులైన జీవులుగూడా క్రమముగా నుచ్చజన్మలకు వచ్చుచు, తుదకు మానవజన్మ మెత్తగలుగుచున్నవని కూడా చెప్పబడియున్నది. అట్టి "సోహం" అను హంసగాయత్రియందలి హల్లులైన "స—హ" లను గొట్టివేసిన, "ఓం" అను అచ్చులతోగూడిన యేకాక్షర ప్రణవము నిలచుచున్నది. ఆ "ఓం" అను అక్షరమును విడదీసిన "అ" "ఉ" "మ్" అను మూడుమాత్రలు గన్పడుచున్నవి. "అ" యని పలికినప్పు డాధ్వని బొడ్డువద్దనుండి పుట్టి హృదయములోనుండి మీదికెగసి కుత్తుకవఱకు వ్యాపించుచున్నది. "ఉ" యను మాత్రయొక్క ధ్వని కుత్తుకలోనుండి పుట్టి నాలుకకొనవరకు వచ్చుచునది. "మ్" అను అనుస్వరము నోటికి వెలుపలగా పుట్టుచు, దీర్ఘముగా నెంత పొడవుగానైనను బోవుచున్నది. అట్టి మూడుమాత్రలుగలిసినచో "ఓం" అను అక్షరమన్నిరకములైన ధ్వనులు (లేక) అక్షరములకు మూలమై మాతృరూపముగానున్నది. ఈప్రణవశబ్దమునకు జాతిమతభాషాభేదములును, స్త్రీపురుషలింగభేద

ములును లేక సమస్తప్రాణులయందును సమానముగానే తెలియఁబడుచు "ఏకోఽపరబ్రహ్మ" త్వము నిర్దేశించు చున్నది. అంతేకాక వ్యక్తికి నెక్కుడు సంతోషము గలిగినప్పుడు, యెక్కువ దుఃఖము వచ్చినప్పుడు, "ఓ"—"హో" యను భిన్నధ్వనులలో జీవునిప్రాణము విలీనమై శాంతిబొందుచున్నది. మఱియు, రోగియైనవాడుగూడా "ఊఁ"యను భిన్నస్వరముతో మూల్గుచు ఆ "ఓం" కారమునందు శాంతిననుభవించుచున్నాడు. అట్టి మూర్తిత్రయరూపమైన "ఓం" కారమే శబ్దబ్రహ్మమై వేదములకుగూడా యందక, వేదాంతమనబడుచున్నది. అట్టి శబ్దాతీతమైన ఓంకారబ్రహ్మమే సత్ = శాశ్వితము, చిత్ = చైతన్యము, ఆనందము = సుఖము అను లక్షణముల మిశ్రమస్వరూపముతో సకలజీవులయందున నిలిచియున్నది. కావుననే యెఱుక చెడినజీవాత్మ యింద్రియములద్వారా సుఖాన్వేషణకై బాహ్యవిషయవాసనలందు పరివర్తనజేయుచు నెచ్చోటను నిత్యానందముగానక తపించుచు కర్మాభిమానముతో సంసారచక్రమునందు జన్మలెత్తుచున్నాడు. అట్టియింద్రజాలరూపమైన విశ్వమునకంతటికి, నవ్యక్తస్వరూపమైన ఆ ఓంకారపరబ్రహ్మమే సృష్టిస్థితిలయములకు గారణమై కర్మయోగప్రవృత్తిగల ప్రకృతితత్వములో ధర్మసూక్ష్మముగా వ్యాపించి, యీ క్రియాప్రపంచములో "సత్" గా నిలిచి "సత్కర్మ"యని నిర్వచింపబడుచు సర్వకాలసర్వావస్థలందును సాక్షిస్వరూపమై నిత్యముగా వెలయుచున్నది.

84 తా॥ వినను దాను భ్రమచే బొరపడిన బోయవాండ్రే యైనచో మోసమువాటిల్లునని తలచి యుపేక్షింపక,

ఆధ్వనిని నానావిధములఁ నాలకించి పరీక్షించి యను మానరహితుఁడై ఆయరణ్యమునందలి సకలచరాచర జంతుజాలములలోఁ దాను దప్ప యితరుల నెవ్వరిని గానక నిశ్చింతతోఁ దన శరీరశ్రమయంతయుఁ బూర్తి గాఁబాసిపోవునట్లుగా ఘనిద్రఁ జెంది మహాసుఖము నొందెను.

విశేషార్థము:-

అట్లు సచ్చిదానందస్వరూపమగు ఆత్మసాక్షాత్కార ముఁబొందిజీవన్ముక్తుఁడయ్యు దీక్షవిడువక విదేహముక్తినిగూడ ననుభవింపఁగోరిన వాఁడై శ్రీకృష్ణుఁడాయఖండపరిపూర్ణపర బ్రహ్మము నేకాక్షర ప్రణవ బీజముతోఁ ధ్యానించుచు నానావిధయుక్తిభేదములైన ప్రత్యక్షానుమానాగమప్రమాణ విధుల మననముసేయుచు, తన ఆత్మవంటి ఆత్మయే సకలజీవ రాసులయందు నున్నదని సమాధానము బొందినవాఁడై, తల్లక్ష్యమైన కేవలనిర్వికల్పసమాధి నధిగమించి, స్థితప్రజ్ఞుఁడై విశ్వాతీతుఁడగు ఆయఖండపరిపూర్ణ సచ్చిదానందమయపర బ్రహ్మమునందు లయసిద్ధినిగూడ ననుభవించి ఆయోగేశ్వరుఁడైన గోపాలకృష్ణుఁడు యోగీశ్వరుఁడయ్యెను.

## వివరణ:-

యోగసాధనకు మొదట యమనియమముల నలవరించికొని, తరువాత చిత్తవృత్తినిరోధకమైన సాధన మేదైనా

యభ్యసింపవలెను. ఈప్రయత్నమే యజ్ఞమున బరగి "యజ్ఞానాం జపయజ్ఞోస్మి" యన్నట్లు హింసాపూర్వకమైన యజ్ఞములకంటె జపయజ్ఞమే శ్రేష్ఠమైయున్నది. అట్లు వ్యవసాయము సేయగా క్రమేణ మనస్సు పరిపరివిధముల సంకల్పించుటలుమాని చిత్తము నిర్మలమగుచున్నది. అట్లు చిత్తశుద్ధి కలిగిన మీదట నిష్కల్మషమైన అద్దమునందలి బింబమువలె బరమాత్మని ప్రతిబింబమైన ఆత్మ ప్రత్యక్షముగా బుద్ధీంద్రియమునకు దర్శనమిచ్చుచున్నది. ఈస్థితికే "జీవన్ముక్తి" యని పేరు.

జీవన్ముక్తితో వ్యక్తి మోక్షాధికారి యగుచున్నాడు. కాని ప్రారబ్ధ మనునది పూర్తిగా నశించలేదు గనుక, ఆ యోగియొక్క జీవాత్మ హృదయకమలములోనుండి బైటకు దుమికిరాజాలదు. కావున ప్రారబ్ధమనుభవించుదనుక నంతఃకరణమునందే నణగియుండి, యవసానకాలమున గర్మరహితమయ్యెను గనుక బరమాత్మలో గలిసి పుట్టుటయే లేని మోక్షమొందుచున్నాడు. ఈ యోగ మెక్కుడు చిత్తశుద్ధిగల యధికారునకు ఆరుమాసములలోను, మధ్యస్థునకు ఒక సంవత్సరపరిమితిలోను, మూఢహృదయునకు బండ్రెండు వర్షములలోను సిద్ధినొసగుచున్నదని శృతి ప్రమాణము.

అట్లు ఆపరమాత్మలో ఈదేహమునందుండియే కలసిన "విదేహముక్తి" యనబడుచున్నది. దీనికి వేఱేయోగసాధనలు లేవు. జీవన్ముక్తుడాపరబ్రహ్మవృత్తిననుసంధానముసేసికొని తైలధారవలె ప్రణవధ్యానముసేయుచున హిహారాత్రములునిమగ్నుడై

డే గావలయును. అట్టి పరాభక్తికి మెచ్చికొని ఆ పర బ్రహ్మమే యావిశ్వరూపము గటాక్షించుచున్నది. అట్టి నిర్వికల్పసమాధిసిద్ధికి దేశకాలపాత్రాన్యాయములులేక నడచుచుండినను, మాటలాడుచుండినను గూడా అకస్మాత్తుగానే లభించుచున్నది. అట్టి అమనస్కయోగసిద్ధిని గాంచిన ఆజీవుడు తిరిగి ఆజీవన్ముక్తుని శరీరములోనికి మఱలివచ్చుటకూడా దుర్ఘటము. తన ఆత్మ యను జ్యోతి ఆపరంజ్యోతిలో గలిసి సముద్రములోబడిన ఉప్పుకల్లువలె అపరూపమే యగుచున్నది. కాని యొక్కొక్కప్పుడాపరబ్రహ్మమే తన్ను దెలిసిన ఆ విదేహముక్తుని లోకోద్ధరణమునకై మఱలబ్రతికించుచున్నాడు. కావున అట్టి నిర్వికల్పసమాధిలో నిర్జీవమైన జీవన్ముక్తుని కళేబరము నిరువదొకదినములవరకు శిష్యులు గాపాడుకొనవలసియున్నది. అట్లా కాలములో ఆదేహమునకు చైతన్యము గలుగకపోయిన సంస్కారము నడపవచ్చునని శృతివచనము. అది యట్టిది గావున, సాధకుడు జీవన్ముక్తి నొందిన తరువాత వెంటనే విదేహముక్తికి బ్రయత్నించుటయు ప్రమాదకరమని యెఱింగి, కేవలము స్వాభిలాషి కాక వేదాంతజ్ఞానమును ప్రచారముచేసి లోకములోని యజ్ఞానారాయణుల నుద్ధరించి, తదనంతరమే నిర్వికల్పసమాధికై యత్నింపవలయునని యాశృతులు నిర్దేశించుచున్నవి. అప్పుడాజీవన్ముక్తుని కా నిర్వికల్పసమాధి సిద్ధించినను, లేక యంతలో నవసానవేళ ప్రాప్తించినను, అనుభవ భేదమే గాని, మోక్షమునే పొందు

చున్నాడు గనుక పునర్జన్మము గలుగదు. కాని విదేహముక్తి గూడా నీభౌతికదేహములోనే సాధింపవలె ననిన అది కోటి జీవన్ముక్తులలో నొకానొకనికే గాని సిద్ధించుటలేదని శ్రీభగవానువాచ:

మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతామపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః॥

అనగా వేలకొలది గానుండిన సాధకులలో, నే యొకనికో జీవన్ముక్తి సిద్ధించుచుండగా, అటువంటి వేలకొలది సిద్ధులలోగూడా, నెవ్వడో యొక్కడే నన్ను సంపూర్ణముగా తెలిసికొన గలిగిన విదేహముక్తి సాధించి యనుభవింపగలుగుచున్నాడు సుమా!

85. తా॥ ఆజన్మజ్ఞానియైన శ్రీకృష్ణు డట్లు దృఢవ్రతుడై షణ్మాసప్రమాణమున జ్ఞానానందమహత్స్వరూపమును, అవ్యక్త పరబ్రహ్మము నైన ఓంకారమునందట్టి స్వానుభవసిద్ధి గాంచి, ఆవిధముగా అహంకారమును దీసివైచిన ప్రతిమానవుడును బ్రణవస్వరూపుడగుచున్నాడని సార్థకపఱచుటకుగాను, లోపలనున్న మలమంతయు దీసివేయబడి డొల్లగానుండిన వెదురుగొట్టమును పిల్లంగ్రోవిని తన విజ్ఞాన చిహ్నముగా స్వీకరించి ధరించెను.

86. తా॥ అట్లోకనాటిరాత్రి తెల్లవాఱుఝామున ఆబృందారణ్యమునందు బ్రణవధ్యాననిష్ఠాగరిష్ఠుడై తనిసి సనక

తన్నిష్ప్రపత్తికి బాహ్యాంతరముగ వేణువును గ్రహించి, గానలోలుడై, యొకగీతముతో నాగస్వరము నాలాపనజేయుచు నావేశపూరితుడయ్యెను.

37. తా॥ అట్లు విశ్వమంతట వ్యాపించి నిండుచుండిన ఆమురళియొక్క ప్రణవనాదమునకు నొకవైపున దనశరీరమునందలి 72,000 నాడులు లయమగుచుండగా, రెండవవైపున బాహ్యప్రపంచములో నాలమందలు మోరలెత్తి వినుచు దన్మయ మొందునట్లుగాను; ఇటు తన దేహమునందలి పంచప్రాణము లను ముఖ్యవాయువులు విలీనమై తనకు వశ్యమగుచుండగా, అటుబాహ్యసృష్టిలో ద్రాచుపాములు లేచి పడగలువిప్పి పరవశమొందునట్లుగాను; తన బ్రహ్మనాడియందలి షట్చక్రములు శ్వాసకు సులభమార్గములగుచుండగా, బాహ్యమున ప్రాతఃకాలముతో బాటు ప్రకృతియందలి పద్మములు చక్కగా వికసించునట్లుగాను; తన యొక్క స్థూలసూక్ష్మకారణోపాధిత్రయము నడలి బ్రహ్మానందమయమగుచుండగా, ఆచతుర్యామమున బ్రకృతింగల జీవకోటులు లాలింపబడి, మైమఱచి, గాఢనిద్రయను సుఖ మనుభవించుచుండినట్లుగాను; దన కుడిరెండవ హస్తములం దా జీవమాత్రుడైన బాలకృష్ణుడు మురళిని ధరించి, ఆబృందావనమునందు గానము సేయు

దొడగగా, సాక్షాత్తుగా ఆసర్వేశ్వరుడే హృదయ గోళమునందాయిడాపింగళానాడులమధ్యనున్న ఆసుషుమ్నా నాళమును ధరించి, నాదానుసంధానము సేయుచుండెనా యనునట్లుగా, ఆమురళీనినాదము కేవలము సోహంమంత్రరూపమగు బ్రహ్మనాదమైన ఓం-కారమై బ్రహ్మాండమంతయు నిండి ప్రతిధ్వనించెను.

## వివరణ:-

సిద్ధపురుషుడైన శ్రీకృష్ణభగవానుడు బాహ్యకృతముగా వేణుగానము సేయునప్పుడు గూడా తన యోగకౌశల్యముతో శుద్ధమైన ఓంకారనాదమునే ప్రవర్తింపజేయగలుగగా నదియంతర్బహిర్వ్యాప్తముగా ప్రసరించి యొకవైపు యోగసిద్ధి నొందిన ఆబాలకృష్ణుని వ్యష్టిరూపమును రెండవవైపు సమష్టిరూపమైన యావత్ప్రపంచమును నిర్మలమగు నానందమహాసముద్రమున నోలలాడించెను.

88. తా॥ అట్లు తొమ్మిదిరంధ్రములతో చేయబడిన యావెదురుగొట్టము, చాకచక్యముగల యెనిమిది వ్రేళ్లచే నెడతెగకుండా నాడింపబడుచు, వాయువుతో పూరింపబడగా ఆ గానరసము దశదిశలందు దట్టముగా వ్యాపించెను.

విశేషార్థము:-

అట్లు నవద్వారములుగలిగిన ఆగోపాలదేవుని శరీరము మహనీయమైన యష్టసిద్ధులతో జాజ్వల్యమానమై శ్వాస

పర్యటనచేత నుద్ఘాటింపబడిన ఆప్రణవనాదము దశవిధనాదములతో భూనభోంతరాళములు నిండునట్లుగా ఘూర్ణమానమయ్యెను.

89. తా॥ అట్టి సమయమున నాప్రణవనాదపరంపరలు చెవులబడగానే ఆవ్రేపల్లెవాడలోని గోపవనితలు దమ పూర్వజన్మజ్ఞాన సంస్కృతిచే నిద్రావస్థనుండి యకాత్తుగా దెలివివచ్చి కలవరబడుచు,—

90. తా॥ ఆయపూర్వనాద మిదివఱ కెప్పుడో వినియుంటిమి సుమా యని యాందోళనబడి పూర్వజన్మ సంస్కారబలముచే నయ్యది స్మృతికిరాగా, అమ్మహనీయమైన ఓంకారనాదమును గుర్తించి, తత్క్షణమే దేహవాసనల నొక్కట విసర్జించి, తేనెవాసనల కెదురుగా బరుగులిడు తేనెటీగల చందమున, ఆమురళీగాన ప్రవాహమున కెదురీదునట్టి వారలై,—

91. తా॥ తమతమ స్వగృహములనుండి వెడలి నిజభర్తలనుగుఱించిగాని తదితర సంసారవిషయములనుగుఱించిగాని తలంపనేఱక, తమ చిత్తశుద్ధి విశేషముతో బృందారణ్యమునందలి వ్యత్యస్తపాదారవిందుడైన వేణుగానలోలుని నిజమనోవీధియందు బొడగని, సంభ్రమాశ్చర్యములు మిప్పిరిగొనగా, నెదుట దోచుచుండిన ఆగోపాలదేవు నాతురపడి తమ రెండు గరములతో

నందుకొనబోయిన ట్లాహ్వానించుచు "కృష్ణా! కృష్ణా!" యను కేకలతో నా రాత్రియామునందా గోపికలు గొప్పలు ముడివీడగా నాయరణ్యమార్గములబట్టి-పరు గులెత్తి జనిరి.

92. తా॥ అ ట్లామురళీవినోదుని డాసి, యాగోపకాంతలు సాక్షాత్ భగవంతుడని తెలిసికొనిన వారై నందున, భయభక్తివినమ్రలై స్తోత్రములొనర్చి, తమ కా అద్వైతానుసంధానయోగప్రాప్తి దయజేసి కర్మరహితలను గావించి రక్షింపవలసినదని ప్రార్థించిరి.

93-94. తా॥ అప్పు డాజగదోద్ధారకుడగు శ్రీకృష్ణభగవానుడును ప్రసన్నుడై వారలకు బరమాత్మసందర్శనము గలిగింప నిచ్ఛగించి, పదునాల్గు భువనములకు మంగళప్రదమైన తన కుడిచేయి చాచి హస్తమస్తకసంయోగ మొనరించెను,—

95. తా॥ ఆకరస్పర్శతో వెంటనే సమస్త సంచితకర్మము నశించినవారలై ఆమానవతుఃతికష్టతరమైన నిర్వికల్పసమాధిని సునాయాసముగా నొక్కక్షణములోనే సాధింపగలిగి ఆ యఖండ పరిపూర్ణ నిరాకార పరబ్రహ్మసాక్షాత్కారము నొందిరి.

## వివరణ:-

మానవశరీరమునందు 72,000 నాడులు గలవు. ఈ నాడులన్నియు వేలువేలు దేవతాశక్తులుగా బరిగణింపబడి ఆ యా నాడీప్రసారములయొక్క ధ్వనులను బీజమంత్రములతో నారాధింపగా దల్లక్షితమైన నాడీప్రకోపము సిద్ధించుచున్నది. ఈమంత్రాక్షరములకు స్వరమే ప్రధానమై, యా నాడీస్వరముతో దన మంత్రోచ్చాటనాధ్వని యేకీభవించినతోడనే ఆనాడిలో సుష్ణముగలిగి దానిని గదలింపగా జ్యోతిర్కళలు గూడా బుట్టుచున్నవి. కావున నీమంత్రాక్షరముల నెగుడుదిగుడుగా గాని, భాషాంతరీకరణముగాని చేయగూడదు. అట్లొనర్చిన యవి ఫలమునీ గావు. ఆవిధముగా హృదయస్థానమునుండి కపాలమువరకు వ్యాపించియున్న యొకానొక నాడి అమృతనాడి యనబరగుచు ప్రణవారాధనతోడి గురుకటాక్షమువల్లనే తెలియబడి సంకల్పరహితమైన కేవలామనస్కయోగసిద్ధి బ్రసాదించుచు గపాలమోక్షలక్షణమైన విదేహముక్తి నొసగుచున్నది. కావున, అట్టిహృదయగ్రంధిని హస్తమస్తకసంయోగవిధానముతో నకస్మాత్తుగా సడలింపజేసియు దజ్జీవాత్మల స్థితప్రజ్ఞులుగా నిలువరించుట కాయాచర్యవరుడు z సాక్షాత్ శ్రీకృష్ణభగవానుడు గ్రీస్తుదేవులవలె గేవల మవతారపురుషుడు గావలయునేకాని, యితర సిద్ధపురుషులవల్లనూ గాదు. కాని గురుదేవుడైనవాడామార్గము నెఱిగికొని యున్నవాడు గావున నిజశిష్యు నవశ్యము గృతార్థుని జేయగలుగుచున్నాడు. అంతేకాక అట్టిసద్గురునికటాక్షములేనిదే ఆమోక్షకవాట మెఱిగికొనుటయే సాధ్యము గాదని శృతులు సెప్పుచున్నవి.

96 తా॥ అట్లు కేవలము సత్యమైనదియు, పుణ్యపురుషుల చేత గొనియాడబడునదియు, శృతిస్మృతేతిహాసములకు రహస్యమైనదియు, సత్వగుణప్రధానమైన ఆత్మనిష్ఠలో దర్శన మిచ్చునదియు, దేదీప్యమానమైనదియు, అవ్యక్తమైనదియు, ఆదియంతములులేని యఖండస్వరూపమైనట్టిదానిని,—

97. తా॥ సగుణము నిర్గుణ మను రెండునై యొప్పునదియు, శుద్ధసత్వరూపమైనదియు, జరారహితమైనదియు, నాశములేనిదియు, తెగగొట్టబడనిదియు, కదలికలేనిదియు, మాలిన్యదోషములేనిదియు, గోప్యమైనదియు, చైతన్యరూపమైనదియు, నిత్యమైనదియు, నంగుష్ఠప్రమాణమైనదియు, బ్రహ్మానందస్వరూపమైనదియు, సర్వవ్యాపియు, సర్వాంతరాత్మయు నైయున్న ఆదిపురుషుని,—

98. తా॥ బుద్ధికి నగమ్యమైన యవ్యక్తపరబ్రహ్మతత్వమును దమ హృదయాకాశమునందు జ్ఞాననేత్రముతో సువ్యక్తముగా సందర్శించి దివ్యమహిమ నొందినవారలై యాగోపిక లావిశ్వాత్ము నిట్లని స్తుతించిరి.

**వివరణ:—**

అసలు మానసిక ప్రపత్తిలో నేదైనా యొకవస్తువు నూహించుటకు దా నావస్తువు నొకప్పుడు గనినదైన వినినదైన యుండవలెను. ఎట్లనగా "ఆవు" యని చెప్పగానే

మనస్సునకొకయాపుయాకారము బొడగట్టి,తద్వారా తక్కిన విషయము గ్రాహ్యమగుచున్నది. అట్లదివర కేయాపును దాను జూచియుండని పక్షమున, దా జూచియున్న వేఱొక జంతువుతోనైనా పోల్చి చెప్పవలసివచ్చుచున్నది. అటువలెనే పరబ్రహ్మస్వరూపము సూచి మొఱుగనంత వఱకు నిట్టిట్టి దని నిర్దేశింప వీలుగాకున్నది. అందునను అవ్యక్త పరబ్రహ్మ మనలే గ్రాహ్యముగాఁజాలదు. అంతేగాక,యథాస్థితిలో జీవాత్మయు బరమాత్మస్వరూపమే గావున, దన మొగము దాను జూచుటకు వీలుగాదను న్యాయప్రకారమున, బరమాత్మస్వరూపము ముఖాముఖిగా దెలియ వీలులేకున్నదని శృతులుసెప్పుచున్నవి. ఐనను సమాధియం దాపరమాత్మదర్శనము బ్రత్యక్షముగా ననుభవవేద్యమే యగుచున్నదనియు, శృతివాక్యము. కావున ఆపరబ్రహ్మస్వరూప మెట్లుండునా యని తర్కించిన మన కనుభవస్థితిలో గాఢనిద్రావస్థ కావలగా బోల్చుకొనవలసియున్నది. ఆనిద్రావస్థయు దమోగుణప్రధానమేమైయున్నప్పటికి, అది యవ్యక్తాత్మికస్థితిలోని చిట్టచివరి దశగా నుండి, వ్యక్తసృష్టికి మొదటి మెట్టగుచు దశేంద్రియములతోగూడిన మనస్సు ననుదినము లయమొనరించి పునరుద్ధారణ జేయుచున్నది. కాన దాని కాశ్రయమగు శుద్ధసత్త్వప్రధానమైన నిర్వికల్పసమాధిస్వరూప మగు అవ్యక్త పరబ్రహ్మలక్షణమును ద దంతర్గతముగా నూహించికొనవలసియున్నది.

39. తా॥ హే జగదీశ్వరా! నీ విసమస్తమైన స్థావర జంగమ

ప్రాణికోటులందు సూత్రధారివై కర్తృత్వ భోక్తృత్వ ములు లేక సాక్షిమాత్రుడవయ్యు, సర్వాధారుడవై యుండి, మా పశువులు, యాదవులు, నందయశోదా దులు, మా బంధువులు, మేమునుగూడా సర్వము నీవే యగుచు నీవు గానివస్తువే యీ విశ్వములో లేదని యిప్పు డనుభవసిద్ధమైన యీవిజ్ఞానము మఱల మాకు జన్మజన్మకి మఱపుగలుగకుండునట్లుగా స్థితప్రజ్ఞురాం డ్రనుజేసి మమ్మనుగ్రహింపుమో యచ్యుతా! అనంత! హరి! పరమాత్మ! కృష్ణా! యని వేడుకొనిరి.

100. తా॥ ఓ యశోదాకుమారా! నీవు కేవలము మానవమా త్రుడవుగాక నిక్కువముగా నీ భూతకోటికెల్ల నాశ్ర యుడవైన ఆహిరణ్యగర్భుడగు పరబ్రహ్మవే సుమా! అట్టి నీవు భూభారముదొలగింపగా నవసరపడి యిట్లు లీలామానుషవిగ్రహుడవై యవతరించిన పురాణపురు షుడవే గదా!

101. తా॥ అని పరమానందముతో బ్రదక్షిణపూర్వకసా ష్టాంగదండప్రణామాదుల నాచరించి ఆగోవిందుని అనంతనామగుణముల గీర్తన జేయుచు నుతించిరి.

102. తా॥ ఆట్లు బాలకృష్ణు ననేక విధములుగా స్తుతించి ఆగోపాల దేవుని విజ్ఞానమయమగు మాయామానుషవి గ్రహమునందు జూపుల్లు నిలిపి ఆరాధించుచు.—

103. తా॥ భక్తిపరవశలై యత్యధికమైన యనురాగమును జెంది యాగోపిక లాపరిత్యక్తపరబ్రహ్మమైన బాలకృ

ష్ణుని నెత్తికొని, ముద్దుగొని, కౌగిటనిడికొని, భక్తి
వివశాత్ములై బ్రహ్మానందము నొందిరి.

104. తా॥ అంతియుకాక తామా యశోదాకుమారుని దివ్య
విగ్రహముపై జిరకాలమునుండి స్నేహభావము గలిగి
యుండినందున, నిరాకారమైన ఆయఖండనిర్గుణపర
బ్రహ్మైకాత్మ్యానుభవము నొల్లక కేవలభక్తిప్రధానలై,
ఆ అవ్యక్త పరబ్రహ్మమే యీ బాలకృష్ణుడై యవత
రించెనని సిద్ధాంతీకరించికొని సగుణోపాసనయందే
నిలిచి యారాధింపదొడగిరి.

వివరణ:-
కేవలాద్వైత సమాధియందు జీవాత్మ పరమాత్మయను
ద్వంద్వభావము నశించి సముద్రమునందుబడిన యుప్పుకల్లు
వలె నపరూపమగుచున్నది. అట్టి స్థితియందు మనస్సు గాఢ
నిద్రలోనుండునట్లు లయమైపోవుటచేత బుద్ధికిగూడా నయో
మయముగానేయుండి,ఆసమాధినిష్ఠనుండి మెలకువవచ్చువరకు
నేమియు దెలియక తరువాతనే తాను ఆనిష్ఠలో అట్టిసుఖము
నొందితినిగదా యని యెఱిగికొనగలుగుచున్నాడు. సగుణో
పాసనమన్ననో యట్లుగాక, తాను వేఱు, తేనె వేఱుగా
నుంటూ, తానా మధుపానము సేయునప్పు డుండునట్లుగా
ననుభవవేద్యమైన హృదయాహ్లాదమును బొందుచున్నాడు.
ఆయానందానుభవము దానాతేనెలో గరగిపోయినచో బ్రా
ప్తించుట లేదుగదా! కావుననే ప్రహ్లాదనారదాది నిత్యసిద్ధులు

గూడా తాము భగవద్భక్తి విశేషముతో నాజన్మజ్ఞానులై యెన్నిమారులైనను బుట్టుదుమనుచు భక్తిప్రసాదమునే వేడుకొనిరి కాని కించిత్ గర్భచరకమును గుఱించి యీ మాయసంసారచక్రమునకు భయపడి జన్మరహితమైన మోక్షము నాసించి యుండలేదు..

105. తా॥ అట్లు సగుణబ్రహ్మారాధనాసక్తలై యాగోపికలా బాలకృష్ణుని షోడశోపచారముల నిత్యము నర్చించి సేవింప దొడగిరి.

106. తా॥ ఓ నల్లని పిల్లవాడా యిటు రా! యని హాస్యమాడుచు వానమబ్బులవంటి కొప్పుగల యొకపొలతి యానందనందనుని స్నానము సేయించగా, వేఱొక సన్నని నడుము గల తన్వి ఓ గొప్పమగవాడా! యని మందహాసము సేయుచు వాని మొలకు బీతాంబరమును జుట్టును. ఓ గుట్టలెత్తెడివాడా!యని వెన్నముద్దలవంటి వక్షస్థలముగల యొకవెలది వెన్నదెచ్చి నైవేద్యము బెట్టగా, మంచికస్తూరివంటి శరీరవాసనగల వేఱొక చేడియ మాధవా! యని చేరదీసి దేహమునకు జందనముబూయును. చిగురుటాకువంటి యధరముగల నొక కన్నియ ప్రేమతో దాంబూలము నందించగా, పుష్పమాలవంటి కోమలమైన దేహముగల యింకొక జవ్వని కంఠమునకు బూలహారము వేయును. రత్నకంకణములు గలిగిన యొకయిల్లాలు మంగళహారతి నిచ్చు

చుండగా, మేటియైన కలకంఠి యొక్క తెయూగుచు
బాటబాడి లాలించి జోకొట్టును.

107. తా॥ ఈప్రకారముగా శ్రీకృష్ణ సేవాతత్పరలై మైమఱచియున్న తమ్ముగని మతిభ్రష్టలైరని బంధుజనులు బెగ్గడిలుచుండగా ఆగోపికలు జాగ్రదావస్థలో నుండినపుడు గూడా బాలకు డెవ్వడు దృగ్గోచర మైననూ ఆనందనందను డేయని భ్రమించుచు, దుద కా సర్వమయుని దివ్యరూపము దమబంధుకోటితో సహా సకల దేహధారు లందున ప్రత్యక్షముగా దమ మాంసపు కన్నులతోనే చూడగలిగిన వారలైరి.

108. తా॥ అట్టి పరమోత్కృష్టమైన పరాభక్తితో సమస్త భౌతికప్రపంచ మా కృష్ణదైవము యొక్క దివ్యవిగ్రహమయమేయని ప్రత్యక్షముగా జూచి యానందించుచు, బరమహంసలై, భావముఖసమాధియందు సిలిచి, సగుణబ్రహ్మమునందే సంచరించిరి.

**వివరణ:-**

అద్వైతసిద్ధి నొందినప్పటికీ, ఆశ్రీకృష్ణుడుగాని యీ గోపికలుగాని యాద్వాపరయుగాంతమునందే సన్యాసాశ్రమమునుస్వీకరింపలేదు. ఇకనీకలియుగమునందన్ననో, సన్యాసాశ్రమమునుని యోగమును, శ్రీశంకరాచార్యులవారిచేబూర్తిగాని షేధింపబడియున్నది. అసలు సన్యాసమనునది బౌద్ధమత సాంప్రదాయముగా బూర్తిగా కర్మసన్యాసమై పోయినది. వేదాంతమునందు జ్ఞానియైనవాడు నిరాటంకముగ భూతసేవ

జేసి లోకోద్ధారణము సేయవలయుననియు, నందులకుగాను దనకు లంపటలేకుండిన నెక్కడు స్వేచ్ఛగా దిరుగుచు జ్ఞాన బోధ జేయగలుగుననియు వ్రాయబడియుండినను, ఆయా చార్యుడు భార్యాసమేతముగాకూడా నుండవచ్చుననియే చెప్పబడియున్నది. గావున బ్రహ్మచర్య, గార్హస్థ్య, వానప్రస్థ సన్యాసాశ్రమప్రకారము జీవన్ముక్తి సాధించి, లోకసేవ జేయుటకే నిర్ణయింపబడియున్నను, బ్రహ్మజ్ఞానియైనవానికే యాశ్రమధర్మములులేక కర్మఫలత్యాగియగుచు జనకునివలెను శ్రీకృష్ణునివలెను రాజ్యభారముగూడా వహింపదగియున్నది. అంతేగాక, ఉపనిషత్తులందును పెక్కుచోట్ల రాజులే బ్రాహ్మణులకధ్యాత్మబోధ జేసియుండిరనియు గ్రహింపనగును. విశేషించి, జీవన్ముక్తి యను సగుణసాక్షాత్కారము సిద్ధించువరకు మనుజుడాశ్రమధర్మముల ననుసరించి, ఆత్మానుభవము దొరికినమీదట త్యాగియగుచు ననగా బుద్ధిమాత్రముగ కర్మఫలసన్యాసములో నిలిపికొనియుండి యజ్ఞానములోనుండిన సంసారుల ననుసరించియే వారి నుద్ధరింపవలసియున్నది. తుదకవసానకాలమెఱిగికొని నిర్వికల్పసమాధికొఱకు బ్రయత్నింపవలయును. ఏలననగా దానీయజ్ఞానవారాయణుల ప్రబోధింపకయే (సగుణసాక్షాత్కారముతో దృప్తినొందక) నిర్గుణసమాధిలో బ్రవేశించిన దక్షణమే తన జీవాత్మ పరమాత్మలో బూర్తిగా గలిసిపోయి తనకళేబరము సంస్కారయోగ్యమగుచున్నది. అట్లు కేవలము స్వలాభియైనను మోక్షదూరుడై నరకమునే పొందుచున్నాడనియు శ్రుతులు సెప్పుచున్నవి.

కనుక ప్రతిమానవునికి "బ్రహ్మం చరంతి బ్రహ్మచర్యంతి" అను నట్లు వేదాధ్యయనలక్షణమైన బ్రహ్మచర్యాశ్రమమనబడు 12 వర్షముల మాత్రకాలముతోడి కౌమారావస్థ గడచిన మీదట గృహస్థాశ్రమ వ్యవహారియై పండ్రెండు సంవత్సరముల మాత్ర కాలము సంసారధర్మ మవలంబించి, పిదప వానప్రస్థాశ్రమ లక్షణమైన పండ్రెండు వర్షముల యస్ఖలితబ్రహ్మచర్యదీక్షతో దపోనిష్ఠబొందుచు భార్యాసమేతముగానే నడపికొని యోగ సిద్దినొందుచు ధర్మార్థకామ మోక్షము లనుచతుర్విధ పురు షార్థములను సాధింపవలసియున్నది. అట్లు జీవన్ముక్తుడైన వాడు సన్యాసాశ్రమము బ్రవేశించి వేదాంతతత్త్వప్రచార మును ముగించికొని కృతకృత్యుడై పిమ్మట నిర్వికల్పసమాధికి బ్రయత్నించి విదేహముక్తినొందుచున్నాడు. కావున సన్యాస మనుదానికి గర్మసన్యాసమని పూర్వాచారము లేదు. సన్యా సాశ్రమమనగా కర్మఫలసన్యాసియై అనగా త్యాగియై భూపర్యటనచేసి జ్ఞానబోధచేయుచు తరువాత నిర్వికల్ప సమాధి కధికారి కావలసియుండుటచేత ముఖ్యముగా భక్తి యుగలిగియుండవలసియున్నది. అనగా కేవలకర్మఫలత్యాగ ముతోడి భక్తి లక్షణమే సన్యాసాశ్రమధర్మమై యుండెను. కాని బౌద్ధమతము ప్రచారమైన తరువాత సన్యాసమనగా బూర్తిగా గర్మనే సన్యసించుట యను నర్థవాదము బైలుదేరి సాధకునికి బ్రారంభదశనుండియు సన్యాసదీక్ష నిచ్చుచుండిరి. అందుచేతనే, శ్రీశంకరాచార్యులవారు అవతరించి, కలియుగ మున సన్యాసము నిషేధముగాజేసి, వేదాంతధర్మమును సం స్కరింపవలసివచ్చెను.

109. తా॥ అట్లు దమ తమ కుటుంబములం దుండియే మహా త్యాగినులై సగుణబ్రహ్మారాధన మాచరించుచు ఆ శ్వేత లనుదినము రాత్రియామముల శ్రీకృష్ణు డేయరణ్య మధ్యమునుండి వేణుగానము సేసినను, దత్క్షణ మా దేవ దేవుని జేరంజని ఆప్రణవనాదామృత రసాస్వాదనమున బ్రపంచమే మఱచి పోవు చుండిరి.

110-111. తా॥ అట్టి సందర్భములలో బామరులైననిజభర్తలు గాముకులై తమ్మరసికొనుచు వెళ్లి మన్మథ కేళీరతు లగుచుండిననూ, తత్క్రియా పరతనుపరమహంసలైన ఆగోపికలు పసిపాపలవలె గుర్తింపలేకయే, శ్రీకృష్ణుడే సన్నిహితుడాయెనను నిథిధ్యాసతో సంకల్పశూన్యలై పరిభ్రమించుచు, ఆప్రణవామృతపానముచే జొక్కి లయముబొందినవారలైరి.

112. తా॥ అట్లు దమపతులు తిరిగి యిండ్ల కేగగా, నంతలో దమ మనస్సులుగూడా క్రిందిమెట్టునకుదిగి యింద్రియ స్పృహ కలిగినవారలై తమ కడవఱకు సన్నిహితమై నట్లుగా దోచిన ఆ శ్రీకృష్ణస్వరూప మప్పుడు దాపున గనుపింపమి దపించుచు, కృష్ణాన్వేషలై యరణ్యమంత యు గాలించుచు నొకరి నొకరుగా కృష్ణుడేయని భ్రమించుచు దిరిగి తిరిగి తుదకాపొన్నవృక్షముయొద్ద నెప్పటివలె బద్మాసనాసీనుడై వేణుగానము సేయు చుండెడి ఆ గోపాలబాలునిజూచి చిత్తశాంతిబొందు చుండిరి.

113. తా॥ ఆవిధముగా జగన్నాటక సూత్రధారుడును అస్ఖలితబ్రహ్మచారియునైన ఆకృష్ణకుమారుడు దన బాల్యమునందా గోపీజనముతోఁగూడి వివిధలీలల గ్రీడించుచు లీలామానుషవిగ్రహుడై విహరించెను.

114. తా॥ అట్లు శ్రీకృష్ణు నాపదునాఱువేల గోపికాల లామ లర్పించి దాస్యముసేయుచుండగా నాకసమునుండి ఆ నక్షత్రములకు పతియైన చంద్రుడు సూంచియా మహాశోభ కసూయపడుచు క్షోభించి నిలువక వెనుకకు మఱలిపోవుచుండెనా యన్నట్లుగా బ్రతిదినము భల్లున దెల్లవాఱుచు ననేక సుదినములు గడచిచనెను.

115. తా॥ అట్లు నందనందనుడైన శ్రీకృష్ణపరమాత్ముడు దనకు బదునొకండు సంవత్సరముల ప్రాయము వచ్చుదనుక యశోదాకుమారుడై వ్రేపల్లెవాడలో బెరుగుచు ఆ రాధ మొదలైన గోపికాజనము నందఱను గర్వాతీతురాండ్రనుగా నొనరించి మోక్షాధికారుల జేసి క్రియాకర్తృత్వమును బాచికొనియెను.

116. తా॥ అట్టి మధురానగరనివాసియు, దుష్టజనశిక్షకుడును అవతారపురుషుడును శ్రీమద్భగవద్గీతోపదేశికుడునైన ఆ రుక్మిణీపతియగు శ్రీకృష్ణభగవానుడు నిత్యమంగళస్వరూపుడై యీ చరాచర జంతుజాలములకు సదా శుభమంగళ మొసగూర్చుగాత!!!

## -: గద్యము :-

ఇది శ్రీమద్భరద్వాజసగోత్ర పవిత్ర యెల్లాప్రగడవంశోద్భవ
లక్ష్మయాఖ్యాతపౌత్ర రామకోట యామాత్యపుత్ర
సీతమాంబికా గర్భ శుక్తి ముక్తాఫలాయమా
నానవరతాద్వైతానందసమ్మిళితచిత్తవశవర్తి
శ్రీ కృష్ణమూర్తి నామధేయ
విరచితతాత్పర్యవివరణసహిత
నిర్వచనైకాశ్వాస
శ్రీగోపికారహస్యం
బనుగ్రంథంబున
సర్వంబును,
సమాప్తము.



ఓం తత్ సత్.